చతుర
సంపుటి: 9 నవంబరు 1986 సంచిక: 10

## ఈనెల సమగ్ర నవల

"ఆరువందల మంది పేషెంట్లను హేండిల్ చేసే సామర్థ్యం మనకుందా?" అంటూ సందేహాన్ని వ్యక్తం చేశాడా కుర్ర డాక్టరు.

"ఉన్నా లేకపోయినా ఇది చాలా రహస్యంగా ఉంచాల్సిన విషయం. ఎవరికీ తెలియ జేయరానిది. మన రాష్ట్రానికీ, మనదేశానికీ అప్రతిష్ఠ తెచ్చేది. అందుచేత మనస్థాయిలోనే చికిత్స మొదలుపెట్టి చూద్దాం. నువ్వు నా కిచ్చే కో-ఆపరేషన్ మీద మనవని సఫలమవ్వచ్చు" అందా లేడీ డాక్టరు.

ఇంతకీ ఆ గ్రామప్రజల కొచ్చిన వింత వ్యాధి ఏమిటి?

అది వారి సంసార జీవితాలను ఎలా అల్లకల్లోలం చేసింది?

ఆ వ్యాధికి మూలకారణాన్ని నిర్ధారించటంలోనూ, దాన్ని నిర్మూలించటంలోనూ ఆ డాక్టర్ల ప్రయత్నం ఎలాంటి మలుపులు తిరిగి ఏ రకంగా ముగిసింది?

## ఘండికోట బ్రహ్మాజీరావు

ఉత్కంఠ గొలిపే రీతిలో పాఠకులకు అందిస్తున్న రచన

# బావి

ఈ నెల చతుర సమర్పిస్తున్న సమగ్ర నవల

కవర్ పేజీ ఫొటో గ్రావర్ : దిలీప్ బెనర్జీ



# చతుర ప్రపంచం



## ఆ వృత్తిలో ఏకాకి

మహారాష్ట్రలోని ధూలేకు చెందిన జుబేదా అబ్దుల్ గఫార్ షేక్ బహుశా మనదేశంలో ఆటోనడిపే వృత్తిని చేపట్టిన ఏకైక మహిళ కావచ్చు. విచిత్రమేమంటే, ఆమె విద్యాధికురాలై వుండికూడా ఆటో నడుపుకోవటం.

జుబేదా మరాఠీమీడియంలో మెట్రిక్యులేషన్ వరకూ చదివింది. తర్వాత గుజరాత్‌లోని బర్హాన్‌పూర్‌లో నర్సింగ్ కాలేజీలోచేరి నర్సింగ్‌లోడిప్లొమా చేసింది. ఆ కోర్సు పూర్తిచేశాక ధూలేవచ్చేసి తమ స్వంతభవనంలో సొంతంగా క్లినిక్ ప్రారంభించింది. కాని, తర్వాత ఆమె 'ఇంటర్‌షిప్' చేసేందుకు మళ్ళీ బర్హాన్‌పూర్ వెళ్ళి కాలేజీలో చేరవలసివచ్చింది. వెళ్తూ వెళ్తూ ఆమె తమ భవనంలో అద్దెకుంటున్న డాక్టర్‌కి తన క్లినిక్ నిర్వహించే బాధ్యతను అప్పగించి వెళ్ళింది.

కాని, ఆమె తిరిగొచ్చేటప్పటికి పరిస్థితులు తారుమారయ్యాయి. జుబేదా లేనప్పుడు డాక్టరు ఆమె తల్లితో దస్తావేజులపై అవసరమైన సంతకాలు చేయించుకుని ఆ భవనానికి తానే యజమానినని బుకాయించటం మొదలుపెట్టాడు. అతను మోసగించినట్టు జుబేదా కోర్టులో దావా వేసింది. అది కోర్టులో ఇంకా వాయిదాలు పడుతూ కొనసాగుతూనే వుంది.

క్రమంతప్పకుండా కోర్టువాయిదాలకి హాజరవుతుండే జుబేదాకి ఓ ఆటోరిక్షా డ్రైవర్ పరిచయమయ్యాడు. అతనేజుబేదాకి ఆటోనడిపే వృత్తిని చేపట్టమని సలహా ఇచ్చి, డ్రైవింగ్‌కూడా నేర్పాడు. జుబేదాకి ఆసక్తికలిగి స్థానికంగావున్న ఓబ్యాంకులో స్వయం ఉపాధి పథకంకింద ఇచ్చే లోను

కోసం ప్రయత్నించింది. ఆమె ఎన్నో ప్రయత్నాలు చేయగా చివరికి లోను మంజూరయింది.

1980లో జుబేదా ఆ డబ్బుతో ఆటో రిక్షా కొని బాడుగకు తిప్పసాగింది. ఆటో నడిపితే వచ్చే ఆదాయంలో ఖర్చులన్నీ పోను ఆమెకి రోజుకి 50 రూపాయలు మిగులుతుంది. ఆమె ఉదయం 5నుంచీ మధ్యాహ్నం ఒంటిగంటవరకూ ఆటో నడిపి, లంచ్ కోసం ఓ గంటసేపు విరామం తీసుకుని, మళ్ళీ సాయంత్రం 5 గంటల వరకూ ఆటో నడుపుతుంది.

అప్పుడప్పుడూ ఆటోకి వచ్చే చిన్న చిన్న రిపేర్లను స్వయంగా సరిచేయడం నేర్చుకుంది జుబేదా. శారీరకబలంలో పురుషులకేమీ తీసిపోనంటుందామె. ఒకసారి ఓ గ్రామంలో వుండగా ఆమె ఆటో చెడిపోతే ఒక్కతే 2 మైళ్ల దూరంలోని వర్కుషాపుకి ఆటోను లాక్కెళ్లింది. తన పట్ల అనుచితంగా ప్రవర్తించబోయిన రౌడీలు, తాగుబోతులకి కూడా తగిన విధంగా బుద్ధిచెప్పిన ధైర్యవంతురాలామె.

జుబేదా ముస్లిం మతానికి చెందినది కావటంతో మొదట్లో ఆమెకు కొన్ని అవ






# అమ్మకం తర్వాత ఆ సేవాసౌకర్యం కోసం మీరు అంతంత దూరం వెళ్ళవలసిందేనా?

టీవి తయారుచేసే చాలా మంది, వాళ్ళ అమ్మకం తర్వాత సేవా సౌకర్యాన్ని గూర్చి తెగ చెబుతారు.

దానికి కారణం యిది–మామూలుగా మీ చేతికి అందించే ఆ గ్యారంటీ కార్డు తప్ప అంత గాబరా పడేదేదీ వాళ్ళు మీకివ్వలేరు గనక.

నిజానికి ఆ గ్యారంటీ ఏపాటిది గనక ?

మీకు తలనొప్పి, ..., కాళ్ళరిగేలా తిరగటం తప్ప.

అందుకంటే, మీరు మీ టీవి సెట్టును భుజానవేసుకుని వూళ్లో ఒక మూల నుంచి మరో మూలకి తెగ తిరగవలసివస్తుందిక- అంతే.

కాని అలా జరగక్కర్లేదే ? మీరు కొనే టీ.వి.కి విస్తృతమైన, నమ్మయోగ్యమైన, విస్తరించుకునికున్న సేవాసౌకర్యాలు గనక వుంటేనో-అంటే, ఈ.సి.టీవి. లాగ అన్నమాట–అప్పుడలా జరగదే !

మరి ఈ.సి.టీవి ... అలాంటి యిలాంటి మరో టీవి ... కాదు గనకాను.

ఎందుకంటారా, ... మోనేళ్ళుగా ఈసిఐఎల్ వాళ్ళేగదా ... దేశంలో అసలు టీవి టెక్నా... ప్రవేశపెట్టి, ముందంజ వేసినవారు ? కలర్‌లోనూ, బ్లాక్ అండ్ వైట్ టీవిల శ్రేణిలోనూ ఒక ఉత్కృష్టమైన స్థాయీ, స్థానాన్ని తెచ్చింది ఏరేగదా ? పేచీపెట్టని తీరులో ఏళ్ళ కేళ్ళుగా మీ టీవి పనిచేస్తున్నది అందుకేగదా ?

దీన్లో ప్రతి పార్టుకి, ప్రతి సర్క్యూట్‌కి, ప్రతి విడి భాగానికి సరియైన మేళవింపు వుంది— దాంతో ఎలక్ట్రానిక్ టెక్నాలజీలో విస్మయమైన సంపూర్ణ సమగ్ర చిత్రం రూపొందుతుంది. దాంతో అత్యంత స్పష్టమైన సొంపైన చిత్రాలు కనిపిస్తాయి. అత్యంత శ్రావ్యమైన, యింపైన ధ్వని. మీకు ఎప్పుడూ యిబ్బంది పెట్టకుండా పనిచెయ్యడం.

అంతేకాదు, ప్రతి ఈ.సి.టీవి సెట్టు వెనకా దేశ మంతటా విస్తరించివున్న అత్యంత సమర్థవంతమైన సేవా సౌకర్యాలున్నాయి. ప్రత్యేకమైన 30 ఈ.సి.టీవి కేంద్రాలు. 400 మంది నమ్మకమైన డీలర్లు. మరంటే మీరొక్క ఫోన్ కాల్ కొడితే చాలు–అంతే.

మీకింకా ఏమేం యిస్తామో తెలుసుకోవాలని వుంది కదూ, మీ ఈ.సి.టీవి డీలర్‌ని కలుసుకోండి. తెలుస్తుందప్పుడు మీకిక యీ చెప్పిందంతా పొల్లుబోదని, మేం అంటే ఈ.సి.టీవి మాట నిలబెట్టుకుంటుందనీను.

లేదా యింతే దూరం అయితే చాలా ?




దీనిని అనుకరించడం ప్రతి టీవీ ప్రయత్నం.



రోధాలు ఎదురయ్యాయి. ఇరుగుపొరుగు ఆడవాళ్లు ఆటో నడుపుతున్న ఆమెను చులకనగా చూడటమేకాక శీలాన్ని కూడా శంకించారు. కాని ఇప్పుడా ఊళ్లోని ప్రతి ఒక్కరూ జుబేదా గుండె ధైర్యాన్ని ప్రశంసించేవారే. ఆమె మరికొందరు ఆడవాళ్ళను ఆటోనడిపే వృత్తిని చేపట్టమని ప్రోత్సహించిందిగాని ఎవరూ ముందుకు రాలేదు. ప్రస్తుతం జుబేదా తమ ఊళ్ళో 12వందలమంది సభ్యులుగల ఆటోరిక్షా డ్రైవర్ల సంఘానికి అధ్యక్షురాలు కావడం, ఆమె తన వృత్తిలో సాధించిన విజయానికి ఓ తార్కాణం!

## 35-25-36

తమ తమ శరీర స్వభావాల ప్రకారం సన్నగా వుండేవాళ్లు లావెక్కటం అరుదైనట్టే, లావాటివాళ్లు సన్నబడటమూ అరుదైన సంగతే! కాని 35 ఏళ్ళ వయసుగల పాలైన్ హెమ్మింగ్ 140 పౌన్ల బరువు తగ్గి ఎందరినో ఆశ్చర్యచకితుల్ని చేసింది. "చిక్కి సగమైంది" అనే మాట ఆమెకి అక్షరాలా వర్తిస్తుంది. ఇంగ్లండులోగ్లూ సెష్టర్ షైర్‌కు చెందిన ఆమె లావు తగ్గకముందు 273 పౌన్ల బరువుండేది. ఆమె కొలతలు 56-45-56 నుంచి లావుతగ్గటంతో 35-25-36కి మారాయి.

అవివాహితురాలైన హెమ్మింగ్‌కి, ఓ ప్రసిద్ధ హెవీవెయిట్ బాక్సర్ కంటే తనే 42 పౌన్లు ఎక్కువ బరువున్నట్టు తెలిశాక బరువు తగ్గాలనే పట్టుదల కలిగింది. అప్పట్నుంచి తగినకృషి చేసి ఒక ఏడాది వ్యవధిలో బరువు చాలావరకు తగ్గించుకుంది.

హెమ్మింగ్ ఆవిధంగా బరువు తగ్గి నాజూకుగా తయారవటంతో, లండన్‌లోని 'స్లిమ్మింగ్' అనే పత్రిక ఆమెకు 'స్లిమ్మర్ ఆఫ్ ది ఇయర్' అవార్డుతో వెయ్యిపౌండ్లు నగదు బహుమతి ఇచ్చింది.

## నిచ్చెన అక్కర్లేని మనిషి

ఎనిమిదడుగుల మూడంగుళాల ఎత్తుండే 'మొహమ్మద్ ఆలం చిన్నా' ప్రపంచంలోని మనుషుల్లోకెల్లా పొడుగైనవాడు.

పాకిస్థానీయుడైన అతను నిరాడంబరంగా ఉంటాడు. ముక్కుసూటిగాపోతుంటాడు. మాంసాహారమన్నా, ఎక్కువ దూరం నడవటమన్నా ఇష్టం!

నలభై ఏళ్ళ వయసుగల అలం చాలా సరదాగా కాలం గడిపేవ్యక్తి. అతను అమెరికా, యూరప్, జపాన్ మొదలైన అనేక దేశాల్లో పర్యటించాడు. మంచి నడవడిక, ప్రత్యేకమైన ఆకారం కలిగిన అతన్ని ఆ పర్యటనల్లో విదేశీయులు చాలా మంది తమ ఆతిథ్యం స్వీకరించమని ఆహ్వానిస్తారు.

అతను పాకిస్తానులో జరిగే అనేక ఉత్సవాలు, సాంస్కృతిక కార్యక్రమాల్లో ఆ ప్రభుత్వపు అనధికార ప్రతినిధిగా వ్యవహరిస్తుంటాడు.

అలం ఎత్తు చూసి చాలామంది చిన్న పిల్లలు వెక్కిరించినా అతను దాన్ని చిరు నవ్వుతో స్వీకరిస్తాడు. అలంకి తమ ముస్లిం మతంపై గాఢవిశ్వాసం వున్నా తక్కిన మతాల్నికూడా ఎంతో గౌరవిస్తాడు. అతను రోజుకు అయిదుసార్లు నమాజు చేస్తాడు. మాదకద్రవ్యాలకీ, ధూమపాన, మద్యపానాలకీ దూరంగా వుంటాడు.

ప్రస్తుతం అలం నివసిస్తున్న సహబాజ్ కలందర్ హిందువులు, ముస్లిములు ప్రతి ఏటా సందర్శించే పుణ్యతీర్థం. అక్కడికెళ్ళే యాత్రికులు పవిత్ర దర్గాకు వెళ్ళిన తర్వాత అలంను కూడా కలిసి అతని దీవెనలందుకుంటారు. అలా యాత్రికుల దృష్టిలో అతను భగవత్ స్వరూపుడిగా పేరుతెచ్చుకున్నాడు.

అలం ప్రతిరోజూ ఉదయం 5గంటలకే లేచి తనకిష్టమైన ఏలకుల పొడి కలిపిన బ్లాక్ టీ తాగుతాడు. అతనికి రోజూ మూడుపూటలా మాంసాహారంకావల్సిందే.



8 గంటలకి తనుపనిచేసే ముస్లిందర్బారుకి వెళ్తాడు అలం. అక్కడ ఓ హాల్లో ఎంతో ఎత్తునవుండే సైకప్పుకి అందమైన షాండి లీర్లు వేలాడుతుంటాయి. బాగా పొడుగ్గా వుండే ఆలం నిచ్చెనలాంటివాటి సాయం లేకుండా కింద నిలబడివుండే వాటిని తుడుస్తాడు.

ఆలం తనకోసం ప్రత్యేకంగా టాపు లేకుండా తయారుచేసిన రిక్షాలో ప్రయాణం చేస్తాడు. పొడుగాటి షేర్వానీ పైజామాలు ధరించే అతను గత 20ఏళ్లుగా పర్వేజ్ అనే దర్జీ దగ్గరే బట్టలు కుట్టించు కుంటున్నాడు. ఇతరులెవరికీ తనకోసం బట్టలు కుట్టటం చాతకాదంటాడతను.

ఆలంపై డాక్యుమెంటరీ తీయించి టెలివిజన్‌లో ప్రసారంచేసి, అతన్ని చూడటానికై తమ దేశానికొచ్చే పర్యా టకులను పెంచుకోవాలని పాకిస్తాన్ ఆశిస్తోంది.

# మసాయియాలు

కెన్యాకు చెందిన మసాయీ గిరిజనుల జీవనవిధానం ఎంతో వింతగా వుంటుంది. కొందరు చరిత్ర కారులు, సామాజిక వేత్తలు-మసాయీలు తక్కినఆఫ్రికన్లలా మద్దెలు వాయించరుగనుక నిజానికి వారు ఆఫ్రికాకు చెందినవారు కాదంటున్నారు. తమకు కావలసిన నీరు, తమ పశువులకి అవసరమైన మేతకోసం మసాయీలు నైలునది తీరం వెంబడి ప్రయాణం చేస్తూ కెన్యాకు చేరుకున్నారని చరిత్ర కారుల నమ్మకం!

1880లో కెన్యాలో ఎన్నడూలేనంత క్షామం ఏర్పడి మసాయీలు అనేకమంది మరణించారు. అయినా కాలక్రమంలో ప్రపంచమంతటా అనేక మార్పులు ఏర్పడినా మసాయీల జీవన విధానంలో మార్పునేది లేదు. వారు తమ ఆచార సంప్రదాయాలకు అంతటివిలువ ఇస్తారు. వారి జీవితంలో ఎక్కువభాగం తమ సంపదైన ఆవులు, మేకల పోషణతోనే సరిపోతుంది. వాళ్ళు తమ పశుసంపదను ఇన్‌కాయ్ అనే దేవుడు ప్రసాదించినట్టు భావిస్తారు!

ఇద్దరు మసాయీలు ఎదురుపడినప్పుడు "మీ ఆవులెలా వున్నాయి?" అనే ప్రశ్నతో మాట కలిపి, ఆ తరువాత కుశల ప్రశ్నలు వేసుకుంటారు. వారికి ప్రీతికరమైన పానీయం 'సరోయ్'. అది ఆవుపాలు, రక్తమూ కలిపిన మిశ్రమం. రక్తంకోసం వాళ్ళు ఆవును చంపరు. ఆవు మెడదగ్గిర ఒకచోట బాణంతో గంటుపెట్టి అప్పుడు కారే రక్తాన్ని ఓ పాత్రలోకి పడతారు. ఆ రక్తం ఆవు పాలలోకలిపి 'సరోయ్' తయారుచేస్తారు.

మసాయీలు వ్యవసాయం చేయరు. వాళ్ళు భూమినితవ్వటం మహాఅపరాధంగా భావిస్తారు. అందుకే వాళ్ళు నీటికోసం బావులుకూడా తవ్వరు. వారికోసం కెన్యా ప్రభుత్వం అనేక బావుల్ని తవ్వించినా వాళ్ళు బావి నీరు వాడుకోరు.

మసాయీలు గుంపులుగా నివసిస్తారు. ఆ గుంపుల్లోనే వివాహితులు, అవివా హితుల్ని రెండుగా విభజిస్తారు. వారిలో ఓ పురుషుడు ఎందరు స్త్రీలనైనా పెళ్ళి చేసుకోవచ్చు. అక్కడ ఒలేసెంట్యూ అనే ఓ 99 ఏళ్ళ వృద్ధుడికి 22 మంది భార్యలూ, 100మంది పిల్లలూ వున్నారు.

మసాయీలు నివసించే చోట సాధార ణంగా కొన్ని గుడిసెల చుట్టూ ఓ కంచె వుండటం కనిపిస్తుంది. ఆ ఆవరణలో ప్రవేశమార్గానికి కుడివైపువున్న గుడిసె






మొదటి భార్యదైతే, మిగిలిన భార్యల గుడిసెలు ఎడమవైపు వుంటాయి. వాటిని బట్టి ఆ మసాయీకి ఎందరు భార్యలో తెలుసుకోవచ్చు. ఆ గుడిసెల లోపల మనిషి నిటారుగా నిలబడేంత ఎత్తు లేక పోవటమేకాక వాటిలో సరైన గాలీ, వెలుతురూ వచ్చే ఏర్పాట్లూ వుండవు.

మసాయీ స్త్రీలు రాగి ఆభరణాలు ధరించి, మొలకు ఓ ముతక వస్త్రాన్ని చుట్టుకుంటారు. కొన్ని వంట పాత్రలు, ఓ రాతిపొయ్యి, కూర్చునేందుకు ఆవు చర్మం ఇవే ప్రతి మసాయి కుటుంబానికీ వుండే సామగ్రి. బ్రహ్మచారులైన మసాయీలు విడిగావుండేగుడిసెలలోవుంటారు. వాళ్ళుండటానికి దాదాపు 100 గుడిసెలుంటాయి. అన్నిటినీ కలిపి 'మస్‌యతా' అంటారు.

మగపిల్లవాడు యుక్తవయస్కుడయ్యాక తల్లిదండ్రులకు దూరంగా ఆ గుడిసెల్లోవుండాలి. ఆవిధంగా 'మస్‌యతా'లో అతనుగడిపే పదేళ్ళకాలంలోనూ యుద్ధ సంబంధమైన విద్యలలో శిక్షణ ఇస్తూ, మసాయీల ధైర్యసాహసాలకు సంబంధించిన కథలు వినిపిస్తారు. వారిపై కఠినమైన క్రమశిక్షణను అమలుపరుస్తారు. ఆకాలంలో ఆడవారితో మాట్లాడగూడదు. ధూమపానం, మద్యపానం చేయరాదు. 'మస్‌యతా'లో వుండేటప్పుడుయువకులు బాగా జుట్టు పెంచుకుంటారు. మసాయీ స్త్రీలు దానికి విరుద్ధంగా తరచుగా గుండ్లు చేయించుకుని, నున్నటి గుండ్లు మెరిసేలా వెన్న రాసుకుంటారు.

తమ పశువులను అడవిలో మేపేపని యువకులకే అప్పగిస్తారు. అక్కడ ఒక్కొక్కప్పుడు వారు క్రూరమృగాలను ఎదుర్కోవలసి వుంటుంది. దాని కోసం చిన్నకత్తిని దగ్గరుంచుకుంటారు. ఆ చిన్న కత్తితో వాళ్ళు పులి, సింహాలను సైతం ఎదుర్కొని చంపుతారు. అలా ఎవరైనా యువకుడు సింహాన్ని చంపితే ఆ సింహపు జూలును అతనికి బహూకరించి సత్కరిస్తారు.

డాక్టరు నిర్మల వాచీ చూచుకుంది.

పన్నెండు గంటలయింది.

"నరసమ్మా! పేషెంట్లింకెవరున్నారు?" ఆయాను అడిగింది.

"ఒక్కరే, నాయుడుగారి కోడలు వరహాలు" అంది ఆయా.

ప్రభుత్వం, ఈ మధ్యే, గోనెలపాడులో రూరల్ డిస్పెన్సరీ తెరచింది. తొలి డాక్టరుగా కుమారి నిర్మలను వేశారు.

చాలా గ్రామాలలో వైద్యసౌకర్యం లేదు. గోనెలపాడులో అంతతొందరగా డిస్పెన్సరీ వస్తుందని ఎవరూ అనుకోలేదు.

కంట్రాక్టరు అప్పలస్వామి గబగబ గోడలులేపి చిన్న డిస్పెన్సరీ, డాక్టరుగారుండడానికి రెండు గదుల చిన్న ఇల్లు, కంపౌండరుకి, ఆయాకి, డ్రస్సర్‌కి ఒంటిగది ఇళ్లు మూడు, సిమెంటు రేకులు వేసి పూర్తి చేశాడు. డిస్పెన్సరీకి జిల్లా కలెక్టరుగారు ప్రారంభోత్సవం చేయడం, డాక్టరు నిర్మల ఛార్జి తీసుకోడం, మరునాటి నుండి డిస్పెన్సరీ పనిచేయడం వరుసగా జరిగాయి.

డాక్టరు నిర్మల నాలుగు సంవత్సరాల క్రితం యం.బి.బి.యస్. పాసయింది. చాల మంచి మార్కులొచ్చాయి. అనుకోకుండా గోనెలపాడు రూరల్ డిస్పెన్సరీకి ఆర్డర్లు వస్తే, ముందు నిరాకరించింది. ప్రొఫెసరుగారు ఆమెను పిలిచి, అనుభవం గడించడానికి ఇంతకన్న మంచి అవకాశంలేదని నచ్చజెప్పి పంపించారు. గైనకాలజీలో మంచి అనుభవం సంపాదించిన నిర్మల చాల విచారించింది, పల్లెటూరిలో దొరికిన ఉద్యోగం తన ప్రత్యేకతకు తగినదికాదని.

గోనెలపాడు ఏమంత పెద్ద గ్రామంకాదు. మూడు వందల గడప; అన్ని జాతుల వారు ఉంటున్నారు. కొందరు సంపన్నులు, చాలమంది సామాన్యులూ - బీదవాళ్లు. ఊళ్ళో అయిదోతరగతివరకు చదువుంది. ఇరవై కిలోమీటర్ల దూరంలో పాలకొండ పట్టణముంది. పాలకొండ నుండి వీరఘట్టాం పోయే రోడ్డుకు కుడిచేతి వేపున ఉన్నది గోనెలపాడు. అడ్డురోడ్డు పదికిలో మీటర్లు నడిస్తే గ్రామం వస్తుంది. కొండల దిగువన సమతలానికి కొంచెం పైగా ఉన్న గ్రామమిది. అడ్డురోడ్డు నుండి అయిదు కిలోమీటర్ల దూరంలో రామన్నపేట ఉంది. అంతవరకే పక్కారోడ్డుంది. అక్కడ నుంచి గోనెలపాడు వరకు బండిదారి మాత్రమే ఉంది.

డాక్టరు నిర్మల ఉద్యోగానికి చేరడానికి వచ్చినప్పుడు పాలకొండ హాస్పిటల్ నుండి కలెక్టరు గారు జీపులో తీసుకొచ్చారు. అందుచేత ఆమెకు అట్టే ఇబ్బంది లేకుండా పోయింది.

'రూరల్ డిస్పెన్సరీ' - 'గ్రామవైద్యశాల' - ప్రారంభోత్సవానికి ఊరిలోని పెద్దలందరూ వచ్చారు. వారిలో రామునాయుడు, నరసింహారావు పంతులు, కౌస్తుభాచారి ఇంకా మరి కొంతమంది ఉన్నారు. తమకు తోచిన విధంగా డాక్టరుగారితో సహకరిస్తామని, ఆమెకు ఏ విధమైన లోటు రాకుండా చూసుకుంటామని వాగ్దానాలు చేశారు.

డిస్పెన్సరీ ప్రారంభోత్సవం ముగిసిన తరువాత సాయంకాలం ఎవరికి వారు వెళ్లిపోయారు. కాంపౌండరుగా ఒకరిని పోస్టు చేసినా, అతడు మాత్రం ఆ రోజుకిరాలేదు. ఆయా నరసమ్మ, డ్రెస్సర్ ఫకీరు ఆ గ్రామం వాళ్లే. ఆ రాత్రికి నరసింహారావు పంతులు గారు భోజనం పంపుతామన్నారు. నరసమ్మ రాత్రి వచ్చి సాయం పడుకుంటానంది.

డిస్పెన్సరీ సిబ్బంది కోసం కట్టిన ఇళ్లు ఊరికి రెండు ఫర్లాంగులు దూరంలో రామన్నపేటకు పోయే బండి దారి పక్కనే ఉన్నాయి. గోనెలపాడు గ్రామంలోకి వచ్చే వాళ్లు ముందు కుడిచేతి వేపున్న డిస్పెన్సరీనీ, ఎడమచేతి వేపున్న సిమెంటు రేకుల ఇళ్లనుదాటి, మరి కొద్ది దూరంలో ఊరివేపున్న బావిని దాటితే గ్రామంలోని ఇళ్ల వరుసలు వస్తాయి. మనుష్య సంచారం తగ్గి, చీకట్లు కమ్మడంతో వంటరితనం తోచి డాక్టరు నిర్మల బాధ పడింది.

విశాఖపట్నంలో డాక్టరు నిర్మలకు ఒక క్షణం కూడా విశ్రాంతి ఉండేదికాదు. పగలు పెద్దాసుపత్రిలో, రాత్రి తొమ్మిదివరకు నర్సింగ్ హోమ్‌లో పనిచేయడమే ఆమెకు తెలుసు. వరుసలు కట్టి తనకోసం వేచియున్న పేషెంట్లను చూసి, చకచక పనిచేసే ఆమె, ఏ పనీలేక ముసురుకుంటున్న చీకట్లను, బలవంతంగా లభించిన విశ్రాంతిని ఆమోదించలేకపోయింది.

డాక్టరు నిర్మల లేచి స్విచ్ వేసింది. వెలుతురుతో గది నిండి గుండెల్లోని దిగులు తగ్గినట్లయింది.

అయిదు సంవత్సరాల క్రిందట ఈ గోనెలపాడులో విద్యుద్దీపాలు లేవు. వీరఘట్టాం వేపు, గోనెలపాడుకు నాలుగు కిలోమీటర్ల దూరంలో 'ఉత్తరాంధ్ర పేపర్‌మిల్సు' వచ్చిన తరువాత లైనువేశారు. ఊళ్లో వీధుల్లోను, డిస్పెన్సరీ దగ్గర లైట్లున్నాయి. ఈ కొద్దిపాటి సౌకర్యానికే నిర్మల సంతోషించింది.

వెలుతురు జీవితానికి ప్రాణం.

మరునాడు ఉదయమేలేచి, స్నానాదులు ముగించి, స్టవ్ మీద టిఫిన్ తయారు చేసుకొని, ఆయా




నరసమ్మ ఊరినుండి తెచ్చిన ఆవుపాలతో కాఫీ కలుపుకొని, సరిగా ఎనిమిది గంటలకు డిస్పెన్స రీలో కూర్చుంది.

కన్సల్టింగ్ రూము బాగాపెద్దది. స్టీలు టేబిలు, నాలుగు స్టీలు కుర్చీలు, డాక్టరు కని రివాల్వింగ్‌చై రు, వైద్యపరీక్షకు ఒక పడక, రోగి కనిపించకుండా దాని చుట్టూ నీలిరంగు ఖద్దరు తెరలు, ఒక స్టీలు ఆల్మరాలో ముఖ్యమైన మందులు!

మందులిచ్చేగదిలోనే డ్రెస్సింగుకి కూడా ఏర్పా ట్లుచేశారు.

డాక్టరు నిర్మల తనతో కొన్ని మందులు తెచ్చింది. కొన్ని ముఖ్యమైన మందులు, కాటన్, పాలకొండ హాస్పిటల్ వారు జీపులో పంపించారు. ఉన్న తక్కువ సామగ్రితో, హెచ్చుఅనుభవంతో ఆ రోజు నిర్మల ఉద్యోగం మొదలు పెట్టింది.

గోనెలపాడులో రోగులెంతమందని?

చిన్న చిన్న దెబ్బలు తగిలిన వాళ్లు, జ్వరంతో ఉన్నవాళ్లు, కడుపునొప్పితో వచ్చినవాడు, చర్మ వ్యా ధితో మరొకడు, ఈ విధంగా పదిహేను మంది రోగులు అప్పుడూ అప్పుడూ వచ్చి, వరండాలో వేసిన బెంచీల మీద కూర్చొని, సావకాశంగా చుట్ట లు కాల్చుకుంటూ మాట్లాడుకొని, తమ వంతురా గానే డాక్టరు గారి దగ్గిరకి వెళ్లారు.

చిన్న కేసులను సైతం నిర్మల చాల నిదానంగా చూసింది. ఆడుతూ పాడుతూ చేసినా ఏ ఒక్కరూ చాల సేపటి వరకు వేచియుండవలసిన అవసరం లేకపోయింది. కాంపౌండరు ఇంకా డ్యూటీలో చేరక పోవడం వలన, నిర్మల తానే మందులు కూడా కలపవలసి వచ్చింది. మాత్రలిచ్చింది. దెబ్బలకు కట్లు కట్టేటప్పుడు కూడా తానే స్వయంగా దగ్గిర నిలబడింది.

వచ్చిన వాళ్లు ముఖాల మీద సంతృప్తితో, నిబ్బ రంగా వెళ్లిపోయారు.

డాక్టరు నిర్మల చేతివాచీ చూసుకుంది. పన్నెండు గంటలు దాటి పదిహేను నిమిషాలయింది. ఇంకా ఎవరో వరండాలో కూర్చుని ఉన్నారు.

"నరసమ్మా! ఉదయం ఎనిమిది నుండి పన్నెండు వరకు, సాయంకాలం నాలుగు నుండి ఆరు వరకు మనం పని చేయవలసిన వేళలు. ఈ సంగతి పేషెంట్లతో చెప్పవలసింది. పల్లెటూరి వాళ్ల కి కాలం గురించి అంతగా పట్టింపు వుండదు. స్వంత పనులు చూసుకొని, ఎవరి వీలును బట్టి వాళ్లు వస్తుంటే రోజల్లా ఆస్పత్రి తెరచే ఉంచాలి. ఎమర్జెన్సీలకు కాలనియమంలేదు. మామూలుగా వచ్చే రోగులు మాత్రం టైమింగులు పాటించాలి."

"అలాగే అమ్మగారూ! ఇవ్వాళకి మాత్రం మన రామునాయుడిగారి కోడలు వరహాలమ్మను మాత్రం చూడండి." అంది బతిమాలుతున్నట్లు నరసమ్మ.

"రమ్మను" అంది నిర్మల, మరోసారి వాచీ చూసు కుంటూ.

వరహాలు లోపలికొచ్చి టేబిలు దగ్గిర నిలు చుంది. ఆమె వయసు ఇరవై సంవత్సరాలకు మించదు. పెద్దకళ్లు - గుండ్రని ముఖం. చామన ఛాయ - చెవులకు దుద్దులు - ఆమె జడవేసుకోలే దు. కొప్పు ముడిపెట్టుకుంది. మనిషి చాల నాజూకు గా ఉంది. శరీరంలోని పాళ్లన్నీ తూచినట్లున్నాయి. వరహాలు ప్రత్యేకంగా ముస్తాబయి రాలేదు. ఆమె కళ్లలోనే అందమంతా వుంది.

"రండి, కూర్చోండి!" డాక్టరు నిర్మల అంది, నమస్కారం చేసి తన ఎదుట నిలబడిన వరహా లుతో.

వరహాలు డాక్టరుగారికి సమీపంగా వున్న స్టూలు మీద కూచుంది.

"మీ పేరు?"

"వరహాలు."

"వయసు?"

"ఇరవై ఒకటి."

"పెళ్లయిందా?"

"అయింది."

"ఎన్నేళ్లయి కాపురం చేస్తున్నారు?"

"అయిదు సంవత్సరాలయి."

"పిల్లలెంతమంది?"

డాక్టరు ముఖంలోకి చూస్తూ లేరన్నట్లు తలూ పింది వరహాలు.

డాక్టరు నిర్మల రాస్తున్న కలం పక్కనే పెట్టి, కుర్చీలో చేరబడింది.

వరహాలు సందేహంతో గది నాలుగు వేపులకీ చూసింది. పక్కగదిలో ఆయానరసమ్మ, డ్రెస్సరు ఫకీరు ఉన్నారు. రెండు గదులకు మధ్యన తెరమా త్రమే ఉంది. ఆడిన ప్రతి మాట వారికి విని పిస్తుంది.

"నరసమ్మా! నువ్వు, ఫకీరు ఇళ్లకు వెళ్లండి. వీరితో మాట్లాడి నేనూ వెళ్లిపోతాను"

"అమ్మగారూ! డిస్పెన్సరీ నెవరు మూస్తారు?" అడిగాడు ఫకీరు.

"తలుపులు నేను మూస్తానులే. మీరు వెళ్లి పొండి" అంది నిర్మల.




ఆ పాప అపార సంతోషం సంతృప్తి గురించే ఇప్పుడూ ఎప్పుడూ మీ ఆరాటం! ఆమె కన్నుల్లో ఆ సంతోషపు వెలుగులు కలకాలం వర్ధిల్లడానికి ఈ రోజే మార్గదర్శిలో చేరండి.

మీ డబ్బుకు సురక్షిత దుర్గం మార్గదర్శి. ఎన్నో ఏళ్ళుగా తన ఎనలేని సేవలతో వేనవేల సభ్యులలో కలిగించిన అనంతమైన సంతృప్తి అచంచల విశ్వాసం మార్గదర్శి నిజాయితీకి నిబద్ధకు నిదర్శనం. ఆర్థిక పాటవంగల సభ్యుల్ని చేర్చుకోవటంలో మార్గదర్శి చూపే శ్రద్ధ సభ్యుల ప్రయోజనాలకు శ్రీరామరక్ష. సభ్యులందరి అభ్యుదయానికే ఈ అవిరళ కృషి.

ఈ అనన్య ప్రతిష్ఠ ఆర్జించడానికి మార్గదర్శి ఇరవైనాలుగు సంవత్సరాలు పరిశ్రమించి ఈనాడు యావద్దేశంలో అగ్రగామి చిట్‌ఫండ్ సంస్థగా పురోగమిస్తున్నది. అంచెలంచెలుగా ఎదుగుతూ మార్గదర్శి వార్షిక వ్యాపారం ఇప్పుడు రు.60 కోట్లు దాటింది. మీ వివిధ అవసరాలకు అనుగుణంగా రకరకాల మొత్తాలలో ఎన్నెన్నో చిట్‌లు మార్గదర్శి మీ కోసం సిద్ధం చేసింది.

| చందా | నెలలు | మొత్తం | సభ్యులు |
|---|---|---|---|
| 400 | 25 | 10,000 | 25 |
| 1000 | 25 | 25,000 | 25 |
| 2000 | 25 | 50,000 | 25 |
| 200 | 50 | 10,000 | 50 |
| 400 | 50 | 20,000 | 50 |
| 500 | 50 | 25,000 | 50 |
| 1000 | 50 | 50,000 | 50 |
| 2000 | 50 | 1,00,000 | 50 |
| 4000 | 50 | 2,00,000 | 50 |
| 8000 | 50 | 4,00,000 | 50 |

- బషీర్‌బాగ్, హైదరాబాద్.
- లకిడికాపూల్, హైదరాబాద్.
- చిక్కడపల్లి, హైదరాబాద్.
- అమీర్‌పేట్, హైదరాబాద్.
- ఎమ్.జి.రోడ్, సికింద్రాబాద్.
- ఎ.ఎమ్.సి.కాంప్లెక్స్, విజయవాడ.
- బందర్‌రోడ్, లబ్బీపేట్, విజయవాడ.
- జగదాంబ జంక్షన్, విశాఖపట్నం.
- స్టేషన్‌రోడ్, గుంటూరు.
- జె.పి.యన్.రోడ్, వరంగల్.
- టి.నగర్ రాజమండ్రి.
- సుభాష్‌రోడ్, కాకినాడ.
- నెహ్రూ రోడ్, కర్నూలు.
- వైరారోడ్, ఖమ్మం.
- నరసింహారావుపేట, ఏలూరు.

మార్గదర్శి చిట్‌ఫండ్ ప్రైవేట్ లిమిటెడ్

రిజిష్టర్డ్ మరియు సెంట్రల్ ఆఫీసు :
ఆబిడ్ సెంటర్, హైదరాబాద్ - 500 001.

Kiron-MCF-86-3

వాళ్లిద్దరూ వెళ్లిపోయారు.

"మీరు కలిగిన కష్టమేదో ఇపుడు చెప్పండి"

వరహాలు చెప్పాలని ప్రయత్నించింది. కళ్లంట నీళ్లు కారడం మొదలు పెట్టాయి. గొంతుక దగ్గుత్తిక పోయింది.

నిర్మల వరహాలు ముఖంలోకి చూచింది.

ఆమె నున్నటికపోలాల మీదనొక్కటి బొట్లు తా మర పూవు రేకుల మీద వర్ష బిందువులు పడుతు న్నట్లున్నాయి.

"నాతో మీరు అన్నీ విషయాలు దాపరికం లేకుండా చెప్పవచ్చు. మీ రహస్యం చాల జాగ్రత్తగా ఉంచుతాను"

"డాక్టరమ్మగారూ! నా కాపురం మంటగలిసిపో యింది"

డాక్టరు నిర్మల కేసుషీటు మీద రాయడానికి బదులు చేష్టలు దక్కిఉండి పోయింది.

★ ★ ★

మధ్యాహ్నం రెండు గంటలయింది. ఎండ మండిపోతున్నది.

డ్రెస్సర్ ఫకీరుకి చాల ఆకలిగాఉంది. పన్నెండు గంటలనుండి అతడిని ఆపివుంచింది డాక్టరు నిర్మల.

నిర్మల అతని చేతికో ఎక్స్‌ప్రెస్ టెలిగ్రామి చ్చింది. పాలకొండ పెద్ద పోస్టాఫీసులో దానినిచ్చి రమ్మంది.

అతనికి చాల ఆకలిగాఉంది. డాక్టరు నిర్మల అతని చేతికో ఏభై రూపాయలిచ్చింది. ఆ టెలి గ్రామ్ వీలయినంత వేగంగా ఇచ్చి రావాలి. ఈ రోజు శనివారం. రేపు తీసుకుంటారో లేదో. దారిలో ఏటీయో తాగి, టిఫినేదో తిని, ఒక నిమిషం కూడా వ్యర్థం చేయకుండా పాలకొండచేరి పని ము గించాలి. తరువాత సావకాశంగా ఏమంచి హొట లులోనో భోజనంచేసి, రాత్రికి సినిమా చూచుకొని ఉదయానికి తిరిగి రావచ్చు.

ఫకీరు ఇంకేమనగలడు!

ప్రొఫెసరు గారికిచ్చిన టెలిగ్రాములో ఈ విధంగా ఉంది.

"స్ట్రేంజ్ ఇల్‌నెస్ పెర్‌వేడింగ్ ది విలేజ్ (స్టాప్) క్రైండ్లీ డెప్యూట్‌ఎ సీనియర్ సైకో-థెరాపిస్టు ఫర్ అసిస్టెన్స్ ఇమీడియట్లీ-డాక్టర్ నిర్మల."

(వింత జబ్బు గ్రామంలో వ్యాపిస్తున్నది. దయ చేసి ఒక సీనియరు సైకో-థెరాపిస్టును సహా యంకోసం వెంటనే పంపవలసింది)

డాక్టరు నిర్మల ఈ నిర్ణయానికి రావడానికి రెండు గంటలు పట్టింది. రోజుకో కేసు చొప్పున ఇప్పటికి నాలుగు కేసులొచ్చాయి. మొదటి కేసు వరహాలుది.

వరహాలు పుట్టింటివారు సంపన్నులు. ఆమె పన్నెండో ఏటే పెద్ద మనిషయింది. పదహారో ఏట రామునాయుడుగారి పెద్దబ్బాయితో వివాహం జరి గింది. వరహాలు భర్త ఆనందరావు బి.ఏ. పాసయ్యా డు. మంచి ఆటగాడు. వ్యసనాలు లేవు. పెళ్ళయిన దగ్గిరనుండీ భార్యాభర్తలు అన్యోన్యంగా ఉండేవా రు. భర్త చదువుకున్న వాడేమో, మూడు నాలుగు సంవత్సరాలవరకు జీవితం ఆనందంగా గడపా లని, భార్యను ఒప్పించి, సంతాన నిరోధక పద్ధతుల ను అవలంబించాడు.

ఒక ఏడాదిక్రిందటి వరకు వారి వైవాహిక జీవి తంలో తేనె, పాలు వాగులై ప్రవహించాయి. ఇద్దరిదీ మంచి ఆరోగ్యం. ఆమెకు ఇరవయ్యోయేడు వచ్చిన తరువాత సంతానంమీదకి దృష్టి మరలింది. ఆ విషయం భర్తతో చెప్పింది. అతను కూడా అంగీక రించాడు.

ఈ నిర్ణయం తీసుకొన్న తరువాత కుటుంబ నియంత్రణకు స్వస్తి చెప్పారు. కాని, ప్రయోజనకర మైన ఫలితాలు కనిపించలేదు. దానికి కూడా ఆమె విచారించలేదు. కాని ఆరు నెలలయి అతడు సంసారం చేయడానికి పనికిరాకుండా పోయాడు.

ఇప్పుడేం చేయాలి?

"మీభర్త తలకుగాని, వెన్నెముకకుగాని దెబ్బే దేనా తగిలిందా?"

"లేదు"

"అతనికేమైనా చెడు అలవాట్లున్నాయా?"

"అప్పుడప్పుడు సిగరెట్లు తాగుతారు. అంతకు మించి మరే చెడు అలవాట్లులేవు.

"మీ ఆయన తల్లి అదుపాజ్ఞలలో ఉంటారా?"

"అటువంటి దేమీలేదు."

"కొడుకు మాటసాగకుండా తండ్రి చేస్తున్నారా?"

"ఉన్న ఒక్క కొడుకూ అంటే ఆయనకి వల్లమా లిన అభిమానం.

"సాధారణంగా మీఆయన రాత్రిళ్లు చాల ఆల స్యంగా ఇల్లు చేరుతారా?"

"అటువంటిదేదీలేదు"

"ఈమధ్యన ఏదేనా పెద్ద జబ్బుచేసి, చాలా కాలం మందులు తిన్నారా?"

"అతనికి అనారోగ్యమన్నదే లేదు."

నిర్మల చాల ఆలోచించింది.

ఒకటిమాత్రం నిజం!

భార్యకు సంతానంమీద కోరిక కలిగిన నాటి నుండీ సంసారంలో ఒడుదుడుకులు మొదలయ్యాయి. తన భార్యకు పిల్లలు కలగరని అతనికి అనుమానం కలిగింది.

తరువాత క్రమంగా ఆమెవల్ల విముఖత్వం పెరిగింది.

అది పరాకాష్ఠకు చేరుకొని అతను సంసారం చేయడమే మానుకున్నాడు. ఇది కేవలం ఇన్‌ఫెర్టిలిటీ కేసు. భార్యా భర్తలిద్దరూ దీనికి బాధ్యులే. ఈవిషయంలో తొందరగా ఒక నిర్ణయానికి రావడానికి వీలులేదు.

ముందు వరహాలు మనసు ఒకదారి పట్టాలి.

వైద్య పరీక్షలు జరపడానికి ఆమె సహకరించాలి.

అంతవరకు ఆమెను ట్రాన్క్విలైజర్లమీద ఉంచాలి.

రెండవ కేసు చాకలి రంగమ్మది.

ఆమె వయసు ముప్పయ్ సంవత్సరాలు. ఆమెకిది రెండో మనువు.

మొదటి మొగుడు దుర్బలుడు. ఎప్పుడూ ఏదో జబ్బుతో తీసుకునేవాడు. ఎవరేనా భార్యను తేరిచూస్తే అనుమానంతో చచ్చేవాడు.

ఆ ఊళ్ళోనే ఆమెకు చంద్రయ్యతో సంబంధం ఏర్పడింది. మొదటి మనువుకు పుట్టిన కొడుకును కూడావాడి తండ్రితో వదిలేసి రెండేళ్లకింద తన వయసేఉన్న చంద్రయ్యతో గోనెలపాడు లేచి వచ్చింది.

ఈఊరు వచ్చిన తరువాత ఒక సంవత్సరంహాయిగా కాలం గడిచి పోయింది. బట్టలుతికేటప్పుడు, చలవచేసిన బట్టలు ఇళ్ళకిచ్చేటప్పుడు భార్యాభర్తలనుచూసి గ్రామంలోనివారు ఒక క్షణం నిలబడి సంతోషంతో నిట్టూర్చేవారు. ఓలు గోరింకలులా ఉన్నారని వాళ్ళ ముఖాలమీదే అనేవాళ్ళు. ఒకరాత్రి రంగమ్మ రహస్యంగా చంద్రయ్య చెవిలో చెప్పింది-కొడుకో, కూతురో కావాలని. ఇది జరిగి ఒక సంవత్సరమయింది.

మొదట చంద్రయ్య సుముఖుడిగా కనిపించినా, తరువాత తరువాత ఆ విషయం ప్రస్తావిస్తే విసుక్కునేవాడు.

ఒక స్థితికి వచ్చిన తరువాత ఆ మాటంటేనే మండిపడుతున్నాడు. ఆరు నెలలయి నిత్యం ఇంట్లో దెబ్బలాటలే-తనంటే అనుమానంతో మండిపడుతున్నాడు. సంసారం సుఖమన్నదే లేకుండా పోయింది.

"నీ భర్తకు తాగుడు అలవాటుందా?"

"కష్టపడే వాళ్ళకుంటుంది గదమ్మా"

"ఇప్పుడెలాఉంది?"

"ఈమధ్య మరీ హెచ్చిపోయింది నన్నుతిట్టడం, కొట్టడం చేస్తున్నాడు"

"ఊరివాళ్ళు బుద్ధి చెప్పడంలేదా?"

"చెప్తున్నారు. ఎవరేనా మందలిస్తే వచ్చి పడుక్కుంటాడు. ఏడుస్తాడు."

"బుజ్జగించి అతనిని ఒక దారికి తీసుకురావడానికి ప్రయత్నించలేదా?"

"ఆ ప్రయత్నంచేస్తే మండిపడుతున్నాడు."

"కొత్త పడుచులతో స్నేహంకాని చేస్తున్నాడా?"

"ఈ ఊళ్ళో మాదొక్కటే కుటుంబం. గోనెలపాడులో నీటి కిబ్బందని మీకూ తెలును. ఉన్నదొక్కటే నుయ్యి. తాగడానికి, వంటకి, అన్నిటికి అదేనీరు. మేము కాబట్టి అన్ని శ్రమలకుఓర్చి బట్టలుతుకుతున్నాం. మరెవరూ ఆపని చేయలేరు."

"నువ్వీ మనువుచేసుకోక ముందు చంద్రయ్య పిల్లలు పుట్టకుండా ఆపరేషను చేయించుకున్నాడా?"

"అటువంటిదేదీ చేయించుకోలేదని పెళ్ళి ముందు ఒట్టేసి కున్నాడు."

"నీకు రాత్రిళ్ళు నిద్ర పడుతున్నదా?"

"ఏ రాత్రో వస్తాడని ఎదురు చూస్తుంటే నిద్రెలా పడుతుందమ్మా?"

వైద్యం కొంతకాలం సాగుతుందనీ, భార్యాభర్తలిద్దరూ వారంవారం రావలసి ఉంటుందనీ, ఇదేమీ ఆందోళన చెందవలసిన పరిస్థితికాదనీ, డాక్టరు నిర్మల రంగమ్మకు నచ్చ జెప్పింది.

రంగమ్మ పరీక్షలకు సహకరించాలంటే ముందు బాగా నిద్రపోవాలి.

నిద్రమాత్రలామెకిచ్చి జాగ్రత్తగా వాడమంది.

నిర్మల ఆలోచిస్తున్నది.

శారీరకమైన రుగ్మతలకు సూటిగా వైద్యం చెయ్యొచ్చు. మానసికమైన అశాంతికి తొందరపడి వైద్యం చేయటం మంచిది కాదు.

అన్నిటికన్నా ముఖ్యమైనది రోగికి డాక్టరుకీగల సంబంధం. రోగి డాక్టరుమీద సంపూర్ణమైన విశ్వాసముంచాలి. తన ఇబ్బందులను దాపరికం లేకుండా చెప్పుకోవాలి. ఆ విధంగా రోగి మనసువిప్పి చెప్తుంటే రోగానికి మూలకారణాలేవో డాక్టరు అవగాహన చేసుకోవాలి. సమన్వయించుకోవాలి. వైద్యశాస్త్రం క్షుణ్ణంగా తెలుసుకుంటే చాలదు. రోగిమీద

అభిమానం పెంచుకోవాలి.

సెక్సు అన్నది కామానికి సంబంధించి, సంతానో త్పత్తికే పరిమిత మయిందని భావించడానికి వీలు లేదు.

మనిషి వ్యక్తిత్వానికి సెక్సు దర్పణం.

పురుషవృషభులు, మనుజ శార్దూలులు-వీరందరూ సెక్సునుండే తమ ఘనతను సంపా దించుకున్నారు.

వాళ్ళ అహంకార దర్పాలకు ఈ సెక్సు కారణం. ఇది అనాదిగావస్తున్న మానవ స్వభావం.

స్త్రీ ఎప్పుడూ బయట పడదు. శాంతమూర్తి. కామం ప్రకటించడంలో చురుకుదనం చూపించ దు.

భిన్నభిన్న మనస్తత్వాలుకల స్త్రీ పురుషులను ఈ సెక్సు దగ్గిరగాతెచ్చి సంసారాలు చేయిస్తున్నది.

నిర్మల మళ్ళా ఈ ప్రపంచంలోకి వచ్చింది.

మూడో కేసు నారాయణసెట్టిగారి భార్య చంద్ర మతిది.

చంద్రమతి వయసు నలభైఆరు. ఎనిమిదో యేటే పెళ్ళయింది. భర్తకు, ఆమెకు వయసులో ఆరు సంవత్సరాలే తేడా. పదిహేనో ఏట కాపురానికి వచ్చింది. అప్పటికే సెట్టిగారికి విజయనగరంలో ఓ సాని, అరసవెల్లిలో ఓసాని ఉండేవారు. వ్యాపార రీత్యా ఆ ఊళ్ళకు పోయినప్పుడు వారితో గడిపినా, భార్యవట్ల అతను మామూలుగానే వ్యవహరించా డు. ఆమెకు ఇద్దరు మగపిల్లలు, నలుగురు ఆడ పిల్లలు. ముప్పయ్యో ఏటితో ఆమె కాన్పులు ఎత్తిపె ట్టింది. పిల్లలకు పెళ్ళిళ్లయ్యాయి. మగ పిల్లలిద్ద రూ విశాఖపట్నంలో దుకాణాలుపెట్టి వెళ్ళిపోయా రు. అల్లుళ్ళు కూడా పట్నాలలోనే వ్యాపారం చేస్తు న్నారు. ముట్లుడిగినా ఆమె ఆరోగ్యం బాగానేఉంది. శరీరం కొంచెం స్థూలమయినా ఆమె ఆకర్షణీ యంగా ఉంటుంది. మనుమలను అర్థంచేసుకొని, తొందర పాటులేకుండా నవ్వుతూ పనిచేసే మని షిలా కనిపించింది.

ఉన్నట్లుండి డాక్టరు నిర్మల చంద్రమతిని అడి గింది.

"ఈమధ్య, అంటే సెట్టిగారికి మీమీద అభి మానం తగ్గడానికిముందు, వారు ఏ గురువుల దగ్గరైనా దీక్ష తీసుకున్నారా?"

"అలా అయినా బాగుండును. ఆయన పేకా టలో మునిగి తేలుతున్నారు."

"అలాగా!ఏదో శని, ఆదివారాల్లో ఆడతారను కుంటాను."

"అదేంకాదు. రోజూ రాత్రి పదికి కూర్చొని ఏ రెండింటికో లేస్తారు."

"ఎవరితో ఆడతారు?"

"రామునాయుడుగారు, కొన్నుభంగారు, నర సింహారావు పంతులుగారు, మావారు కలసి ఆడతా రు."

సెట్టిగారి ఇంట్లోనే కాదు, ఆ ప్రబుద్ధుల ఇళ్ళల్లో కూడా ఇదే సమస్య ఉండి ఉండాలి.

"మీ ఆయన గెలుస్తుంటారా?"

"గెలిచేదీ లేనిది నాకంతగా తెలీదు. నలుగురూ చాల ఉత్సాహంగా ఆడతారు. గెలిచి జేబులు నింపుకొని ఎవరూ వెళ్ళినట్లులేదు. ఆటలో మునిగి ఇళ్ళూ, వాకిళ్ళూ అన్నీ మరచి పోతారు. కొన్ను భంగారి అమ్మాయి, నరసింహారావుగారి అబ్బాయి విధిగా పన్నెండు గంటలకొచ్చి వాళ్ళను ఇళ్ళకు రమ్మంటారు. వాళ్ళు వినిపించుకోరు."

"మీరు మరేమీ అనుకోకుండాఉంటే మరో ప్రశ్న-మీ ఆయన ఎప్పుడైనా సుఖవ్యాధులతో బాధపడి వైద్యం చేయించుకున్నారా?"

"అటువంటిదేమీలేదు, చాలా జాగ్రత్తయిన మనిషి."

"డయబెటీస్‌కాని ఉందా?"

"అటువంటిది ఉన్నట్లులేదు."

"అవును. అది ఉన్నట్లు కూడా ఒకప్పుడు తెలి యదు.

"మీరే పరీక్షచేసి చెప్పాలి."

"మీరు ఆరుగురు బిడ్డలను కన్నారు. అందరికీ వివాహాలయ్యాయి. మనుమలున్నారు. పిల్లలను కనేవయసు దాటిపోయింది. ఇంట్లో కాపురానికి పోవ లసిన కూతురుంది. ఇంటి పనులు, బాధ్యతలూ..."

అర్థోక్తిలో ఆగిపోయిన డాక్టరు నిర్మల ముఖంలోకి చూసింది చంద్రమతి.

"నేను కూడా ఇలాగే అనుకుంటాను. బహుశా మీరు మాఇల్లు చూచినట్లులేదు. రామునాయుడు గారి ఇంటికి ఎదురుగాఉంది. ఇల్లు చాలాపెద్దది. మాపడకగది చాలా విశాలమయినది. భార్యాభ ర్తలం పగలు ఎక్కడెక్కడ గడిపినా, రాత్రిమాత్రం ఒకదగ్గిరే పడుకుంటాం. గతించిన మంచిరోజుల జ్ఞాపకాలు, ఆనందం కలిగించిన సంఘటనలు గుర్తు తెచ్చుకొని, ఏవో మాట్లాడుకుంటూ సుఖంగా ఉండేవాళ్ళం. ఏడాదయి సెట్టిగారు క్రమంగా ఈ అలవాటు నుండి తప్పుకున్నారు. రానురాను పడక గదిలోకి కూడా అడుగు పెట్టకుండా హాలులోనే



తూగుటుయ్యాలలో పడుకుంటున్నారు."

డాక్టరు నిర్మలకి తెలుసు. చంద్రమతి ప్రౌఢ. ఆమెలో కోరికలింకా తగ్గలేదు. దేనికీ భయపడనక్కరలేదు. కుటుంబ నియంత్రణకోసం బాధపడటంలేదు. స్త్రీ. పురుషులు ఒకరినొకరు అర్థం చేసుకొని సుఖపడవలసిన వయసు.

సెట్టిగారిని ఒకదారికి తెచ్చేవరకు చంద్రమతి తలనొప్పులకు వైద్యం చేయాలి.

నాలుగో కేసులో ప్రత్యేకతలేదనిచెప్పడానికి వీలు లేదు.

ఆమెపేరు గౌరమ్మ.పద్మశాలీ. ఆమె వయసు ఇరవైకి మించదు. మనిషి చాల అందమైనది. బంగారంవంటి శరీరచ్ఛాయ. నడకలో ఒక విలాసం కనిపిస్తుంది. సింతుగా ఉంటుంది. పెద్ద జుత్తు-కొప్పు పెట్టుకొంది. ఆమె ఎంత అందమయినదో మగడు అంత సామాన్యుడు. కనీస తెలివితేటలు, చురుకుదనం కూడా లేనివాడు. ఆమెకు అయిదేయేటే పెళ్ళయింది. పన్నెండో ఏటే కార్యమయింది. కార్యమయిన రాత్రి నుండీ ఆమెకు మగడంటే తగని అసహ్యం. మొదట వాళ్ళది పెద్ద సమిష్టి కుటుంబం-దాని నుండీ మగడ్ని వేరుచేసి కాపురం పెట్టించింది. ఆమె నూలు తీస్తుంది. మగడు మగ్గం నేస్తాడు. అర్జనకు లోటులేదు. రెండు సంవత్సరాలుగా. వయసులోనున్న వండ్రంగి చిన్నయ్యతో సంబంధం పెట్టుకుంది. ఊరందరికీ ఈ విషయం తెలుసు. గౌరమ్మ మొగుడు ఎందుకూ పనికిరానివాడు కాబట్టి, మరొకడిని ఆశ్రయించడంలో తప్పులేదని అందరూ అనుకుంటారు.

అన్నీ అనుకూలంగాఉంటే ఆమెకెందుకు సమస్య?

అదే. అవ్రదంగి నేస్తానికి సంవత్సరమయి ఆమె మీద మోజు తగ్గింది. ఆరు నెలలయి గడప తొక్కడం మానేశాడు. పిలిచినా, డబ్బు పంపినా కూడా రావడం మానేశాడు.

మిగిలిన కేసుల్లో భర్తలు విముఖత చూపడం సమంజసంగాఉంది. గౌరమ్మ కేసులో ప్రియుడు విముఖుడవడానికి కారణమేమిటి?

గౌరమ్మకు ఫిట్సు వస్తున్నాయి!

మిగిలిన పేషెంట్ల విషయంలో భార్యలను భర్తలను దగ్గిరికి తీసుకురావడం వారి సుఖానికి సమాజ శ్రేయస్సుకి అవసరం.

మరి గౌరమ్మ విషయంలో?

ఆమె బ్రతికి బయట పడాలంటే వ్రదంగి చిన్నయ్యతో సంబంధం తిరిగి కలపాలి.

డాక్టరు నిర్మల మరి ఆలోచించలేదు. ఇవి ఇన్‌ఫెర్టిలిటీ కేసులో, సైకిక్ కేసులో-మొదటి వారంలోనే నాలుగు వచ్చాయి. ఇంకెన్ని వస్తాయో! వీటినన్నిటిని విశాఖపట్నం స్పెషలిస్టుకు పంపితే!

ఊరివారి నందరినీ పంపాలా?

స్పెషలిస్టే ఇక్కడికి రావాలా?

వెంటనే డాక్టరు నిర్మల మరే ఆలోచనలు పెట్టుకోకుండా టెలిగ్రాము రాసి ఫకీరు చేతికిచ్చి పంపింది.

## 2



డాక్టరునిర్మల కోపంతో మండిపడుతోంది.

మధ్యాహ్నం ఒంటిగంటన్నర అయింది.

అప్పుడే ఆమె ఇద్దరు స్పెషలు పేషంట్లతో ఇంటర్వ్యూలు ముగించింది.

ఆ సమయంలో డిస్పెన్సరీముందు ఒక రెండెడ్ల బండి ఆగింది. దానినుండి మూడు అట్టపెట్టెలు, ఒక సూట్‌కేసు ముందు దిగాయి.

తరువాత డాక్టర్ గోపీకృష్ణ దిగాడు.

అతడు కన్సల్టింగ్ రూము తలుపు తెరిచి, లోపల కూర్చున్న డాక్టర్ నిర్మలను కొంచెం వంగి విష్ చేశాడు నవ్వుతూ.

"నమస్కారం! డాక్టర్ నిర్మలా!"

గోపీకృష్ణను చూడగానే ఒక్కసారి ఆమె నిశ్చేష్టురాలయింది.

క్రమంగా ఆమెలో కోపం పుట్టుకొచ్చి అయిదు నిమిషాలలో పొంగిపొర్లింది.

"గోపీ నిన్నెవరు పంపించారు?"

"ప్రొఫెసరుగారు."

"నేను చాలా ప్రత్యేకంగా నా టెలిగ్రాములో ఉదహరించాను. ఒక అనుభవజ్ఞుడైన సీనియర్ సైకో-థెరాపిస్టుని పంపమన్నాను. ఇక్కడ జరుపవలసినవి రక్తపరీక్షలు కావు. సైకోఎనాలిసిస్ కావలసినది."

సాధారణంగా డాక్టర్లలో వివిధశాఖలవారు ఒకరినొకరు గౌరవించుకుంటారు. ఒకరిమీద ఒకరు ఆధారపడి వైద్యం చేస్తారు. డాక్టరు నిర్మల మండిపోడానికి కారణముంది. ఆమె ఎంత ఇంటలిజంటో, ఈ గోపీకృష్ణ అంత మీడియాకరు స్టూడెంటు. మనిషి పొడవుగా ఉంటాడు. ఫొటో జెనిక్ ఫీచర్సుతో ఎప్పుడూ నవ్వుతూ, ఆడవాళ్ళ వెంటపడుతూ, ఏ సమస్యనీ తీవ్రంగా తీసుకోకుండా కాలం వ్యర్థంచేసే మనిషి.

ఇక్కడ కొంపలంటుకున్నాయని టెలిగ్రామిస్తే అలంకారప్రాయుడైన బాడీబిల్డరుని తనమీద రుద్దారు.

ఇక వైద్యం చేయడమెలా?

డాక్టర్ గోపీకృష్ణ ద్వారందగ్గిర అలాగే నిలబడి ఉన్నాడు. అతనికి నిర్మల సంగతి బాగా తెలుసు.

"డాక్టర్ నిర్మలా! నేను కూడా ఇక్కడికి రావడానికి సుతరాం ఇష్టపడలేదు. నేను సైకో-థెరాపిస్టుని కానని తల మొదుకున్నాను. నీవంటి సూపర్ ఇంటలిజంట్ డాక్టర్ దగ్గిర నేను పనిచేయనన్నాను. ప్రొఫెసరుగారికి కూడా నీ సంగతి బాగా తెలుసు. నన్ను పంపడం నీకు నచ్చదుగానీ నా వంటివాడు నీ దగ్గిర పనిచేస్తే నీకింకా మంచిపేరొస్తుంది. ఈ విషయమే ప్రొఫెసరుగారు ఉత్తరంలో రాశారు. మనం ఈవిధంగా పేషెంట్ల ముందు, స్టాఫ్ ముందు దెబ్బలాడుకోడం బాగోదు. నీకు మరే ఆల్టర్నేటివ్ లేదు. ముందు నాకు బసచూపించు."

డాక్టర్ నిర్మల తన నిస్సహాయతకు బాధపడింది.

సంసారజీవితంలో తలెత్తిన ఒడుదుడుకులతో

సతమతమవుతున్న ఊరి ఆడవాళ్లమీద ఈ సినిమా హీరోని విడిచిపెడితే రసాభాస తప్పదు.

ఈ మనిషిని ఎట్టి పరిస్థితులలోనూ తిప్పివంపరాదని ప్రొఫెసరుగారు గట్టిగా రాశారు.

ఎవరికీ అవసరంలేని మనిషిని తన నెత్తిమీద రుద్దారు.

పని చేతకానివాడు పనిముట్లతో దెబ్బలాడుతాడు.

కాని, ఎంత కౌశలమున్న పనివాడైనా సరిపడని పనిముట్లతో రాజీపడలేడు.

ఏంచేయడం?

సమస్య మరేదేనా అయితే తానింతగా బాధపడేది కాదు.

మదించిన ఆబోతును ఊరి ఆడవాళ్లమీద విడిచిపెట్టడం చాలా నీచమైనపని.

ఈ గోపీనికాక మరే జూనియర్‌ను పంపినా తానింతగా బాధపడేది కాదు. ఈ మనిషికి తెలీదు. చెప్తే అర్థం చేసుకోలేడు. ఎమ్.డి. చదువుతున్నాడే కాని స్పార్క్ కనిపించదు.

"డాక్టర్ నిర్మలా! ముందు నాకు బసచూపించు. స్నానం చేయాలి. ఊరిలో ఏదైనా హొటలుందా? పోయి భోజనం చేయాలి. ఆకలిగా ఉంది!"

అప్పటికే రెండయింది.

పెలిగ్రాము శనివారం సాయంకాలం ఇస్తే సోమవారం మధ్యాహ్నానికి ఈ 'సహాయక డాక్టర్' వచ్చివడ్డాడు. ఎక్కడా ఇంత తొందరగా పనిజరగదు. ప్రభుత్వ సంస్థలలో మరీను. మరో వారంరోజుల వరకూ ఎవరూ రాకపోయినా తానంతగా పట్టించుకోనేదికాదు, గోపీ రావటంతో ఉన్న సమస్యలే ఊపిరాడకుండా చేస్తుంటే, కొత్త సమస్యలు మీద పడ్తట్టుంది.

ఆలోచించడంవలన లాభంలేదు.

"ఒక్క డాక్టరు కోసమే ఇక్కడ ఇల్లు కట్టారు. మరో లేడీ డాక్టరు వచ్చివుంటే ఇద్దరం ఒకే ఇంట్లో ఉండేవాళ్లము. మనిద్దం ఒకేఇంట్లో ఉంటే ఊరివాళ్లు తరిమికొడతారు. ఈ ఊళ్లో హొటళ్లు కాని, లాడ్జిలు కాని లేవు."

"ఊళ్లో అద్దెకేదేనా ఇల్లు దొరుకుతుందా?"

"ఊళ్లో నువ్వుండడం నేనొప్పుకోను. కంపౌండరు కోసమోచిన్నఇల్లు కట్టారు. పోస్టు చేసిన అతను రాలేదు. అందులో నువ్వుండొచ్చు. ఫకీర్! కంపౌండరు ఇంటితాళం తీసి గోపీకృష్ణ డాక్టరుగారి సామానులు అందులో పెట్టు. ఇల్లు శుభ్రంచేసి, బాత్‌రూములో నీళ్లు నింపించాలి. నరసమ్మను కూడా సాయానికి పిలుచుకుపో!"

డాక్టర్ నిర్మలకి రోజురోజుకి పనిపెచ్చడంతో వండుకోడానికి ఇబ్బంది కలిగింది. ఒక ముసలావిడను వంటకు కుదిర్చారు. ఈమె పొద్దున్నే వచ్చి రాత్రి వెళిపోతుంది. ఒక మనిషికోసం వండిన వంట సిద్ధంగా ఉంటే దానిలోకొంత కారియరులో పెట్టి గోపీకృష్ణకు పంపింది నిర్మల.

డాక్టర్ గోపీ భోజనం ముగించేసరికి మధ్యాహ్నం మూడయింది.

గోపీకృష్ణ ఏపరిస్థితినీ సీరియస్‌గా తీసుకోడు. అంతగా లోతులకు పోడు. ఎం.డి. పరీక్ష కొకసారి వెళ్లి తప్పాడు. మళ్లా చదువుతుంటే ప్రొఫెసరుగారు కబురువంపి వెంటనే గోనెలపాడు డిస్పెన్సరీకి రవాణా చేశారు.

స్నేహితులు, సినీమాలు, బీచిషికారులు, ఆడపిల్లల వెంటబడడాలు అన్నీ హఠాత్తుగా అంతమయిపోయాయి. గోనెలపాడులో తనకన్న నాలుగు సంవత్సరాలు జూనియరైన డాక్టర్ నిర్మల చెప్పుచేతల్లో బుద్ధిమంతుడైన కుర్రాడిలా మెసలాలి.

డామ్ దిహెల్!

తను చేయవలసినపనేమిటో? ఈ స్ట్రేంజ్ ఇల్‌నెస్ ఏమిటి? ఇంతకీ పాథాలాజిస్టు ఏంచేస్తాడు?

వెళ్లి నిర్మలను కలియాలనుకున్నాడు. ఆమె ఈ సమయంలో పడుకొంటుంది. తన విశ్రాంతి మీద దాడిచేస్తే ఆమె ఇంకా రెచ్చిపోతుంది.

చేయడానికి పనేదీలేక డిస్పెన్సరీ నుంచి తెచ్చిన కుర్చీమీద కూర్చున్నాడు గోపీకృష్ణ.

రాత్రి పడుకోడానికి మంచం, దానిమీద పరుచుకోడానికి దుప్పటి, తలకిందుకో దిండు- ముఖ్యంగా కావాలి. భోజనం ఏర్పాటు నిర్మలే చూడాలి.

కాని ఒక సంగతి మాత్రం నిజం.

తానిప్పుడు నీరు విడిచి ఒడ్డునపడ్డ చేప.

★ ★ ★

అనుకోకుండా మధ్యాహ్నం మూడుంపావుకి ఎమర్జన్సీకేసొచ్చింది.

తొమ్మిదేళ్ల కుర్రాడొకడు చెట్టుమీంచి పడ్డాడు. ఎముకలు విరగలేదు. కాని ఎడమ తొడమీద లోతయిన గాయాలు పడ్డాయి. నెత్తురు వరదలు కట్టింది.

డ్రెస్సరు ఫకీరు, ఆయా నరసమ్మ తిళ్లకుపోయినవాళ్ళు తిరిగి రాలేదు.

తలుపుతట్టి, కుర్చీలో కూర్చున్న గోపీని పిలుచుకొచ్చింది నిర్మల. ఇద్దరూ శ్రమపడి, కుట్లు కుట్టి, కట్లు కట్టి, ఇంజక్షనులిచ్చి పని పూర్తి చేసేసరికి

సాయంకాలం అయిదున్నర అయింది. మరోసలు గుర్రైదుగురు రోగులను చూడడంతో ఆ రోజు పని ముగిసింది.

సాయంకాలం ఆరుగంటల తరువాత పంపా పిత టీ పంపించింది. డాక్టర్లిద్దరూ సావకాశంగా టీ తాగుతూ కూర్చున్నారు. ఆయా, త్రిపుర ఇళ్లకు వెళ్లిపోయారు.

కొంతసేపటి వరకు ఎవరూ మాట్లాడలేదు.

సాయంకాలం ముదిరి, చీకట్లు కమ్ముకుంటు న్నాయి.

నిర్మల ముందు సంభాషణకు దారి తీసింది.

''గోపీ! నువ్వు తెచ్చిన మూడు అట్టపెట్టెల్లో ఏ మున్నవి?''

''ఒక దానిలో మైక్రోస్కోప్, రెండవదానిలో స్లైడు లు, టెస్టుట్యూబులు, మూడవదానిలో పుస్తకాలు.''

''నవలలేనా?'' విసుక్కుంటూ అడిగింది నిర్మల.

''అన్నీ నవలలు కావు. కొన్ని మెడికల్ పుస్తకా లు.''

''బాగుంది!ఇక మనం అసలు సంగతికి వద్దాం. నేనీవూళ్లో ఛార్జి తీసుకున్న తరువాత ఆరు విచిత్ర మైన కేసులొచ్చాయి. వాటి గురించి వివరంగా చెప్తున్నాను. సావధానంగా విను. ప్రాబ్లమ్‌ను అర్థం చేసుకుంటే మంచిది. అర్థం కానప్పుడు కొంచెం శ్రమపడి తెలుసుకోవడానికి ప్రయత్నించు. నువ్వు సహాయం చేయగలిగితే అదృష్టమే. కాని పక్కంలో కొత్త తగువులు తెచ్చి పెట్టొద్దు.''

''నేను ప్రామిస్ చేస్తున్నాను—''

డాక్టరు నిర్మల తాను వచ్చిన దగ్గరనుండీ పరీక్ష చేసిన స్పెషల్ కేసుల గురించి చెప్పింది.

గోపీ మధ్యనేవీ ప్రశ్నలు వేయలేదు.

అంతా చెప్పడమైన తరువాత నిర్మల గ్లాసుడు నీళ్లు తాగింది. తిరిగి నిర్మల చెప్పింది.

''ఇప్పటి వరకు మన దగ్గిరికి వచ్చినది ఆరు కేసులు. చంద్రమతి చెప్పిన దానిని బట్టి రామునా యుడు భార్య, నరసింహారావు పంతులు భార్య, కౌస్తుభం భార్య ఇటువంటి పరిస్థితులలోనే ఉన్నా రు. అంటే మొత్తం తొమ్మిది కేసులు. వీటన్నిటిలోను రెండు విధాలయిన రుగ్మతలు కనిపిస్తాయి. మొద టిది ఇన్‌ఫెర్టిలిటి. సంతానం కలగకపోవడం. ఇది భార్యా భర్తలిద్దరికీ సంబంధించినది. రెండవది మేల్ ఇంపొటెన్సు. ఇది కేవలం పురుషులకే చెంది నది- క్లీబత్వం- ఈ రుగ్మతలు తాత్కాలికమైనవి. వచ్చినట్టే వచ్చి పోతుంటాయి. ఇక్కడివారు ఆరోగ్య వంతులు. నేను చాలా ఆలోచించాను— ఈ తొమ్మిదే కాక ఇంకెన్నికేసులున్నాయో? నూటికో కోటికో ఉండ వలసిన రుగ్మతలివి.''

గోపీ దృష్టి నిర్మలవైపు కొంచెంసేపు చూసి అన్నా డు:

''డాక్టర్ నిర్మలా! వివరాలన్నీ నువ్వు [illegible]

''మొదటిది: మనం ఎదుర్కోవలసిన సమస్య ఏమిటి?

రెండవది: సమస్య పరిమాణం అంటే మాగ్ని ట్యూడ్ ఎంత?

మూడవది: మనకు లభించే మందులతో, మామూలు పద్ధతులలో చికిత్స చేయగలమా?

నాలుగవది: ఈ చికిత్స కొనవరకూ చేయడానికి మనకు సామర్థ్యముందా?''

''డాక్టర్ గోపీ! నీ పద్ధతిలోనే చెప్తాను—విను''

''కొంచెం ఉపోద్ఘాతంకూడా అవసరం.''

''అట్లానే! కొలంబియా విశ్వవిద్యాలయం, సైకా లజీ డిపార్టుమెంటుకు చెందిన ఫ్రాంక్ ఎ. బ్లాచ్ మానవ లైంగికత- పరిణామము అన్న వ్యాసం రాశాడు. అందులో చిన్న భాగం మన సమస్యకు ఉపోద్ఘాతంగా ఉంటుంది. పందొమ్మిదవ శతాబ్దం చివరి భాగంలో ఒక ఫ్రెంచి శాస్త్రజ్ఞుడు యు.ఆర్.పి. అన్న సిద్ధాంతాన్ని ప్రతిపాదించాడు. అంటే అన్ రెడీపెనిస్ అని దాని అర్థం. మరొక సిద్ధాంతం అటువంటిదే ఆనాటికి అమలులో ఉంది. అది ఇ.ఆర్.వి. అంటే ఎవర్‌రెడీవెజీనా అని. స్త్రీ ఎప్పు డూ సంయోగానికి సిద్ధమని, పురుషుడు కాడని వీటి అర్థం. ఈ రెండు సిద్ధాంతాలు తార్కిక దృష్ట్యాకాని, జీవశాస్త్ర దృష్ట్యాకాని సమర్థనీయాలు కావు.''

''సంయోగం వలన స్త్రీ, పురుషులలో శారీరక మైన తృప్తి లభిస్తుంది. ఈ తృప్తి జీవితంలో అనుకూలమైన విలువలను పెంపొందిస్తుంది. ఆనందానుభూతులను పంచే ఈ సాంసారికమైన కలయిక స్త్రీ, పురుషులమధ్య అనురాగ బంధనాల ను బలపరుస్తుంది. ఇంకా చెప్పాలంటే లైంగిక ప్రవర్తన సంసారజీవనాన్ని పటిష్ఠం చేస్తుంది. అను బద్ధమైన సంసారం లైంగిక ప్రవర్తనను దృఢతరం చేస్తుంది. ఇవి రెండూ ఒక దానిమీద ఒకటి ఆధారపడి ఉన్నవి.''

''ఇపుడు ఈ ఊరి స్త్రీ, పురుషుల లైంగిక ప్రవర్తనకు ఓ పెద్ద దెబ్బ తగిలింది. మన సమాజం

# నయం చేసే శక్తి మీ చేతుల్లోనే ఉంది.




మీ చేతుల వెచ్చని, సౌమ్యమైన స్పర్శ, అయొడెక్స్‌లో గల నయం చేసే శక్తి—ఇవే మీ కుటుంబానికి కావలసినవి. అందుకే అయొడెక్స్‌ను అందుబాటులో ఉంచుకోండి. ఎందుకంటే, అయొడెక్స్‌లో గాయపడిన ధాతువులను నయంచేసే అయొడిన్, నొప్పిని తగ్గించే మిథైల్ శాలిసిలేట్ చేరిఉన్నాయి.

**అయొడెక్స్ రోజుకు రెండు సార్లు రెండింతలు గుణకారి**

నొప్పి తగ్గే వరకూ, ఆ తర్వాత రెండు రోజుల వరకూనూ రోజుకు రెండు సార్లు అయొడెక్స్ వాడమని సిఫారసు చేస్తున్నారు డాక్టర్లు. ఎందుకంటే, నొప్పి ఒక లక్షణం మాత్రమే కాగా అసలు సమస్య లోపలి ధాతువులకైన గాయం.

కనుక మీ ఆప్తులు ఎవరైనా బెణుకులు, కండరాల పట్లు, కీళ్లపట్లు, లేదా ఒళ్లు నొప్పులతో బాధపడడం జరిగితే అయొడెక్స్ మర్దించండి. రోజుకు రెండు సార్లు. తమని రెండింతలు శీఘ్రంగా మళ్లీ చురుకుగా చేసినందుకు వారు మీకు ఋణపడి ఉంటారు.

## అయొడెక్స్® — నయం చేసే శక్తిగల నమ్మకమైన బామ్.

SKOF — ఎస్‌కేఓఎఫ్ ఉత్పాదన.

ELL-1508

పురుషాధికారప్రధానమైనది. తండ్రి, అన్న, భర్త వీరందరూ, ఇంకా కొడుకు స్త్రీలను రక్షించవలసిన వారు. భార్యాభర్తల సంబంధంలో భార్యకు తిండి, బట్ట, నగ, ఇల్లు మొదలైనవి సమకూర్చటం ఎంత ముఖ్యమో ఆమెకు సంయోగం వలన కలిగే తృప్తిని కలిగించటం అంత ముఖ్యమే. రెండవ పని ఇప్పుడు పూర్తిగా దెబ్బతింది. ఆ సంసార జీవితం ఒక్కసారి నడిసముద్రంలో పడింది. ఇటువంటి పరిస్థితిలో గొనెలపాడు ప్రజలున్నారు. ఇది వారి ముఖ్య సమస్య."

గోపీకృష్ణ ఒక క్షణం ఆలోచించి తలఊపి అన్నాడు.

"డాక్టర్లుగా మనకు ఎంతవరకు దీనితో సంబంధముంది?"

"ఈ సమస్యలో రెండు భాగాలున్నాయి. ఒకటి సంతానం కోరిన దంపతులకు సంతానం లేకపోవడం—రెండవది పురుషులలో వ్యాపిస్తున్న నపుంసకత్వము."

"ఈ రెండింటికీ మనం చికిత్స చేయగలమా?"

"చెయ్యొచ్చు."

"సరి! మరి రెండో ప్రశ్న గురించి..."

"ఈ సమస్య పరిమాణం ఎంతో ఇప్పుడు చెప్పడం కష్టం—మన కింత వరకు తొమ్మిదికేసుల గురించి తెలిసింది. ఈ గ్రామంలో దాంపత్యానికి యోగ్యులైన స్త్రీలు మూడువందలకుపైగా ఉన్నారు. కాబట్టి మూడువందల మందివరకు ఈ అనారోగ్యం వ్యాపించి ఉన్నా ఆశ్చర్యం లేదేమో!"

"ఆడవారు ఒక్కరే ఇందులోకి వచ్చిన వారు—మరి పురుషులో?"

"రమారమి అంతమందే ఉండవచ్చు. అంటే మూడు వందల జంటలకు చికిత్స అవసరం. అదే మాగ్నిట్యూడ్ ఈ సమస్యకు"

"చాల హెచ్చు మందికి చికిత్స చేయడం తప్పనట్టుంది!"

"ఇక మూడో ప్రశ్నకు. ఇది కొంచెం క్లిష్టమయినది. దంపతులకు సంతాన లోపం సరిదిద్దే చికిత్స కాలం తీసుకుంటుంది. శారీరకమయిన లోపాలను మందులిచ్చి, ఆపరేషనులు చేసి నయం చేయవచ్చు. కారణాలు మానసికమైనవైతే చాలా జాగ్రత్తగా ఆలోచించి దీర్ఘకాలం చికిత్స చేయాలి. ఆ విధంగానే మేల్ ఇంపొటెన్సుకుకూడా!"

"బాగుంది."

"నాలుగో ప్రశ్నకు జవాబు సులభంగా దొరకదు. ఒక జంటకో రెండు జంటలకో ముందు చికిత్స చేసి ఒక దారికి తెస్తే మిగిలిన వాళ్ల విషయంలో అంత శ్రమ ఉండదు. ఈ జబ్బుకు మనం శ్రమపడి చికిత్స జరపాలి. ఒకప్పుడు మన శ్రమ ఫలించవచ్చు. లేక ప్రయత్నాలు నిరర్థకం కావచ్చు."

"మరో విషయం కూడా మనం ఆలోచించాలి. చికిత్స మొదలుపెట్టి, చాల కాలం తీసుకొని, ఏమ్మాట చేతులెత్తేస్తే?... ఇక్కడి ప్రజల గతి ఏం కాను? వాళ్ల జబ్బు కుదర్చడానికి వీలుపడని స్థాయికి చేరుకుంటుంది. వాళ్లను ఆవిధంగా ఆ దుర్గతికి నడిపించడం కన్న ఏ పెద్ద హాస్పిటలుకో పొమ్మనడం మంచిది కదా?"

"ఈ సంగతి కూడా ఆలోచించాను. ఇటువంటి కేసులు చాల అరుదుగా వస్తాయి. పెద్ద హాస్పిటళ్లలో కూడా ఇంత మందికి చికిత్స చేసే అవకాశాలు తక్కువ. ఈ గ్రామాన్ని పెద్ద మెడికల్ కాంపుగా భావించి మనం చికిత్స చెయ్యొచ్చు."

"ఈ సంగతి మీద వాళ్లకి తెలియజేయాలా?"

"తెలియజేశాను- అది పేరుకే- అశ్వత్థామ హతఃకుంజరః- అందుకే నిన్ను పంపించారు. ఒక మగ డాక్టరు, ఒక ఆడడాక్టరు—పురుషులకు, స్త్రీలకు చికిత్స చేయడానికి. ఇదంతా పల్లెటూరివాళ్లలో ఆత్మస్థైర్యం కలగడానికి."

"మరొక్కసారి అడుగుతాను... ఈ మూడు వందల అరవై మంది స్త్రీలను, అదే సంఖ్యలో, లేకపోతే రమారమి మూడువందల మంది పురుషులను—అంటే ఆరువందల మంది పేషెంట్లను హాండిల్ చేసే సామర్థ్యం మనకుందా?"

"ఉన్నా లేకపోయినా ఈ విషయం చాల రహస్యంగా ఉంచవలసింది. ఎవరికీ తెలియజేయరానిది. మన రాష్ట్రానికి, మన దేశానికి అప్రతిష్ఠ తెచ్చేదీ విషయం. అందుచేత మన స్థాయిలోనే చికిత్స మొదలుపెడదాం. నువ్వు నాకిచ్చిన కో-ఆపరేషనుమీద పని సాధించవచ్చు."

"చాల తక్కువ సదుపాయాలతో, చాల హెచ్చు మంది రోగులకు, చాల క్లిష్టమయిన చికిత్సను చేయడానికి మనమో నిశ్చయానికి వచ్చాం. పరిస్థితులు అనుకూలించవచ్చు. లేక పూర్తిగా విషమించవచ్చు. అన్నిటికీ మనం ధైర్యంగా నిలిచి పనిచేద్దాం. నువ్వు చాల ఇంటెలిజెంటు డాక్టరువి. నేను ఎంత శ్రమకైనా ఓర్చుకోగలవాడిని. నిన్ను అర్థం చేసుకొనే మెడికల్ జ్ఞానం నాకుంది. నా సహకారం నీకు నూటికి నూరుపాళ్లు లభిస్తుంది."

"ఈ జబ్బు మన వృత్తికే ఛాలెంజ్. దానిని ధైర్యంగా ఎదుర్కొందాం."

★ ★ ★

గోపీకృష్ణ మందులిచ్చే గదిలోనే తన లాబరేటరీ కూడా సెటప్ చేశాడు. కిటికీకి సమీపంలో వెలుతురు వచ్చేచోట మైక్రోస్కోప్ అమర్చాడు. దానికి అందుబాటులో చిన్న టేబుల్ మీద టెస్టు ట్యూబుల స్టాండ్, స్లైడ్లు ఉంచాడు. కాని సాంపిల్సు తీసుకోవడం, స్మియర్లు తీసుకోవడం వెంటనే జరగలేదు. ఈ చికిత్స దీర్ఘమయినది. చాలా సున్నితంగా చేయవలసింది. ఏ పొరపాటు జరిగినా భార్యాభర్తల సంబంధం దెబ్బతింటుంది.

చాల తర్జనభర్జనలు జరిగాయి.

విషయాన్ని డాక్టర్లిద్దరూ క్షుణ్ణంగా చర్చించారు.

వరహాలు-రంగమ్మ- వీరికేసుల ప్రకారం ఫెర్టిలిటీ సమస్య గురించి చికిత్స జరగాలి. అన్ని కేసులలోను పురుషులలో మగతనం లోపించడం, మేల్ ఇంపొటెన్సు స్పష్టంగా కనిపిస్తోంది. ఇదిగాక ఫిమేల్ లిబిడో ఒకటి, చూచాయగా.

ఫెర్టిలిటీ చికిత్సల గురించి స్త్రీకి స్మియర్ టెస్టు, పురుషులలో సిమెన్ సాంపిల్సు ముఖ్యం. స్మియర్ టెస్టు స్త్రీ గర్భకోశంలో వీర్యకణాల చలనం గురించి తెలుపుతుంది. సిమెన్ సాంపిల్స్ వలన వీర్యకణాల సంఖ్య తెలుస్తుంది. వీటిని బట్టి సంతానం కలగకపోడానికి పురుషుడు కారణమా, స్త్రీ బాధ్యురాలా అన్న సంగతి తెలుస్తుంది. వీటికి క్రమబద్ధమైన చికిత్సలున్నవి.

రెండవ సమస్య పురుషులలో మగతనం లోపించడం-ఇంపొటెన్సు రెండు రకాలు- ఒకటి తాత్కాలికమైనది- సెకండరీ ఇంపొటెన్సు-ఒకసారైనా-స్త్రీతో సంసారం చేసి, తరువాత చేయలేకపోతే దానిని తాత్కాలికమైన దానిగా పరిగణిస్తారు. దీనికి శారీరకమైన అనారోగ్యంకాని మానసికమైన అనారోగ్యంకాని కారణాలు కావచ్చు. గోనెలపాడు పురుషులందరూ రెండు సంవత్సరాల క్రింద వరకు సుఖంగా సంసారాలు చేసినవారే. కాబట్టి వీరికి తాత్కాలిక నపుంసకత్వమే వర్తిస్తుంది. పైగా పురుషులందరూ ఆరోగ్యవంతులే-కాబట్టి వీరికి మగతనం లోపించడానికి మానసికమైన అనారోగ్యమే కారణం కావచ్చు. ప్రైమరీ ఇంపొటెన్సు-ఒక సారికూడా స్త్రీతో సంగమించలేనివాడు దీనికి సంబంధిస్తాడు-ఇటువంటి వారికి చికిత్స చేయడం కష్టం- ప్రయోజనంకూడా ఉండదు.

ఇక ఫిమేల్ లిబిడో. ఇది ఉందని ఎలా అనుకోవడం? సాధారణంగా స్త్రీ చాల ఇబ్బందులను ఓర్చుకుంటుంది. సంసార విషయాలలో తొందరపడదు. పురుషులలో దౌర్బల్యం పొడసూపిన ఒక శాల్తీ కూడా ధైర్యంగావచ్చి మగడాక్టర్తో సంప్రదించలేదు. స్త్రీలే ముందుకు వస్తున్నారు. ఫిమేల్ లిబిడో ఉందనడానికి ఈ కారణం చాలదా?

చికిత్స ఎవరికి మొదలు పెట్టాలి?

ఎవరు సహకరిస్తారు?

మూడవవారం సరికి ఇరవైమంది స్త్రీలు బజారున పడనున్న తమ సంసార జీవితాల గురించి మొరపెట్టుకున్నారు. ఈ విధంగా పేషంట్ల సంఖ్య పెరుగుతుంటే మీనం మేషం లెక్కపెడుతూ కూర్చోడానికి వీలులేదు. ఏదో ఒక నిశ్చయానికి వచ్చి, ఎవరికో ఒకరికి చికిత్స మొదలుపెట్టాలి.

దీనికొక చిక్కు అడ్డు పడుతోంది. స్త్రీ పురుషులిద్దరికీ చికిత్స జరగాలి. మూడోవారం, మందుకొచ్చిన వరహాలుతో డాక్టరు నిర్మల చాల రహస్యంగా సంభాషణ జరిపింది. పన్నెండు గంటల తరువాత, అందరూ వెళ్ళిన పిమ్మట ఇద్దరూ కన్సల్టింగ్ రూములో కూర్చున్నారు.

"వరహాలు! మేము వచ్చేవారం నుండి చికిత్స మొదలు పెట్టాలనుకుంటున్నాము. ఇంతవరకు మీ భర్త ఆనందరావుతో మేము మాట్లాడలేదు. నేను స్త్రీని. నాతో ఈ విషయాలు మాట్లాడానికి ఆయన సిగ్గుపడొచ్చు. డాక్టరు గోపీకృష్ణగారితో మాట్లాడానికి అభ్యంతరముండదు కదా! ఆయన ఏంచేయాలో వివరంగా చెప్తారు."

"డాక్టరుగారు! మా ఆయన ముందుకు రాడానికి మొగ్గలేదు. ఆయన ఏంచేయాలో నాతో చెప్తే నేను అతనికి తిరిగి చెప్తాను. నేను అన్ని విధాల సహకరిస్తాను."

కనీసం ఒక జంటనయినా దారిలో పెడితే తరువాత పని సులువవుతుంది. వరహాలును పూర్తిగా నమ్మొచ్చు.

"వరహాలు! వినండి, ఇంతవరకు మనం రంగంలోకి దిగలేదు- ఇక దిగక తప్పదు. మీకు చిన్నపళ్ళెం, అంటే డిష్ ఒకటి ఇస్తున్నాను. దీనిలోకి మీ భర్త సిమెన్ సాంపిల్ తేవాలి. భార్యభర్తలు కలిసిన ఒక గంట లోపుగా మీరు డిస్పెన్సరీకి రావాలి. దీనితో మన పరీక్ష ప్రారంభమవుతుంది. మీ భర్తకు సంభవించిన రుగ్మత తాత్కాలికమైనది. మీరు మాతో సహకరిస్తే దంపతులు తొందరగా మామూలు పరిస్థితులకు వస్తారు."

డాక్టరు నిర్మల చెప్పిన వివరాలు వరహాలు చాల జాగ్రత్తగా వింది. ఆమె చెప్పిన ప్రకారమే రాత్రి వస్తానంది. ఈ విషయం ఎవరికీ తెలియకుండా జాగ్రత్త పడతానంది.

డాక్టరు నిర్మల మనస్సు తేలిక పడింది. సమ



న్యకు తొందరలోనే పరిష్కారం లభిస్తుంది.

డాక్టరు గోపీకృష్ణను పిలిచి, స్మియర్ టెస్టుకోసం, స్పెర్మటోజా లెక్కించడం కోసం అన్ని సన్నాహాలు పూర్తి చేయమంది. బహుశా వరహాలు రాత్రి పన్నెండు లోగా రావచ్చు. రాత్రే పని పూర్తి కావాలి. ఇతరులెవరికీ తెలియకూడదు.

అనుకున్న ప్రకారం ఆ రాత్రి పదకొండున్నరకు పనిమనిషిని సాయం తీసుకుని వరహాలు వచ్చింది. డాక్టరుగారి యింటి తలుపు తట్టింది. పదినిమిషాలు నిర్మలతో మాట్లాడి ఏడుస్తూ వెళ్ళిపోయింది.

కంపౌండింగ్ రూములో కూర్చున్న గోపీని పిలిచి, తలుపులు మూసేయమంది డాక్టరు నిర్మల.

"ఏమయింది, డాక్టర్?"

"గోపీ! కన్సల్టింగ్ రూములో మాట్లాడుకుందాం."

ఇద్దరు డాక్టర్లూ ఒకరికొకరు ఎదురుగా కూర్చున్నారు. టేబిలు మీద నున్న ఫ్లాస్కులోంచి రెండు కప్పులలో కాఫీ నింపి, సావకాశంగా ఇద్దరూ తాగడం మొదలుపెట్టారు.



"గోపీ! మన ప్రోగ్రామంతా తారుమారయింది."

"ఎలా? సాంపిల్సు ఆమె తీసుకు రాలేదా?"

"వరహాలుకి కోయిటస్-ఇంటరప్టస్ గురించి బాగా బోధపరిచాను. స్ప్లిట్ సాంపిల్ తేవాలన్నాను. మొదటి భాగంలో స్పెర్మటోజా సంఖ్య హెచ్చుగా ఉంటుందని, రెండవభాగం సహజంగా లోపలనే రిలీజుకావాలని చెప్పాను. ఇవన్నీ చిలక్కు చెప్పినట్లు పదిసార్లు బోధపరిచినా ప్రయోజనం లేకపో

యింది."

"నిర్మలా! డేంట్‌వర్రీ! స్మియర్ టెస్టు గురించి తరువాత చూచుకోవచ్చు. స్పెర్మకవుంటుకి సాంపిలు మరో విధంగా తీయవచ్చు. మాస్టర్ బేటరీసిమెన్ సాంపిలది. అటువంటివి మూడుసార్లు తీయాలి. ఈ విషయం భార్యతో చెప్తే బాగుండదు. నేనే అతనితో చేయి కలిపి ఒకదారికి తీసుకొస్తాను. ఆనందరావు చదువుకున్నవాడేమో తప్పకుండా ఒప్పుకుంటాడు."

"అదీ ఓ పాయింటే, గో ఎహెడ్ డాక్టర్!" అంది నిర్మల నవ్వుతూ.

ఆమెతోపాటు గోపీ నవ్వేశాడు కాని, అతని మనసులోని దిగులు పోలేదు.

డాక్టరు గోపీకృష్ణ ఆనందరావుని కలియడానికి ముందు మరో అరడజను మందిని కలిశాడు. నరసింహారావువంతులు, నారాయణసెట్టి, భిషక్ ప్రవీణ కౌస్తుభాచారి, రామునాయుడు, నరసింహారావుగారి కొడుకు వెంకట్రావు, వడ్రంగి చిన్నయ్య. వీళ్ళు ప్రారంభోత్సవానికి డిస్పెన్సరీకి వచ్చారట. తరువాత మరి రాలేదు.

గనెలపాడు గ్రామం చాల గమ్మత్తుగా ఉంటుంది.

బండిదారి వెడల్పు వదడుగులు-మరో వదడుగులు ఇటూ అటూ విడిచి పెట్టి రెండువేపులా యిళ్లవానలు. ఎడంచేతివేపు వదివానలు, కుడిచేతి వేపు వది. కలిగిన వాళ్లయిళ్లు ముందు వానల్లోను, వెనక్కు వెనక్కు సామాన్యులవి ఉన్నాయి. ఎడమ చేతి వేపున్న వాన దక్షిణముఖంగా ఉంది. అందులో రామునాయుడు గారిల్లు, గ్రామపంచాయతీ ఆఫీను, వక్కనే పోస్టాఫీను, పోస్టుమాస్టరు నుందరయ్యగారిల్లు, చివరని ఎలిమెంటరీ స్కూలు ఉన్నాయి. కుడిచేతివేపు వానలో మధ్య భిషక్ ప్రవీణులవారి ఆయుర్వేద వైద్యశాల, దానికి ఒక వక్క నరసింహారావు వంతులుగారిల్లు, రెండోవక్క నారాయణశెట్టిగారిల్లూ, దుకాణమూ, ఇంకా బడి వంతుల్ల యిళ్లు ఉన్నాయి.

అందరియిళ్లకన్న ఆయుర్వేద వైద్యశాల కమ్ కౌస్తుభంగారిల్లు కొట్టొచ్చినట్లు కనిపిస్తుంది. వీధిలో పెద్దగోడలు, గోడలమీద పైనుండి కిందివరకు, ఒక అంగుళం పాటు చోటైనా వదలకుండా రంగు రంగుల పెయింట్లతో మందులజాబితాలు, వాటి గుణగుణాలు, ధరలు కనిపిస్తాయి. ఒకప్రకటన గోపీకృష్ణ దృష్టిని ఆకర్షించింది.

"మగతనం లేదని మోకాళ్లలో బుర్రపెట్టుకొని ఆలోచిస్తే లాభమేముంది? మా కామవర్ధనిని సేవించండి. రెండు రోజుల్లో పోయినశక్తి తిరిగొచ్చి, వారం రోజుల్లో కనపడే ప్రతి ఆడదాని వెంటాపడతారు."

గోపీకృష్ణ నవ్వుకున్నాడు ముందు నరసింహారావు వంతులు గారింటికెళ్ళాడు. అక్కడ వంతులుగారు దొరకలేదు. అతని కొడుకు వెంకట్రావు కనిపించాడు-కుర్రాడికి వదిహేడేళ్లుంటాయి. కొంచెం పొడవుగా ఉంటాడు.

"నమస్కారం డాక్టరుగారూ! రండి, రండి!" అన్నాడు వెంకట్రావు గుమ్మంలో నిలబడ్డ గోపీకృష్ణను చూసి.

"నమస్కారం! నీపేరేమిటి?" ప్రశ్నించాడు గోపీ.

"వెంకట్రావు. నరసింహారావు వంతులుగారు మానాన్నగారే. ఆయన యింట్లో లేరు. రామన్నపేటలో వనుంటే వెళ్లారు. రండి, లోపలికి."

"మరోసారి వస్తాను, నాన్నగారు వచ్చిం తరువాత."

"ఏదైనా చెప్పమన్నారా?"

"వనేదీలేదు, వరిచయం చేసుకుందామని వచ్చాను."

"మీరు రావడమేమిటి, డాక్టరుగారు? మేమే మీ దగ్గరికి రావాలి. మీరు చాలా మంచి డాక్టరుగారు. మా నారాయడి కొడుక్కి మీర్లు ఎంతో బాగా, నొప్పొట్టకుండా, మంచిమాటలాడుతూ, ధైర్యం చెప్తూ కుట్లుకుట్టి ఇంజక్షనిచ్చారని వాడు నంబరవడి అందరితోను చెప్తున్నాడు."

"అది మా వృత్తి. మీరందరూ బాగుంటే అదే మాకు వదివేలు."

"డాక్టరుగారు! మీరు చాలవింతగా మాట్లాడుతున్నారే. మేమందరం బాగుంటే మీ వైద్యమెలా సాగుతుంది? లేడీ డాక్టరు వస్తే మా కౌస్తుభం మామ అంతగా వట్టించుకోలేదు. కాని, మీ రొచ్చారంటే చిందులు తొక్కుతున్నాడు. అతని ప్రాక్టీసంతా వడిపోయిందంటున్నాడు."

గోపీకృష్ణ నవ్వాడు.

డాక్టరు గోపీకృష్ణ పొడవాటి మనిషి. ఇరవై ఆరేళ్ల వాడు. మంచిబాడీ బిల్డరు. చూడచక్కనివాడు. మడతలు నలగని తెల్ల ఫంట్లాంలో తెల్ల టీ షర్టు దోపుకుని, బోరవిరుచుకొని నడుస్తుంటే వాళ్ల కళ్లన్నీ అతని మీదనే ఉన్నాయి. గ్రామంలో అతను షికార్లు తిరగడానికి అందుకే డాక్టరు నిర్మల అనుమతించలేదు. ఆనందరావుని దారికి తీసుకురావడానికి వెళ్లినప్పుడు అభ్యంతరం తెలువలేకపోయింది.




"యాచకన్య యాచకోశత్రుః"

"డాక్టరుగారూ! మీరూ, మామామనూ సాటా? మామామి చేతిమాత్ర-వైకుంఠయాత్ర!"

"వెంకట్రావ్! ఇంతవరకు అతనేకదా, మీ గ్రామ ప్రజల యోగ క్షేమాలు చూచుకుంటున్న వైద్యులు. పద! అతనిని కలిసి ఒక నమస్కారం చేసి వద్దాం!"

"డాక్టరుగారూ! మీదగ్గరికే అతను రావాలి"

"అదేం లేదయ్యా! పద నాతో! నలుగురిని పరిచయం చేద్దుగాని."

నరసింహారావు ఇంట చిక్కటి మజ్జిగ ఒక గ్లాసుడు తాగేవరకు వెంకట్రావు ఒప్పుకోలేదు.

బయటికొచ్చిన గోపీ కృష్ణ కంట, కౌస్తుభం ఇంటి గోడలమీదనున్న వ్యాపార ప్రకటనలు పడ్డాయి.

"డాక్టరుగారూ! మామామ నెలనెలకీ వీటిని మారుస్తుంటాడు. పట్టణంనుంచి పెయింటరొకడు వచ్చి మార్పులు చేసి పోతుంటాడు. ఏంచేస్తేనేం, ప్రస్తుతం వ్యాపారం మాత్రం చురుగ్గా లేదు."

"అంటే?"

"ఒక ఏడాది కింద మామామ వైద్యం బాగా పుంజుకుంది. ఆరు నెలలయేసరికి పట్టరానిద యింది. ఒకే మందును మొదట ధాతువర్ధని అని, తరువాత వీర్యవర్ధని అని, ఇపుడు కామవర్ధని అని అమ్ముతున్నాడు. ఇవి కాక ఊరుపిచ్చుకల లేహ్యం, ఏవో తైలాలు అమ్ముతున్నాడు. ఊరివాళ్ళ సొమ్ము దోచుకున్నాడంటే ఆశ్చర్యపోతారు."

"ఇపుడెలా ఉంది, మీమామ ప్రాక్టీసు?"

వెంకట్రావు అటు ఇటు చూసి మెల్లిగా అన్నాడు.

"ఇప్పుడు మామామ వ్యాపారం పూర్తిగా పడిపోయింది. అతనిదగ్గిర మందులు తిన్నవాళ్లంతా ఇప్పుడతనిని తిడుతున్నారు."

"ఏదయినా, అతన్ని ఒకసారి కలియాలి."

కౌస్తుభం ఇంట్లోనే ఉన్నాడు. వీధిలో అతనిఇంటికో పెద్ద అరుగు, దాని వెనుక పెద్ద గది, దానిలో మందులు నింపిన అద్దాల బీరువాలు మూడున్నాయి. పెద్ద టేబిలు-రెండు కుర్చీలు-టేబిలు మీద స్టెత స్కోపు-ధర్మామీటరు-భేషజానికి లోటులేదు. మీద సీలింగ్ ఫాన్ తిరుగుతోంది.

వెంకట్రావు లోపలికి వెళ్లి చెప్పివచ్చాడు.

ముందు కౌస్తుభం భార్య అలమేలు వచ్చి, కుర్చీలో కూర్చున్న గోపీ కృష్ణను రెప్పలార్పకుండా అయిదు నిమిషాలు చూచింది. "కుర్రాడు చాల బాగున్నాడు" అంటూ లోపలికి వెళ్లిపోయింది. ఆమెకు ముప్పయి సంవత్సరాలకు మించిన వయసు లేదు. ఎద సంవత్సరాల కూతురు రంగనాయకి ఉంది. మగపిల్లలు లేరు. ఆమె లోపలికి వెళ్లిన పది నిమిషాలకు కౌస్తుభం వచ్చాడు.

కౌస్తుభం వయసు నలభైకి లోపు. మనిషి అంత పొడవు కాదు-చెవులకు పోళ్ళ దుద్దులున్నాయి. పొడవాటి జుట్టు వెనక్కు ముడిపెట్టుకున్నాడు. చామన ఛాయ-వెడల్పాటి ముఖం-విశాలమైన నుదుటిమీద విస్తరించిన పట్టెనామాలు. మనిషిని చూడగానే ఇతను తిన్ననైనవాడు కాడని తెలుస్తుంది.

గోపీకి అలానే అనిపించింది. వజ్రాన్ని వజ్రమే కోయాలి. అతి వినయానికి నక్క వినయమే మందు.

"ఆచార్య కౌస్తుభంగారికి వందనాలు"

"నమస్కారం డాక్టరుగారు! అంతమాటనొద్దు.మీవంటి ఇంగ్లీషు డాక్టర్ల దగ్గిర మేమేపాటి!" అన్నాడు కౌస్తుభం ఎదురు కుర్చీమీద కూర్చొని.

"కౌస్తుభంగారు! అలోపతీ అలోపతీయే-ఆయుర్వేదం ఆయుర్వేదమే! ఆవిద్యను మీవంటివారు పోషిస్తున్నారు. నిజం చెప్పమన్నారా! నాకు ఆయుర్వేదమంటే విపరీతమైన అభిమానం. ఎన్ని చెప్పండి, ఇంగ్లీషు మందులలో ఆఫ్టర్ ఎఫెక్ట్సు ఎక్కడున్నాయి? ఎన్నుంటే మాత్రం, అవి మీ కామవర్ధనికి సాటిరావు కదా!"

"అది యదార్థంకూడాను. అయ్యా! గ్రామంలోని పురుషులంతా నిర్వీర్యులై పోతే ఇదేకదా పరువు నిలబెట్టింది!"

గోపీ ఇటూ అటూ చూశాడు, వెంకట్రావు కోసం.

కుర్రాడు కనిపించలేదు; ఇంట్లో అతని మాటలు వినిపిస్తున్నవి.

"ఓహో! నాకీ విషయం తెలీదు" అన్నాడు గోపీకృష్ణ.

"అయ్యా, ఇంగ్లీషు డాక్టరుగారు! దీన్నే వాజీకరణమంటారు. వాజి అంటే గుర్రం. ఆ గుర్రానికుండే శక్తిని హార్సు పవరని ఇంజనీర్లంటారు.ఆయుర్వేదంలో ఈ గుర్రానికో స్థానముంది. వీర్యాధిక్యత కల జంతువిది. వాజీకరణమంటే మానవుడికి గుర్రానికుండే శక్తి వచ్చేటట్టు ఔషధ ప్రయోగం చేయడం. ఇవి చాల రకాలు. మీకేం బోధపడుతుంది, నేచెప్తే?"

"చెప్పండి విందాం!"

శుశ్రుతసంహితను ఆంగ్లంలోకి అనువదించారు. అందులో చికిత్సా స్థానమనే విభాగముంది. ఇరవై

రంగా ఉంది.

ఈ వీర్య-వర్ధకౌషధాలలో ఏముంది?

పలువిధాలైన ఆహార పదార్థాలు, పానీయాలు, ఫలరసాలు, శ్రవణానందకరమైన సంభాషణ, శరీరానికి హాయినిచ్చే సుఖ స్పర్శ, పున్నమి వెన్నెలలో పులకించిన శరద్రాత్రి, వయసులో చిన్నవాళ్లుగా ఉండి అందకత్తెలయి పరవశతను కలిగించే యువతులు, ఆత్మను రంజింపజేసి మనసును పట్టి లాగే మధురమైన గానం, తాంబూల సేవనం, పుష్పమాలలతో అలంకరించుకోడం, చీకు చింతా లేక పరవళ్లు తొక్కే హృదయం - ఇవి కాక వీర్యవర్ధకాలు జీవితంలో ఎక్కడ లభిస్తవి?

గోపీకృష్ణ ఇదంతా లైబ్రరీలో చదివాడు. అయినా మరోసారి కౌస్తుభం నోటంట చెప్పించదలచాడు.

"ఈక్లీబత్వంలో రెండు రకాలున్నవి. మొదటి రకానికి మందులేదు. పుట్టుకతోనే కొందరు నపుంసకులవుతారు. కొందరి వీర్యవాహికలు దెబ్బతిని క్లీబులౌతారు. వీరిని బాగుచేయలేము. రెండవది తాత్కాలికమైనది. ఎవరైనా స్త్రీతో శత్రుత్వం పెట్టుకొని ఆమెను కలియాలనుకుంటే మగతనం పోతుంది. తనకు నచ్చని స్త్రీతో బలవంతంగా కలియడంజరిగి, ఆ జ్ఞాపకాలు మనసును విడువకుండా ఉంటే మగతనంపోతుంది. ఇవి మానసికమైన కారణాలు. ఘాటుగా, చాలా పులుపుగా, చాలా ఉప్పగా ఉండే పదార్థాలను సేవించడం, వేడిచేసే పదార్థాలను తరచుతినటం-వీటివలన సౌమ్యధాతువు శరీరంలో నశించి, పురుషులు నిర్వీర్యులౌతారు. మన వైద్యులకు వీటి విరుగుళ్ళుకూడా తెలుసు."

"ఒకటి రెండు చెప్పండి."

"గొర్రె పోతు ఉందికదా! దాని వీర్యకోశాలను పాలలో ఉడికించి, ఆ పాలలో నూవులు భావనచేసి తింటే మంచిబలం వస్తుంది. గొర్రెపోతు అండాలను ఉప్పుతోను, పిప్పలితోనుచేర్చి గోఘృతంలో వేయించిసేవిస్తే ఆ పురుషుడు నూరుమంది స్త్రీలను అనుభవించగలడు. ఉసిరికపప్పు మెత్తగా పొడి చేసి, ఉసిరికరసంలో బాగాతడిపి, ఆ పొడిని తేనెతోను, ఆవునేయితోను, చక్కెరతోను సేవించి, తదుపరి అర్థశేరుపాలు తాగితే ఎనభైయేళ్ల ముసిలాడుకూడా పదహారేళ్ల బాలాకుమారుడిలా స్త్రీతో సుఖిస్తాడు."

"కౌస్తుభంగారూ! చాలా గొప్ప విషయాలు మీనోటంట వింటున్నాను."

అంటే ఒకే యీత యీనిన ఆవు దాని దూడ సంవత్సరంవరకు ఎదగాలి. ఆ ఆవుని కేవలం తాజాగావున్న మాషపర్ణాలు, అంటే మినపమొక్కలతో మేపాలి. ఆ ఆవుపాలు మంచి వీర్యవర్ధకాలు."

"చాలా మంచి చిట్కాయే!"

"డాక్టరుగారూ! నేనో విషయం మనవిచేస్తాను-మనది ఋషులు పుట్టినదేశం-వేదాలలో చాలా రహస్యాలున్నాయి. అధర్వణవేదంలో చాలా మంత్రాలున్నాయి. మనుషుడిని నపుంసకుడిగా చేసేమంత్రాలున్నాయి.

త్వం వీరుధాం శ్రేష్ఠ తమాభిశ్రుతా స్యోషధే
ఇమం మే అద్యపురుషం క్లీబమోపాశినం కృధి.

ఓ ఓషధీ- ఉత్తమమయినదానా-పేరెక్కినదానా-ఈ పురుషుడిని నపుంసకుడిగా చేయవలసింది. ఈవిధంగా వేదమంత్రాలలో ఉంది. మన ఔషధాలు వాజీకరణం చేయగలవు, ఆ మనిషినే నపుంసకుడిగాను చేయగలవు."

"చాలా వింతసంగతే విన్నాను."

"ఇటువంటి ఆయుర్వేదరహస్యాలు ఎన్నో తెలుసుకొని, నేనీ కామవర్ధనిని తయారుచేశాను. మీదగ్గిరికి ఇటువంటి కేసులొస్తే మా కామవర్ధనిని వాడమని చెప్పండి. మీకుకూడా ఒక సాంపిల్ డబ్బాయిస్తున్నాను. ఒకవారం రోజులు మాత్రమే సేవించండి. తరువాత ఆలేడీ డాక్టరుపిల్ల చుట్టూ తిరక్కపోతే ఒట్టు."

ఇంతవరకు సహనంతో కౌస్తుభం మాటలు వింటున్న గోపీకృష్ణ, ఈ ఆఖరివాక్యం విని ఊరుకోలేకపోయాడు.

"కౌస్తుభంగారూ! మీరు చాలా విషయాలు చెప్పారు. విన్నాను. మీ వైద్యవిజ్ఞానానికి ఆశ్చర్యపోయాను. కానీ, మీరన్న ఆఖరి వాక్యం ఏమీ మర్యాదగా లేదు. డాక్టరు నిర్మల గురించి మీకేం తెలుసు? ఆ అమ్మాయి యం.బి.బి.యస్‌లో యూనివర్సిటీకి మొదటిదిగా వచ్చింది. గైనికాలజీ గోల్డు మెడలు పొందింది. చాలా పట్టుదల అయిన మనిషి. డిపార్ట్‌మెంటులో ఆమెకు మంచి పేరుంది. హాస్పిటలులోను, నర్సింగ్‌హోములలోను రోగులు ఆమెకోసం బారులుతీరి వేచియుంటారు. వెకిలిమాటలు, చిల్లరపనులు ఆమెకు సుతరాం కిట్టవు. ఈ గోనెలపాడు గ్రామానికి ఆమెను వేయడం మీరందరూ చేసుకున్న పుణ్యం. తెలుగుదేశంలో ఇటువంటి మంచి డాక్టరు దొరకడం దుర్లభం. మీరు తెలివితక్కువగా గ్రామస్థులదగ్గిర ఇటువంటి మాటలంటే ఆమె చాలా పట్టించుకుంటుంది. నేనూ డాక్టర్నే-అయినా ఆమెతో చాలా జాగ్రత్తగా వ్యవహరిస్తాను. ఈ




విషయం బాగా గుర్తుంచుకోండి.''

కొంచెం దూరంలో నిలబడి, గోపీకృష్ణ ఉద్రేకంతో ఆడినమాటలన్నీ వింటూ నీరికారిపోయాడు వెంకట్రావు.

కౌస్తుభందగ్గిర సెలవైనా తీసుకోకుండా గోపీకృష్ణ వీధిలోకి నడిచాడు.

''డాక్టరుగారూ! మా మామ ముఖం బాగా మాడ్చారు. చాలా మంచి పనిచేశారు. ఇతనికెప్పుడూ చనువివ్వకూడదు. డబ్బుమదం హెచ్చయి, అందరూ అల్పులని అనుకుంటాడు.''

గోపీకృష్ణ జవాబు చెప్పలేదు.

''రామునాయుడుగారిని చూస్తామన్నారు.''

''అవును.''

రామునాయుడుగారికి ఏభైయేళ్ళుకూడ ఉండవు. గిరజాల జుత్తు, చెవులకు పోగులు, మంచి ఛాయ, మనిషి అంతపాడవు కాదు. గౌరవంగా మాట్లాడి ఇద్దరు డాక్టర్లు తన గ్రామంలో పనిచేస్తున్నందుకు సంతోషం వెలిబుచ్చారు.

నరసింహారావు పంతులుగారుకూడా పంచాయతీ ఆఫీసులోనే కనిపించారు.

మనిషి కొంచెం పొడుగు. గుక్కతిప్పుకోకుండా మాట్లాడతారు-ఎలిమెంటరీ స్కూలు హెడ్మాస్టరాయన. ఊళ్ళో రాతకోతలు, సలహాలూ సంప్రదింపులూ అన్నీ అతనివే. మంచి చతురమైన సంభాషణ అతనిది.

నారాయణసెట్టిని అతని దుకాణంలోనే కలిశారు. డాక్టరుగారు స్వయంగా తన దుకాణానికి వచ్చినందుకు అతను చాలా సంతోషించాడు. ఇంట్లోంచి కాఫీ తెప్పించి యిచ్చాడు. చాలా మర్యాదగా, జాగ్రత్తగా మాట్లాడాడు.

ఆనందరావు దారిలోనే కలిశాడు. డాక్టరు గోపీకృష్ణ అతను చాలాసేపు వీధిలో నిలబడే మాట్లాడారు. డాక్టరుగారు తనను వెదుక్కుంటూ వచ్చినందుకు అతను చాలా బిడియపడ్డాడు. తప్పకుండా సాయంకాలం వచ్చి కలుస్తానని, గోపీకృష్ణ స్నేహం కోరుతున్నానని చెప్పాడు.

అప్పటికి చాలామందిని కలియడం జరిగింది. వెంకట్రావు యింటికి వెళ్ళిపోయాడు. గోపీకృష్ణ ఒక్కడూ గ్రామంవెనుక వాసలలో నడుస్తూ ఒక్కసారి వచ్రంగి దుకాణందగ్గిర ఆగిపోయాడు. బండిచక్రానికి ఇరుసుకుంచం తయారుచేస్తున్నాడు చిన్నయ్య. అప్పటికి మధ్యాహ్నం పన్నెండు దాటింది.

''నీ పేరు చిన్నయ్యేనా?'' గోపీకృష్ణ అడిగాడు.

''అవును బాబూ! అవునవును'' అన్నాడు చిన్నయ్య. తలపైకెత్తి, తన ఎదుటనున్న ఆరడుగుల మనిషినిచూసి, పనిఆపేసి, చేతులు ముడుచుకొని లేచి నిలబడ్డాడు.

''గౌరమ్మనెందుకు విడిచిపెట్టావు?'' సూటిగా, అడిగాడు గోపి.

చుట్టుపట్ల ఎవరూ లేరు.

''ఆమె... ఆమె...'' చిన్నయ్య నీళ్ళు నమలుతున్నాడు.

''చెప్పు, ఆగిపోయావే?''

''ఆమె..మరి..కామినీ పిశాచమని ఆచారిగారన్నారు.''

''కామినీ పిశాచమా?''

''అవును. అది నా శక్తంతా పీల్చేసింది. నా ఆయుష్షు తరిగిపోయింది. వీర్యవర్ధనులు, ధాతువర్ధనులు, కామవర్ధనులు ఎన్ని డబ్బాలుతిన్నా కొంచెమైనా లాభం లేకుండా పోయింది. బతికి బయటపడాలంటే దాని ముఖం చూడకూడదని ఆచారిగారు మరీమరీ చెప్పారు. లేకపోతే ఆరునెలల్లో చచ్చిపోతానన్నారు.''

గోపీకృష్ణకు కౌస్తుభం మాయ అంతా అర్థమయింది.

''వైద్యానికి ఎంత ఖర్చు పెట్టావు?''

''వెయ్యి దాటింది.''

''గౌరమ్మ కామినీ పిశాచమంటే ఎవరైనా నవ్విపోతారు. అసలు పిశాచం కౌస్తుభం. నిన్ను నమ్ముకొని ఆమె వేరింటికాపురం పెట్టించింది. ఊరివాళ్ళేమన్నా వినిపించుకోకుండా నీతోనే ఉంది. నీ వ్యాపారానికి పెట్టుబడి పెట్టింది. నీమీద ప్రాణాలు నిలుపుకుంది. అటువంటి ఆమెను ఒక్కసారి విడిచిపెట్టావు, ఈ ఆచారి మాటలునమ్మి. గౌరమ్మకిపుడు హిస్టీరియా. మూర్ఛ వచ్చిపడిపోతుంది. నువ్వు పూర్వపు అభిమానంతో చూస్తేనే ఆమె రోగం తగ్గుతుంది. వెంటనే ఆమెదగ్గరికి వెళ్లడం మొదలెట్టు.''

చిన్నయ్య ముఖంమీద పేద చిరునవ్వు తోచింది.

''డాక్టరు బాబుగారూ! నేనిప్పుడు ఎందుకూ పనికిరానివాడిని. నా మగతనం పూర్తిగా పోయింది. ఈ సంగతి గౌరమ్మకు తెలీదుకాబట్టి ఇంతవరకు బతికుంది. సంగతి తెలిస్తే ఉరిపోసుకుని చచ్చిపోతుంది.''

చిన్నయ్య కళ్ళు తుడుచుకుంటున్నాడు.

''చిన్నయ్యా! ఈ బలహీనత ఎంతో కాలముండదు. సరియైన చికిత్స ఉంటే వేగంగా కోలుకోవచ్చు.




అన్నిటికన్న ముఖ్యమయినది ఆత్మవిశ్వాసం. నువ్వు బాగుపడేదాకా, గౌరమ్మతో గడిపిన మంచి రోజులు జ్ఞాపకం తెచ్చుకో!''

చిన్నయ్య భుజంతట్టి, గోపీకృష్ణ డిస్పెన్సరీవేపు నడిచాడు.



## 3

డాక్టరు గోపీకృష్ణ గొనెలపాడు వచ్చి అప్పుడే నాలుగు నెలలయింది. మంచి ఎండాకాలంలో వచ్చాడు. గ్రామం కొండలఒడ్డున ఉన్నదేమో, ఎండలు మరింత తీవ్రంగా మండబెట్టాయి. అప్పుడప్పుడు మేఘాలుతేచి ఒకటో రెండో జల్లులు కురిస్తే, భూమిలో దాగినవేడి ఆవిర్లుగా పైకి వచ్చేది. దానితోపాటు మండ్రగబ్బలు, తేళ్ళు, పాములుకూడా విచ్చలవిడిగా సంచరించేవి. అతను చాలా ఉత్సాహంతో లాబరేటరీ సెట్‌చేశాడేకాని, ఒకరోజుకూడా దానిని ఉపయోగించిన పాపానపోలేదు.

పని ఏదో ఉండేది. ఆవూరి డిస్పెన్సరీకి పోస్టుచేసిన కాంపౌండరు అసలు రానేరాలేదు. ఆ మారుమూల గ్రామానికి ఎవరూ సులువుగాపోరు. మందులు కలవడం, అప్పుడప్పుడు ఫకీరు రాకపోతే తానే కట్టుకట్టడం, ఇంజక్షన్లివ్వడం వంటివి డాక్టరు గోపీకృష్ణే చేస్తున్నాడు. వచ్చే రోగులు తక్కువగా ఉండడం నుంచి వారిని చాలా నిదానంగా పరీక్షచేయడం జరుగుతున్నది.

డాక్టరు నిర్మలలోకూడా కొంత మార్పు వచ్చింది. ఆమె గోపీతో మామూలుగానే ప్రవర్తిస్తున్నది. వాళ్ళిద్దరూ విధిగా సాయంకాలం ఆరుగంటల తరవాత, పనివాళ్ళు వెళ్ళిపోయిన పిమ్మట, ఒక గంటసేపు కన్సల్టింగ్ రూములో కూర్చొని మాట్లాడుకునేవారు. పాతకేసులు పాతకేసులుగా ఉంటుండగా, కొత్తవి రోజుకి ఒకటీ రెండూ వస్తూనే ఉన్నాయి. ఈ సరికి నూరుగురు స్పెషల్ అడపేషంట్లు డిస్పెన్సరీకి వచ్చారు. వారి అందరిదీ ఒకటే బాధ-కుటుంబ విచ్ఛిత్తికి దారితీసే పురుషుల దౌర్బల్యం-దాన్ని ఈ ఇద్దరు డాక్టర్లూ దూరంచేయలేకపోతున్నారు. వచ్చే రోగుల విశ్వాసం చూరగొంటూ, బాధవలన సంక్రమించిన చిన్న చిన్న అస్వస్థతలకు మందులిచ్చి, వారికి ధైర్యం చెబుతూ, సరియైన చికిత్సకోసం తీవ్రంగా కృషిచేస్తున్నారు. గ్రామవాసులు కూడా ఈ విషయం అర్థం చేసుకున్నట్లే ఉంది. ఈ జాడ్యం వైద్యవృత్తికే సవాలుగా ఆ యువడాక్టర్లు తీసుకున్నారు.

మొదటి పని స్పెర్మటోజాక వుంట్-ఇది ఇప్పటికి జరగలేదు. వరహాలు ద్వారాచేసిన ప్రయత్నాలు ఫలితాన్నివ్వలేదు.

గోపీకృష్ణ మరో పనిచేస్తున్నాడు. వీలయినపుడు గ్రామంలోకిపోయి, పెద్దవాళ్ళను చూడడమేకాకుండా, సామాన్యులను, కింద తరగతుల వారినికూడా చూసి మాట్లాడివస్తున్నాడు. ఎక్కడ చూసినా అతనికి పురుషులలో ఒక ఆందోళన, నిరాశ, నిస్పృహ, విరక్తి, శక్తిహీనత స్పష్టంగా గోచరిస్తున్నవి. వారికి విటమిన్ టాబ్లెట్లు, ట్రాంక్విలైజర్లు, నిద్రమాత్రలు తాత్కాలికంగా ఉపశమనమిచ్చే ఔషధాలను మాత్రమే ఉపయోగించి, మందులవలన కలిగే యిబ్బందులను చాలా తక్కువ స్థాయిలో ఉంచడానికి వాళ్ళిద్దరూ ప్రయత్నించారు.

ఒక్కొక్కప్పుడు డాక్టరు నిర్మల ఆత్మవిమర్శ చేసుకొని, ఒక వ్యక్తిపై ఏర్పడిన దురభిప్రాయం తొలగించుకోడం ఎంత కష్టమో అని అనుకుంటుంది. తాను ప్రతి విషయానికి బాగా ఆలోచించి, లోతులకుపోయి, పరిష్కారంకోసం బాధపడి, మూడ్‌చెడిపోయినప్పుడు-ఈ గోపీకృష్ణ తనను ఈలోకంలోకి తెస్తుంటాడు. వృత్తివిద్యగురించి చర్చించడానికి అతనికన్న మరొకరు దగ్గర్లో లేరు. మొదటిరోజు జరిగిన సంఘర్షణ మూలాన్నో లేక సహజంగా ఆమెపట్లకల గౌరవంవల్లనో, అతనెప్పుడూ ఆమెతో చాలా జాగ్రత్తగా ప్రవర్తించేవాడు. పైగా, పక్కయింట్లోనే అతను ఉండడంనుంచి ఆమెకు చాలా ధైర్యంగా ఉండేది. అన్నీ అనుకూలంగావున్నా అల్లుడి నోట్లో శని అన్నట్లు, సమస్యలకు పరిష్కారం మాత్రం తొందరగా లభించడంలేదు. అదే ఆమెపడే బాధ అంతా.

డాక్టరు గోపీకృష్ణ గ్రామంలో పర్యటించి వచ్చిన సాయంకాలాల్లో ఆ వూరి మనుషులగురించి, వారి నమ్మకాలగురించి, కౌస్తుభం మాయలగురించి నిర్మలతో చెప్పేవాడు. వారిద్దరూ ఏవో మందులిచ్చే వైద్యులుగా మెసలడానికిబదులు, ఆ గ్రామప్రజల నిత్యజీవితంలో భాగస్వాములయి, ఆ పెద్ద కుటుంబంలో సభ్యులై వారి యిబ్బందులకు వారితోపాటు కష్టపడుతూ, నాలుగు నెలలయేసరికి ఆ వూరికి చాలా పాతబడిపోయారు.

వంటావిడ ఉదయం వచ్చి వంటపని చూసుకుంటుంది. గోపీకృష్ణ పని ఉన్నా లేకపోయినా, ఉదయం ఎనిమిదినుంచి మధ్యాహ్నం డిస్పెన్సరీ మూసేదాకా కాంపౌండరు గదిదాటి వెళ్లడు. నిర్మల ప్రత్యేకంగా పరిశీలిస్తున్న కేసులన్నీ సక్రమంగా ఫైలుచేసి, జాగ్రత్తగా వాటిని చదివి భద్రపరుస్తాడు. తీరికఉన్న వేళల్లో మెడికల్‌పుస్తకాలు చదవడం అతనికిప్పుడు అభ్యాసమయింది. ఒక్కొక్కప్పుడు తీవ్రంగా విషయం గురించి ఆలోచించి తల దిమ్మెక్కినపుడు అతను నవ్వుకుంటాడు, గాలిబట్టిన జీవితానికి ఏదో సరియైన దారి దొరికిందని.

డాక్టరు గోపీకృష్ణ రోజూ ఆనందరావుని కలుస్తున్నాడు. ఇద్దరూ కొంతసేపు దేశం గురించి, ఇతర విషయాలగురించి మాట్లాడుకుంటారు. కాఫీయో, టీయోతాగి, మెల్లగా ఆనందరావు చిన్నతనంగురించి, యౌవనంగురించి వివరాలు సేకరించేవాడు. ఆవిధంగా రెండునెలలు శ్రమపడవలసి వచ్చింది



అన్ని సంగతులు తెలుసుకోడానికి. ఒకరోజు సాయంకాలం ఇద్దరూ కొంతదూరం రామన్నపేట వేపు నడిచి, తోవలో ఒకచెట్టుకింద కూర్చున్నారు.

"ఆనందరావు! నేను మీవూరికొచ్చేసరికే మీ అందరూ ఒక చెప్పుకోలేని రుగ్మతతో అవస్థపడుతున్నారు. సాధారణంగా ఇటువంటి సమస్యలు రహస్యంగా వుంటాయి. పైకి పొక్కవు. మనదేశంలో ఈ సెక్సు సమస్యల్ని నకిలీడాక్టర్లు కుదురుస్తామని పెద్ద ప్రకటనలు చేస్తారు. ఎంతమంది బాగుపడ్డారో తెలీదు. కాని, మోసపోయిన వారిని చూస్తే జాలివేస్తుంది. అన్నిదేశాలకన్నా ఈసమస్య అమెరికాకు

హెచ్చుగా వుంది. వాళ్ళు ప్రత్యేకమైన హాస్పిటళ్లలో వీటికి చికిత్స చేస్తున్నారు. ప్రస్తుతం మనఎదుటును న్న సమస్య సంతానం కలక్కపోవడం. మరో సమస్య పురుషులలో నిర్వీర్యత్వం. మొదటి సమస్యగురించి పరిశీలన ప్రారంభించాము. దీనిని ఇన్‌ఫెర్టిలిటీ క్రింద ట్రీట్‌మెంటు చేయాలని నిశ్చయానికి వచ్చాము. రెండవ సమస్య మేల్‌ఇంపొటెన్సి. ఇన్‌ఫెర్టిలిటీ ట్రీట్‌మెంటు గురించి మీతో మాట్లాడదామనుకుంటున్నాను.''

ఆనందరావు ఏమీ జవాబు చెప్పలేదు.

''ఈ విషయాలు నలుగురిలోను చర్చించడం బాగుండదు. ఎవరికీ తెలియకూడని సంగతులివి. ఇటువంటివి వైద్యుల దృష్టికి వేగంగా రావు. రోగులు ఓపికతో యిబ్బందులు భరిస్తారుకాని, వైద్యులకు కూడా చెప్పరు. మీరు చదువుకున్నారు. విషయం అర్థం చేసుకోగలరు. మీపైని కొన్ని పరీక్షలు జరపాలని అనుకుంటున్నాను. మగడాక్టరు పురుషులకు, లేడీడాక్టరు స్త్రీలకు ఈ పరీక్షలు జరుపుతారు. రివాజు ఏమిటంటే స్త్రీ పురుషులనిద్దరినీ తమతో కూర్చుండబెట్టుకొని, మగడాక్టరు ఆడడాక్టరు వారితో విధానమంతా చర్చిస్తారు. డాక్టర్లిద్దరూ భార్యాభర్తలయితే మంచిది.''

''అయితే మీరు, డాక్టరు నిర్మలగారు ఈపని చేయగలరా?'' ఆనందరావు ప్రశ్నించాడు.

''మేమిద్దరం భార్యాభర్తలంకాము. కాని ఇద్దరం విషయాన్ని బాగా అధ్యయనం చేశాము. పద్ధతుల గురించి చర్చించడంలో ఇబ్బంది ఉండదు. మీరు, మీ భార్య ఈ పరీక్షలకు అంగీకరిస్తే మీతో చర్చించడానికి అభ్యంతరం లేదు.''

ఆనందరావు చాలాసేపు ఆలోచించాడు.

''ఏదో తప్పువని చేస్తున్నట్లు మనసు బాధపడుతోంది. మీరు డాక్టర్లు. ఎన్నో మావంటి కేసులుచూసి ఉంటారు. కాని, మాకు ఇది చాలా ముఖ్యమయినదికదా! సాధ్యమయినంతవరకు మగవాళ్ళకి మగడాక్టరు, ఆడవాళ్లకు లేడీడాక్టరు చికిత్స చేయడం బాగుంటుంది. ఇది నా ఒక్కడి అభిప్రాయంకాదు...'' అంటూ ఆనందరావు ఆగిపోయాడు.

డాక్టరు గోపీకృష్ణ పరిస్థితిని అర్థం చేసుకున్నాడు. చాలామంది మగాళ్లకు తమలోపం గురించి తెలుసు.

''మంచిది. అవిధంగానే మీరు సహకరించండి.''

''తప్పకుండా!'' ఆనందరావు లేచినిలుచున్నాడు.

''కూర్చోండి, ఒక్క అయిదు నిమిషాలు.''

ఆనందరావు తిరిగి కూర్చున్నాడు.

''సంతానం ఎందుకు కలగడంలేదో అన్న విషయం గురించి మనమిప్పుడు చర్చిస్తున్నాము. దీనికి స్త్రీపురుషులిద్దరూ బాధ్యులే. లోపం స్త్రీలోనే ఉండవచ్చు. లేక పురుషుడిలో ఉండవచ్చు. భార్యాభర్తలిద్దరికీ వేరువేరు పరీక్షలున్నాయి. కనీసం మూడు సిమెన్ సాంపిల్సు ఎనలైజుచేయాలి. చాలా కాలం భార్యాభర్తలు దూరంగా ఉండి తిరిగి కలుసుకున్న వెంటనే ఈ పరీక్షలు జరపరాదు. మామూలుగా సంసారం చేస్తున్న భర్తనుండి వీటిని తీసుకోవాలి. తొలుత హెచ్చుగా వచ్చిన సిమెను నాసిరకమైనది. సాధారణంగా ఒకసారి విడుదలైనది రెండు నుండి ఆరు మిల్లీలీటర్లవరకు ఉంటుంది. సంతానం మామూలుగా కలిగేవారిలో వీర్య కణాలు మిల్లీలీటరుకు ఆరుకోట్లుంటాయి. ఆ సంఖ్య ఆరుకోట్లకు రెండుకోట్లకు మధ్యనుంటే ఆ పురుషుడికి సంతానప్రాప్తి తక్కువగా ఉంటుంది. రెండుకోట్లకు తక్కువైతే అసలు సంతానమే కలగదు. ఒకసారి మీలో ఏ లోపంలేదని నిర్ధారణకువస్తే, అపుడు మీ భార్యకున్న లోపాలను తెలుసుకుని వాటిని బాగుచేయవచ్చు. ఈ పరీక్షలు రేపటినుండి ప్రారంభించుదాము. రేపు రాత్రి తొమ్మిదిగంటలకు రండి. భోజనం లఘువుగాచేసి వస్తే మంచిది. మనిద్దరం లాబొరేటరీలో కూర్చుందాం. సాంపిలు తీయడానికి అనువుగా ఏర్పాటులు చేస్తాను''

ఆనందరావు గుండె బితుకుబితుకుమంటున్నది. ఈ పరీక్షలో తను వీర్యవంతుడు కాడని డాక్టరంటే ఎంత అవమానకరం! అయినా తెలుసుకోడంలో తప్పు లేదుకదా! మనసును దిటవుచేసుకొని అతను ఇంటికి వెళ్ళిపోయాడు.

మర్నాడు ఆనందరావు అన్నవేళకే వచ్చాడు.

డాక్టరు గోపీకృష్ణ లాబొరేటరీ ఖాళీచేశాడు. కిటికీలకు తెరలు దించాడు. నీలంరంగు జీరోవాట్‌బల్బు లోపల వెలుగుతోంది. దాని కాంతిలో ముఖాలను గుర్తుపట్టడానికికూడా వీలుపడదు.

గదికి మధ్యను పడకకుర్చీలో ఆనందరావు కూర్చున్నాడు.

అతని వెనుకకు గోడదగ్గిర డాక్టరు గోపీకృష్ణ మామూలు కుర్చీమీద కూర్చున్నాడు.

కొంతసేపు నిశ్శబ్దం సాగిన తరువాత వెనుక నుండి గోపీకృష్ణ గొంతుక వినవచ్చింది. ఆ కంఠంలో మృదుత్వముంది, లాలన ఉంది, సమ్మోహనముంది.

''ఆనందరావుగారూ! ఆరోజు ఆదివారం. ఇప్పు




డు మీకు ఇరవైనాలుగేళ్ళు. ఈ సంగతి జరిగి ఎనిమిది సంవత్సరాలయింది. కాని, ప్రతి పురుషుని హృదయంలోను ప్రథమ సమాగమంగురించి జ్ఞాపకాలు బలంగా నాటుకుపోతాయి. అప్పుడు మీరు పట్నంలో చదువుకుంటున్నారు. ఎండాకాలం సెలవులిచ్చారు. మీ ఊరురాకుండా మీ అమ్మమ్మ గారి వూరు వెళ్ళారు. పొంగిపొరలుతున్న యవ్వనం. చీకూచింతాలేని జీవితం. పరీక్షలు బాగా రాయడంచేత ఒకవిధమైన సంతృప్తి. మనసు తేలికగా వుంది. ఆ వూరు చాలా చక్కనిది. ఊరిని ఒరుసుకునిపారేనది. ఎండాకాలంలోకూడా లోతులకుపారే నీలాలనీళ్ళు. స్నానానికి ఎంతో హాయిగా ఉండేవి. మీరు రోజూ అందరూ మునిగే స్నానాలరేవుకు వెళ్ళేవారు. అక్కడ మనుమలరద్దీ ఎక్కువగా ఉంటుంది. ఆడవాళ్ళమధ్య స్నానం చేయడానికి సిగ్గువేసి ఒక మధ్యాహ్నం మీరు మరికొంచెం ఎగువకు, రెల్లుపొదలమాటున, నదివంపులు తిరిగినచోటికి, స్నానానికి వెళ్ళారు. ఎత్తుగా పెరిగిన రెల్లు దుబ్బులు. తేటగాపారే మొలబంటినీరు. మీరు పొదలదగ్గిరికి వెళ్ళేసరికి ఒకరు మీకంటే ముందు వెళ్ళినట్లున్నారు. ఎవరని మీరు తలెత్తి చూశారు. ఆవ్యక్తిమరెవరోకాదు-మీ పొరుగువాళ్ళమ్మాయి-ఆమెకు పెండ్లయింది. మొగుడు మిలిటరీకి వెళ్ళిపోయాడు. ఆమెకూడా అక్కడికే మీకు ముందుగా స్నానానికి వచ్చింది. ఆమె చీరవిడిచి నీటిలోకి దిగుతుంటే మీలో ఒకవిధమైన ఉద్రేకం. మొదటిసారి సుందరమైన స్త్రీ శరీరాన్ని చూచినపుడు కలిగే ఉద్వేగం..."

ఆవిధంగా డాక్టరు గోపీకృష్ణ చెప్పుకుంటూ పోతున్నాడు. విషయమంతా ఆనందరావు నోటవిన్నాడు. ఆ సైనికుని భార్యతో అనుభవించిన సుఖాన్ని అతను ఈనాటికికూడా మరచిపోలేకపోతున్నాడు. ఆనందరావు యిప్పుడు భార్యతో కాపురం చేస్తున్నాడు. ఈ భార్య సైనికుడి భార్యకన్న చాలా అందమయినది. ఆకర్షణీయమైన శరీరంకలది. చాలా అనుకూలవతి. ఎన్ని సుగుణాలు ఆమెకున్నా తొలి సంగమం తలపులు ఆనందరావు మరచిపోలేకపోతున్నాడు. ఆ సంగతులు తలుచుకున్నప్పుడు, ప్రస్తుతం వింటున్నప్పుడు అతడు కామోద్రేకం పొందకుండా ఉండలేడు. డాక్టరు గోపీకృష్ణకోరిన సాంపిలు చాలా సులభంగా లభిస్తుంది.

ఒక అరగంటవరకు చాలా మెల్లగా, సానునయంగా వినిపించిన ఆ కథనంలో గోపీకృష్ణ తన కౌశలమంతా వినియోగించాడు. తరువాత పెద్దలైటు వెలిగించాడు. వాలుకుర్చీలో కూర్చున్న ఆనందరావు కళ్లనుండి ధారాపాతంగా నీళ్ళు ప్రవహిస్తున్నవి. పక్కన సాంపిల్ కలెక్షనుకోసం పెట్టిన డిష్ అలానే ఉండిపోయింది.

ఆనందరావు మాట్లాడకుండా ఇంటికెళ్ళిపోయాడు.

గోపీకృష్ణ గది తలుపులుమూసి, జరిగిన సంగతి వెంటనే డాక్టర్ నిర్మలకు తెలియజేయాలనుకున్నాడు. ఫలితం సాధించలేకపోయినట్లు చెప్పడంలో అర్థంలేదు. ఆమెను నిద్రలేపడంవల్ల ఒరిగేదేమీలేదు.

ఉదయం ఎనిమిది కాకుండా డాక్టరు నిర్మల స్నానాదులు ముగించి డిస్పెన్సరీకి వచ్చికూర్చుంది. ఆసరికి డాక్టరు గోపీకృష్ణ అక్కడే వున్నాడు. రాత్రి జరిగినసంగతంతా ఆమెకు వివరంగా తెలియజేశాడు.

డాక్టరు నిర్మల జవాబుగా నవ్వింది.

గోపీకృష్ణకు ఏమీతోచలేదు.

"డాక్టర్ నిర్మలా! నేను తప్పుగా ఈపని చేయలేదుకదా?"

"గోపీ! నువ్వు సరిగా చేశావా లేదా అన్నది ప్రశ్నకాదు. ఏవిధంగా చేసినా ఫలితం లేకపోయిందే అన్న విచారం ఉండిపోయింది. నా ప్రయత్నాలు, నీ ఉత్సాహం, ఏవిధంగా నీరుకారిపోతున్నాయో చూడడానికి ప్రత్యక్షసాక్షులుగా మిగిలిపోయాం."

"నిర్మలా! ఒక ముఖ్యమయిన విషయం మనం మరచిపోయాం. సమస్య పూర్తిగా పురుములకు చెందింది. ఫెర్టిలిటీకైనా, ఇంపొటెన్సుకైనా పురుముడు రంగంలో నిలబడితేనేగాని ఫలితంలేదు. ఇన్‌ఫెర్టిలిటీ టెస్టులు కొంతకాలం వాయిదావేసి మేల్ ఇంపొటెన్సుమీద దృష్టి సారించాలి"

"గోపీ! ఆవిధంగానే కానీ!"

"ఇప్పటివరకు నీకు అందిన సమాచారాన్నిబట్టి పురుములకు ప్రైమరీ ఇంపొటెన్సు లేదు. సెకెండరీదే! అందరూ కొంతకాలం కిందటివరకు సుఖంగా సంసారాలు చేసినవారే."

"అవును"

"ఈ సెకెండరీ ఇంపొటెన్సుకి కారణాలు నీకు తెలును. అయినా మరోసారి మననంచేద్దాం. మొదటిది గుర్తింపబడని డయబెటీస్-రెండవది తాగుడు అలవాటు-మూడోది మాదకద్రవ్యాల వాడకం-నాలుగోది రెస్పిరైన్‌వంటి బ్లడ్‌ప్రెషరు తగ్గడానికిచ్చే మందులవాడకం-నరాలవల్ల సంభవించే వ్యాధులు, ముఖ్యంగా వెన్నుపూసకు సంబంధించిన ఏ-హైపొగొనాడిజమ్..."

"గోపీ!ఆవు...ఇవన్నీ పుస్తకాలలో ఉన్నమాట నిజమే. ఇప్పటివరకు మనకు అందిన స్త్రీల రిపోర్టులవల్ల, ఈ పురుషులందరూ ఇటువంటి జాడ్యాలులేనివాళ్ళే. కాబట్టి, వాళ్లకు కలిగిన దౌర్బల్యం కేవలం మానసిక వ్యాధులకు సంబంధించినది. మనం లోతులకు పోతే ఈ మానసిక దౌర్బల్యాప్రభావం గోచరించవచ్చు. తల్లికొడుకుమీద విపరీతమయిన ప్రేమను పెంచుకొని, వాడిని తన గుప్పెటలో ఉంచుకొని, వాడు పడకగదిలోకి పోయినవరకు తన అధికారంకిందనే బంధిస్తే, ఆ పురుషుడు మగతనం పోగొట్టుకుంటాడు. అదేవిధంగా తండ్రి కూడా కొడుకును తన అదుపుఆజ్ఞలలో ఉంచి, ఇదిచేయాలి, అదిచేయకూడదు, భార్యతో పడుకుంటే ఆయుక్షీణం మొదలయిన సూక్తులుచెప్పి కొడుకు జీవితాన్ని నరకప్రాయంచేస్తే ఈ దౌర్బల్యం రావచ్చు. ఇక మతపరమైన మూఢాచారాలు, నమ్మకాలు, ఆంక్షలు మొదలైనవి సాధారణ సాంసారిక జీవితానికి ఆటంకాలుగా పరిణమిస్తాయి. భర్త హైమోసెక్సువలయితే భార్యమీద ధ్యాసముండదు. ఒక్కొక్కప్పుడు కొందరు వ్యభిచారగృహాలకుపోయి అక్కడి అనుభవాలను, నీచాతినీచమైన పరిస్థితులను మరచిపోలేక స్త్రీ అంటే అసహ్యం కలిగి కామంలేకపోవడం-ఇవిగాక కరడుగట్టిన తాగుడు-ఇవి మానసికంగా కలిగిన దౌర్బల్యానికి కారణాలు."

"థాంక్స్, నిర్మలా! కాని, మన మగపేషెంట్లలో ఈ కారణాలు కనిపించవు."

"ఇవి చాలా లోతులకు పాతుకుపోయినవి. పేషెంట్లతో చాలా సన్నిహితంగా మాట్లాడి, వారి అనుభవాలను చాలాకాలం రికార్డుచేసి, వారి మాటల్లో ఏవైనా ఆధారాలు దొరికితే కేసుబనాయించాలి. నువ్వు చేయవలసింది, ఇప్పటికి వచ్చిన పేషెంట్ల భర్తలను కలుసుకొని కారణాలను రాబట్టాలి."

"మైగాడ్! ఈ పని కొన్ని సంవత్సరాలు పడుతుంది. అమెరికాలో అయితే ఆలుమగలకి ఏ అభ్యంతరాలు లేవు. వాళ్ళు తమ రహస్యాలను డాక్టర్లతో పంచుకోడానికి ఉత్సుకత చూపించి అన్నివిధాలా సహకరిస్తారు. మనకు అటువంటి అవకాశమే లేదు."

"నువ్వే ఇలా అధైర్యపడితే ఎలా? ఇప్పటికి నువ్వు ఇద్దరు మనుషులను ఇంటర్వ్యూచేసి కేసులు తయారుచేశావు. ఆనందరావు, వస్త్రంగి చిన్నయ్యా నీతో సహకరించారు. నారాయణసెట్టి, నరసింహారావు పంతులు, రామునాయుడు వీరందరూ పెద్దమనుషులు. వారి సంసారంలోని రహస్యాలు చెప్పరు. కుటుంబగౌరవం, సమాజంలో వారికున్న స్థాయి అడ్డుపడతాయి. ఇక కౌస్తుభం తప్పుడు స్టేట్‌మెంట్లే ఇస్తాడు. సమయం చిక్కినప్పుడల్లా మనల్ని హేళన చేస్తుంటాడు. వీళ్లందరినీ వదలిపెట్టు. పాటకజనంమధ్య, సామాన్యసంసారులమధ్య నేర్పుగా వాళ్ళ రహస్యాలు రాబట్టు. వాటినన్నిటినీ క్రోడీకరించి, ఏవిధంగా చేయాలో ఒక నిశ్చయానికి వద్దాం."

"ఈ పనిచేయడానికైనా ఆరునెలలకు తక్కువపట్టదు."

"అంతవరకు మనం చేతులు ముడుచుకొని కూర్చుంటే ఎలా?"

"ఒక్కసంగతి తలచుకుంటే నాకు విచారం కలుగుతోంది. ఈ వూరి పురుషులకుగాని, స్త్రీలకుగాని విల్‌పవరన్నదిలేదు. అదిలేనంతకాలం పరిస్థితులు మెరుగుపడవు."

"ఓ మై బిగ్‌బాయ్! చికిత్స మొదలుపెట్టే ముందు ఒక విషయం మరచిపోకూడదని మన పెద్దలు చెప్పారు. విల్‌పవరు వల్ల పురుషుడు ఉద్రిక్తుడుకాడు. విల్‌పవరువల్ల స్త్రీపురుషునితో కలియడానికి సిద్ధంగా ఉండదు. ఇదంతా స్త్రీపురుషులు ఒకరినొకరు అర్థం చేసుకొని సుఖపారవశ్యం చెందినపుడే సంభవిస్తుంది."

"ఓ!ఐసీ!"

"మనం ఇదీ సెకెండరీ ఇంపొటెన్సని చికిత్స మొదలుపెట్టాం. దీని ముఖ్యమైన ఉద్దేశమేమంటే-స్త్రీ పురుషులు తమ కలయికకు అడ్డుతగిలే విషయాలను మరచిపోయి, పూర్వపు ఆనందమయజీవితానికి మరలిపోడం. అపుడు ఈ జాడ్యం అంతరిస్తుంది."

"కథ కంచికి, మనమింటికి."

పైన పేషెంట్లలో అశాంతి కనిపిస్తున్న సూచనలు వచ్చాయి. గోపీకృష్ణ కంపౌండింగ్ రూములోకి వెళ్లిపోయాడు. దానికి వెనుకవేపున్న కిటికీదగ్గర నిలబడితే ఊరిబావి, దానివెనుక ఊరు కనిపిస్తాయి. అతనుపరధ్యానంగా అటువేపు చూస్తుంటే ఉన్నట్లుండి ఊరిలోంచి మైక్‌మీద సినిమా పాటలు రావడం మొదలయ్యాయి. ఈ కొత్త పరిణామం అతనికి అర్థంకాలేదు.

ఎవరింట ఈ పెళ్ళి? ఎవరింట ఈ శుభకార్యం? ఏమిటా శుభకార్యం? ఈ ప్రశ్నలు అతని మనసును వేధిస్తుంటే అతని దృష్టిలో నరసింహారావు పంతులు కొడుకు వెంకట్రావు పడ్డాడు. ఆ కుర్రాడు డిస్పెన్సరీవేపే నడిచి వస్తున్నాడు.

వెంకట్రావు తిన్నగా కంపౌండింగ్ రూముకే వచ్చా

డు. తొందర తొందరగా నడిచి వచ్చాడేమో అలి సిపోయాడు.

"కూర్చో వెంకట్రావ్!"

ఎదురుగానున్న కుర్చీ చూపించాడు వెంకట్రావు కి.

నలుగురు పేషెంట్లకు మందులిచ్చి, ఇద్దరికి ఇంజక్షన్లుచేసి పంపించేసరికి మరో అరగంట అయింది. తరువాత విశ్రాంతి. ఆయా నరసమ్మ, డ్రెస్సరు ఫకీరు టీ తాగడానికి ఊళ్ళోకి వెళ్ళారు.

అలమరాలోనున్న ఫ్లాస్కు తీసి, రెండు కప్పుల నిండా కాఫీపోసి, ఒకటి వెంట్రావుకిచ్చాడు గోపీ.

"మైడియర్ వెంకట్రావ్! ఇవాళ గ్రామంలో సంబరం జరుగుతోందా?"

"సంబరమనే చెప్పుకోవాలి డాక్టరుగారూ. మా కౌస్తుభం మామకూతురు రంగనాయకి పెద్దమనిష యింది. ఇవాళ ఊళ్ళోవారినందరినీ పిలిచారు. పీటలమీద కూచోబెట్టి పుణ్యాహవాచనం చేయిస్తా రు. సత్యనారాయణవ్రతం-వెంకటేశ్వరుని దీపారా ధన."

"అదా సంగతి! మాకేమీ తెలీదు. ఇది సాధార ణంగా ఆడవాళ్ల వేడుక. దానికి లౌడ్స్పీకర్లు, ఆర్భాటం దేనికి?"

"అదే ఈ వూరి ప్రత్యేకత. ఏ చిన్నవేడుకయినా పెళ్ళికన్న ఘనంగా చేస్తారు."

"దానికేదో కారణముండాలి."

"కారణం లేకపోవడమేమిటి? ఈ సాకుతో సంవత్స రానికి సరిపడే బియ్యం, పప్పులు, ఉప్పులు, కాయ గూరలు, నేతిడబ్బాలు, కట్నాలు-కానుకలు పోగవు తాయి. అవకాశం దొరికితే మా కౌస్తుభం మామ చాలా పెద్దఎత్తున ఇటువంటివి ఏర్పాటుచేస్తాడు."

"ఇంతకీ మీ రంగనాయకి ఎలా ఉంటుంది?"

"మీరు చూసేరనుకుంటున్నానే!"

"కౌస్తుభంగారింటికి నీతో ఒక్కసారే కదా వెళ్లింది తరువాత వాళ్ల గుమ్మమేతొక్కలేదు. ఎప్పుడేనా అత ను వీధిలో కనిపిస్తే నమస్కారం చేయడం తప్ప అతనితో మాట్లాడడం కూడా లేదు.సాధారణంగా పెద్ద మనిషి కావలసిన పిల్లలు పొడుగెదిగి, పరికి ణీ, వోణీ వేసుకొని కనిపిస్తారు. అటువంటి వర్ణాలు గు, పదిహేనేళ్ల అమ్మాయిని వాళ్ళింట్లో చూచినట్లు జ్ఞాపకం లేదు."

వెంకట్రావు ఫకాలున నవ్వాడు.

ఇంతలో ఎవరో మందుచీటీపట్టుకొని లోపలికి వచ్చారు. వాళ్లకు మందిచ్చి పంపించి గోపీకృష్ణ తిరిగి కూర్చున్నాడు.

"మా రంగనాయకికి ఎన్నేళ్లనుకున్నారు? తొమ్మిది వెళ్లి పదొచ్చింది"

"నిజం?"

"ముమ్మాటికీ నిజం. దానిసంగతి చిన్నప్ప ట్నుంచీ తెలుసు కదా! ఈ హాస్పిటల్ తెరవడానికి ఆరునెల్ల ముందు దాని తొమ్మిదో పుట్టిన్రోజు చాల గొప్పగా చేశాడు మా మామ"

"రంగనాయకికి పదేళ్లన్న మాట! పదేళ్లకే పెద్ద మనుషులైన ఆడపిల్లలు ఈ ఊళ్లో ఇంకా ఉన్నా రా?"

"నాకు రహస్యంగా తెలిసింది. నారాయుడు కూతురు-సోమినాయుడు మరదలు, అబ్బయ్యా మనవరాలు, మరొకరు-ఇలా నలుగురు ఈ మధ్యే పెద్దమనుషులయారు. అందరూ పదేళ్లప్రాయం వాళ్లే. పీడో, పిశాచమో పట్టుకొని వాళ్లు సమయం రాకుండానే పెద్ద మనుషులయ్యారని, నలుగురికీ తెలిస్తే బాగుండదని, ఈ విషయం గుట్టుగా ఉంచా రు.గ్రామం చిన్నది కదా! ఎంత దాచినా ఇటు వంటివి దాగవు."

"మరి మీ కౌస్తుభం మామ ఎందుకింత ఆర్భాటం చేస్తున్నాడు?"

"ఇదంతా కట్నాలతో పనికదా! ఇటువంటి అవ కాశం అతను విడిచి పెడతాడా!"

ఇది జరిగి ఒకవారం రోజులేనా కాలేదు-ఒకసా యంకాలం వెంకట్రావు గోపీకృష్ణను కలియడానికి వచ్చాడు.

"డాక్టరుగారు! నేను గొప్ప యిబ్బందిలో పడ్డా ను." అన్నాడు వెంకట్రావు

"మరేం గాభరా పడకు. డిస్పెన్సరీ కట్టేసి వస్తు న్నాను. కొంచెం కాఫీ తాగి, ఇద్దరం అలా తోట వేపు పోయి మాట్లాడుకుందాం." అన్నాడు గోపీ.

ఇద్దరూ తోటలో ఒక చెట్టు కింద కూర్చున్నారు. చలికాలం ఇంకారాలేదు. సూర్యాస్తమయం అవు తోంది.

"డాక్టరుగారు! మా మామ కూతురు నన్ను రమ్మంటోంది."

"నిన్నా?"

"అవును. మా నాన్నగారు, కౌస్తుభం మామ కలిసి చదుకున్నారు. ఇద్దరూతమ చిన్ననాటి స్నేహా న్ని పాటిస్తున్నారు. మా అమ్మ, అలమేలు అత్త చాలపొత్తుగా ఉంటారు. రంగనాయకిని చిన్నప్పటి నుంచి నా పెళ్లామని వ్యవహరించేవారు."

"అయితే మరేం?"




"అదికాదు సంగతి. చిన్నప్పటి నుంచి దానితో ఆడుకునే వాడిని-నేను భర్తగా, అది నాభార్యగా. పెద్దవాళ్ల పనులన్నీ అనుకరించే వాళ్లమి. చిన్నప్పటి మాటలు, ఆటలు పెద్దయితే ఉండవుగదా. మా మామకు మరీ డబ్బు మీదధ్యాసపోయింది. మా నాన్నగారి పరిస్థితులలో మార్పులు లేవు. నాకు పట్టణంలో చదువు చెప్పించే స్తోమత లేక,మెట్రిక్‌కి ప్రైవేటుగా కట్టించారు. మా నాన్నగారే పాఠాలు చెప్పన్నారు. మాకు అప్పులే కాని ఆస్తులు లేవు. పెద్దింటి వాళ్లు మా నాన్నగారి మీద అభిమానంతో ఏవేనా యిస్తే కద్దు. లేకపోతే కలోగంజో తాగడమే అవుతుంది."

"అవునవును."

"మా మామ ఇప్పుడు ప్లేటు మారుస్తున్నాడు. పెద్ద డాక్టరుకిచ్చి పెళ్లి చేస్తానంటున్నాడు. ఏభైవేలు కట్నం ఇవ్వడానికి సిద్ధంగా ఉన్నాడు. మే మిప్పుడు వాళ్ళకు కనిపించడం లేదు."

"అయితే నీకు వచ్చిన యిబ్బందేమిటి?"

"పెద్ద యిబ్బందే వచ్చింది. పెద్దమనిషియిన దగ్గిర నుంచీ మరీ నా మీద ప్రేమచూపిస్తున్నది. ఇవాళ పొద్దున్న వాళ్లింటికెళ్లాను. మా మామ పట్నం పోయాడు. అత్తకూడా రామన్నపేట వెళ్లింది.రంగనాయకి ఒక్కతే యింట్లో ఉంది. అదే నాకు కబురుపెట్టింది. నన్ను చూడగానే సినీమా ప్రేమ పాఠాలు వర్ణించడం మొదలు పెట్టింది. ఆమె శరీరం మీద అంకురించిన యవ్వన చిహ్నాలను అరమరిక లేకుండా ప్రదర్శించింది. నన్ను కావలించుకుంది. ముద్దులుపెట్టుకుంది."

"మరి నీ అభ్యంతరమేమిటి? పెళ్ళికాని పిల్ల అనా?"

"అదేదీ కాదు- నాకు కూడా మగతనం లేకుండా పోయింది."

గోపీకృష్ణ లేచి నిలబడ్డాడు.

"వెంకట్రావ్! నువ్వు తప్పు పనేదో చేస్తున్నానని మనసు చెబుతుంటే అలానే అవుతుంది."

"లేదు డాక్టరుగారు! నాకు తప్పనిపించ లేదు. చిన్నతనం నుండి నాభార్యగా నటిస్తూ ఇప్పుడు మరొకర్తె ఎలా అవుతుంది? పెళ్లి చేసుకున్నా చేసుకోకపోయినా నాకు చనువు హెచ్చు కదా! మీ దగ్గిరేదేనా మందుందా?"

గోపీకృష్ణ నవ్వాడు.

"ఈ బలహీనత వచ్చినట్లే పోతుంది. పాలు, పెరుగు, వెన్న బలమయిన ఆహారం తినడం అవసరం. అంతకుమించి మందులేదు."

వెంకట్రావు ముఖం వేలాడేసుకొని వెళ్లిపోయాడు. డాక్టరు కేంపోయింది. మామూలు సంసారులకు బలమైన ఆహారం ఎక్కడ దొరుకుతుంది?

వెంకట్రావు వెళ్లిపోయిన మరో అరగంటకు, బాగా చీకటి పడిన తరువాత వెంకునాయుడు వచ్చాడు.

"డాక్టరు బాబూ! మీరు పుణ్యం కట్టుకోవాలి."

"చెప్పండి నాయుడుగారు!"

"నాకూ మంగమ్మతో సంబంధముంది. దానికీ మంచి ఆస్తివుంది. నాకు ఏభైరెండో యేడు వచ్చింతర్వాత దానితో సంబంధం కలిసింది. నాకు డెబ్బయ్యో ఏడు వచ్చినా ఆడదానిమీద ఆపేక్ష తగ్గలేదు. ఇంతవరకూ ఏ చికాకులేదు.కాని, ఆరునెల్లయి ఎందుకూ పనికి రాకుండా పోయాను. మనఊరి వైద్యుడు కదా అని కౌస్తుభంగారితో మొరపెట్టుకున్నాను. అతడు నిలువు దోపిడి చేశాడే కాని ఏం లాభం లేకుండా పోయింది. మీరు చిన్న వాళ్లయినా మంచి చేతి చలవ ఉందని విన్నాను.

"నాయుడుగారు! దీనికి మందులు తొందరగా పనిచేస్తాయో లేదో తెలీదు. చికిత్స కొంతకాలం పడుతుంది. పదిహేను వారాల కార్యక్రమమిది."

"అంత ఆలస్యమే?"

"కొందరికి తొందరలో కూడా బాగవ్వొచ్చు."

నాయుడు మరేమీ చెప్పకుండా వెళ్లిపోయాడు.

గోపీకృష్ణ బట్టలు మార్చుకొని డాక్టరు నిర్మల యింటి తలుపు తట్టాడు.

"కమిన్"

నిర్మల పుస్తకమేదో చదువుతున్నది, మంచంమీద పడుకొని.

"గోపీ! ఆ కుర్చీ యీడ్చుకొని కూర్చో!"

గోపీకృష్ణ కూర్చున్న అయిదు నిమిషాల తరువాత సంభాషణ ప్రారంభించాడు.

"నిర్మలా! ఈ ఊరికి పట్టుకున్న రోగం ఇపుడు ఎపిడమిక్‌గా మారింది. పదహారేళ్ల కుర్రాడి నుంచి డెబ్బైయ్యేళ్ళ ముసిలాడి వరకు సెక్సుకావాలని పరితపిస్తున్నారు. మనం స్పెషల్ మెడికల్ టీము కోసం రాద్దామా? పరిస్థితి చేయిదాటి పోకుండా పైవాళ్ళకు తెలియజేయడం మంచిదేమో!

నిర్మల పుస్తకం పక్కకుపెట్టి లేచికూర్చుంది.

"గోపీ! ఆండ్రజెన్ దారిద్ర్యం వల్ల పురుషులలో కామ సంబంధమైన చురుకుదనంలోపిస్తుంది. ఈస్ట్రోజెన్ దారిద్ర్యం వల్ల స్త్రీలలో సంతానోత్పత్తి దెబ్బతింటుంది. మానసికంగా పురుషులను సాధారణ

స్థితికి తెస్తే ఈ జబ్బు తగ్గిపోతుంది. ఇంతకుమించి మరేకారణం నాకు కనిపించలేదు.''

"మరో విషయం నీ దృష్టికి తీసుకు రాలేదు. కౌస్తుభం కూతురు ఈ మధ్యపెద్దమనిషయింది. ఆ విధంగానే మరి నలుగురు కూడా. వీళ్ళందరూ పది సంవత్సరాల వాళ్లే. ఈ ప్రాంతాలలో ఆడపిల్లలు పధ్నాలుగేళ్లకు పెద్దపిల్లలవుతారు. ఇదికూడా మనం ఆలోచించాలి.''

''రెండు మూడు సంవత్సరాల గురించి అంతగా పట్టించుకోనక్కర లేదు. సినిమాలు, సెక్సుపుస్తకాలు, స్వేచ్ఛ యివన్నీ ఆడపిల్లలు పెద్దమనుషులవడానికి సహకరిస్తాయి.''

''దీనిలో హార్మోను ప్రభావం లేదా? ఇది సెక్సువల్ ప్రికాసిటీ కాదా?''

వీటి గురించి అంతగా పట్టించుకోనక్కర్లేదు.''

"మరేవేనా మార్గాలు తెరచి ఉన్నాయా?''

"అదే! వాటి గురించే చదువుతున్నాను.''

"తొందరగా చికిత్స మొదలు పెట్టడం మంచిది.''

డాక్టరు నిర్మల గోపీకృష్ణ మాటలు విన్నట్లు లేదు. తిరిగి పుస్తకం తీసుకొని చదవడంలో నిమగ్నమయింది.





## 4

ఉదయం ఏడున్నరకే డాక్టరు గోపీకృష్ణ, అన్ని పనులు ముగించుకొని కన్సల్టింగ్ రూములో కూర్చున్నాడు. గత సాయం కాలం డాక్టరు నిర్మల పాలకొండ వెళ్ళింది. అక్కడ స్నేహితురాలి చెల్లెలికి పెళ్ళి జరుగుతోంది. పెళ్ళి అయిన తరువాత మరో రోజు నుండి తాలూకా హాస్పిటలు నుండి మందులు తెస్తానంది. ఆమె వచ్చే వరకు గోపీకృష్ణను డిస్పెన్సరీని జాగ్రత్తగా నడప మంది. అందుకోసమే అన్ని పనులు తొందరగా ముగించుకొని, తానే డిస్పెన్సరీ తెరచి, నిర్మల కుర్చీలో కూర్చున్నాడు.

పే షెంట్లెవరూ రాలేదింకా!

గోపీకృష్ణ ఆలోచిస్తున్నాడు.

ఈ సెక్సు హార్మోనులు చాల గమ్మత్తయినవి. వాటిలో పురుష హార్మోనులు, స్త్రీ హార్మోనులు ఉన్నాయి. ఈస్ట్రోజెన్ స్త్రీ హార్మోను. ఇది బాలికలలో వయసు రావడానికి ముఖ్యమయినది. వక్షస్థలం పెరగడానికీ, స్త్రీత్వం యొక్క ముఖ్యమైన ప్రయోజనమైన మాతృత్వ సిద్ధికీ ఇవి శరీరాన్ని తీర్చిదిద్దుతాయి. ప్రొజెస్టిరోన్ కూడా స్త్రీ హార్మోనే- స్త్రీ హార్మోనులు ఆడవారిలో కామవాంఛకు కారణమని కొందరి అభిప్రాయం. ఆడవారిలో కూడా పురుష హార్మోనులుంటాయి. మగవారిలో స్త్రీ హార్మోనులుంటాయి. కాని పురుషహార్మోనులు లిబిడోకి కారణం-లిబిడో-ఫ్రాయిడ్ నిర్వచనం ప్రకారం జీవితం యొక్క సహజ ప్రవృత్తులు-ఆకలి, దప్పిక, కామం-ఈ మూడు లిబిడో క్రింద వస్తాయి. ఈ మూడు ప్రవృత్తులను సంతృప్తి పరచడంలో మానవ వ్యక్తిత్వ నిరూపణకు దోహదం జరుగుతుంది. ఈనాడు లిబిడో అంటే స్త్రీ పురుషులలో కలిగే కామోద్రేకం. పురుష హార్మోనులు స్త్రీలలో హెచ్చుగా ఉంటే వారిలో కామ వాంఛ పెరుగుతుంది. టెస్టోస్టిరోన్ ఇటువంటి పురుషహార్మోను. ఇది పురుషులలో వీర్యనాశనం చేయగలది. విషాన్ని మందుగా వాడినట్లు ఈ టెస్టో స్టిరోన్‌ను పురుషులలో సంపూర్ణంగా వీర్య కణాలను నాశనంచేయ డానికి వాడతారు. ఒకసారి ఆ విధంగా చేసి చికిత్స ఆపితే తిరిగి వీర్యకణాలు జన్మించి మగతనం పునరుద్ధరింపబడుతుంది. గోనెలపాడులో ఈ హార్మోనుల నాటకం చాలవిశదంగా ఉంది. సమస్యకు పరిష్కారం కూడా ఈ హార్మోనులే చూపుతాయేమో!

పేషెంట్లు రావడం మొదలుపెట్టారు. ఉండీ ఉడిగీ ఒకరూ ఒకరూ వస్తున్నారు. ఇంత మంది పేషెంట్లూ పూర్వం కౌస్తుభంగారి వైద్యశాలకు వెళ్ళేవారు కాబోలు. ఇప్పుడు అతనికి ప్రాక్టీసు తగ్గిపోయింది. ఉచితంగా ప్రభుత్వ వైద్యులు మందులివ్వడం మొదలు పెడితే నేటివ్ వైద్యుల నోట మన్నే. అందుకోసమే కౌస్తుభం అన్ని జాగ్రత్తలుపడి డబ్బు సంపాదిస్తున్నాడు.

డాక్టరు గోపీకృష్ణ చీట్లు రాసి, స్వయంగా మందులు కలిపి అన్ని పనులు తనే చేస్తున్నాడు. రెండు రోజులు యిబ్బందిపడాలి. అసలు పనే అట్టేలేదు. ఇబ్బందికేముంది.

పన్నెండు దాటిపోయింది. నరసమ్మ, ఫకీరు వెళ్ళిపోయారు.

డాక్టరు గోపీకృష్ణ ఒక్కడూ కుర్చీలో కూర్చుని, మళ్ళీ హార్మోనుల గురించి ఆలోచించసాగాడు.

వయసు వచ్చే కుర్రాళ్లలో ఈ హార్మోనులు అద్భుతాలు చూపిస్తాయి. ఆండ్రోజెన్ హార్మోనులు కుర్రాళ్ల శరీర నిర్మాణంలో మార్పులు తెస్తాయి. వాళ్ల కండరాలుపెరుగుతాయి. శరీరం మీద, ముఖంమీద వెంట్రుకలు వస్తాయి. గొంతుకూడా మారుతుంది. వయసురాకుండా కుర్రాడికి అండాలు తీసివేస్తే, అతనిలో పెరుగుదల ఆగిపోతుంది. మగ లక్షణాలు లోపిస్తాయి. ఆడపిల్లవలె సుకుమారమైన శరీరం, పెద్ద కీచు గొంతుక, గడ్డం పెరగని ముఖం కనిపిస్తాయి. పెద్దమనిషి కాక పూర్వం బాలికలలో ఓవరీస్ తొలగిస్తే ఆ పిల్ల ఎదగదు. చిన్న పిల్ల శరీరం వలె ఉంటుంది. వక్షస్థలం పెరగదు. ఎప్పుడూ రజస్వల అవదు. సరియైన హార్మోను చికిత్సచేస్తే అండాలు తీసివేసిన పురుషుడు మామూలుగా సంసారం చేయగలడు. పిల్లలు మాత్రం పుట్టరు.

ఆండ్రోజెన్ దారిద్ర్యం పురుషులలో కామప్రేరణను తగ్గిస్తుంది. స్త్రీలలో ఈస్ట్రోజెన్ దారిద్ర్యం కలిగితే ఆమె వంధ్య అవుతుంది. హార్మోను దారిద్ర్యం వల్ల స్త్రీపురుషులలో శక్తి తగ్గిపోతుంది.

ఆండ్రోజెన్ కామప్రేరణకు మూలమంటారు. జంతువులలో ఆడదానికి ఆండ్రోజెన్ చికిత్సచేస్తే, ఆ జంతువు ఉద్రిక్తతను పొంది మగజంతువు చేష్టలన్నీ చేస్తుంది. ఈస్ట్రోజెన్ ఇస్తే జంతువులో

స్త్రీస్వభావం హెచ్చి, కోరికను కూడా అధికం చేస్తుంది. ఈస్ట్రోజెన్ ఇస్తే మగజంతువులలో కామప్రేరణ తగ్గిపోతుంది.

మానవులలో ఈ హార్మోనుల ప్రభావం చాలసంకీర్ణంగా ఉంటుంది. చిక్కబడుతుంది. మానవులు యౌవన దశదాటిన తరువాత ఈ హార్మోనుల మీద అంతగా ఆధారపడరు.

పురుమడు నుండి ఆండ్రోజెన్ తొలగిస్తే అతని సెక్సు సామర్థ్యం తగ్గిపోతుంది. ఇది క్రమంగా జరుగుతుంది. పోల్చుకోవడం కష్టం.-ఆండ్రోజెన్ పురుమనికిస్తే అతనిలో చెప్పుకోదగ్గ మార్పురాదు. ఎందుచేతనంటే ఆండ్రోజెన్ అతనిలో ఉత్పత్తి అవుతూనే ఉంటుంది. అతడికి ఈస్ట్రోజెన్ ఇస్తే అతడికి కామప్రేరణ తగ్గుతుంది. అదే ఈస్ట్రోజెన్ స్త్రీకిస్తే ఆమెలో కామప్రేరణ హెచ్చుతుంది. ముఖం మీద వెంట్రుకలు కూడా మొలుస్తాయి.

ఈ హార్మోనులు ఎన్నో అద్భుతాలను సాధిస్తున్నాయి.

డాక్టరు గోపీకృష్ణ ఆలోచనలు ఒక్కసారి ఆగిపోయాయి.

కన్సల్టింగ్ రూము తెరతొలగించి గదిలోకి ఒక స్త్రీ వచ్చింది.

"డాక్టరు గారు! నమస్కారం!"

గోపీకృష్ణ ఆమెవేపు తలెత్తి చూశాడు.

ఆమెను చూచినట్లు అంతగా జ్ఞాపకం లేదు.

"నేను అలమేలును. ఆయుర్వేదవైద్యులు నా భర్త గారే. మీరోసారి మాయింటికొచ్చారు కూడా వచ్చారు"

గోపీకృష్ణ జ్ఞాపకం తెచ్చుకోడానికి ప్రయత్నించాడు. ఆ రోజు కౌస్తుభంగారి యింటికి వెళ్ళినపుడు అతడు సరిగా ఆమెను చూడలేదు. ఆమె అన్న మాటలు మాత్రం జ్ఞాపకమున్నాయి- "కుర్రాడు చాలబాగున్నాడు."

"డాక్టరు నిర్మల గారు ఇవాళ ఊళ్లోలేరు."

"అవును. నాకాసంగతి తెలుసు."

"ఆమె వచ్చిన తరువాత మీరొస్తే బాగుంటుందేమో!"

"మగ డాక్టర్లు ఆడవాళ్లను చూడకూడదా?"

"అటు వంటి నియమమేదీ లేదనుకోండి. లేడీ డాక్టరయితే బిడియంలేకుండా అన్నీ మాట్లాడవచ్చు."

"అయితే మీదగ్గర సిగ్గుపడుతూ, సగం మాట్లాడాలా?"

గోపీకృష్ణ చిక్కులో పడ్డాడు.

"ఆడ డాక్టరయినా, మగ డాక్టరయినా బిడియంలేకుండా మాట్లాడడం చాలముఖ్యం."

"మరి మీ ఆక్షేపణ దేనికి?"

"ఆక్షేపణ లేవీలేవు" అన్నాడు కొంచెంసేపు ఆలోచించి గోపీకృష్ణ.

"అయితే వినండి. లేడీ డాక్టరుగారు మావూళ్లో చాలమంది స్త్రీలతో వారిసాంసారిక జీవితం గురించి చర్చించారు. పురుమల బతుకులను సరిచేయడానికి స్త్రీలు ప్రయత్నాలు చేయాలని ఆమె చెప్పారు. స్త్రీలలో సౌందర్యముంటుంది. ఒక విధమైన విలాసముటుంది. భార్యా భర్తలను దగ్గిరిగా తెచ్చేది ఈ సౌందర్యమే. దీనికి మించి, ఒకరిమీద ఒకరికి ప్రేముంటుంది. ఈ ప్రేమ కామానికి సంబంధించినది. కామంలో పరితృప్తి చెందిన స్త్రీ పురుమల జీవితాలలో శాంతి ఉంటుంది. వింటున్నారా?"

"వింటున్నాను"

"ఈ సంతృప్తి మాగ్రామంలోని స్త్రీలకు కరువైపోయింది. పురుమలలో ఒక విధమైన భయం నెలకొంది. అది మానసికమైనది. తమ స్త్రీలకు తాము ఏవిధమైన సుఖం ఇవ్వలేకపోతున్నామని వాళ్లకు తెలుసు. ఈ పరిస్థితులను తిరిగి మామూలుగా ఉండేటట్లు చేయడమే చికిత్స సారాంశం"

"ఒక్క సంగతి అడుగుతున్నాను- కోపం తెచ్చుకోకండి- ఈ వివరాలన్నీ డాక్టరు నిర్మలగారే మీతో చర్చించారా?"

అలమేలు నవ్వింది.

"ఏ డాక్టరు దగ్గిరికైనా నాకిదే మొదటిసారి రావడం."

"మరి ఇన్ని వివరాలు ఎలాతెలిశాయి?"

"మీరు అన్నీ రహస్యంగా ఉంచమని ఎంత నొక్కి చెప్తుంటే అంత తొందరగా అవి ఆడవాళ్ల మధ్య వ్యాపిస్తున్నాయి."

"మీరు మరికొంచెం విపులంగా చెప్పాలి. ఈ సలహాలు ఏ పేషెంటుకి చెప్పినవి? ఆమెకు చెప్పినవి మీకు నప్పుతాయని ఎలా అనుకున్నారు?

"డాక్టరుగారూ! మీరు బలేవారండీ! ఈ ఊరి ఆడవాళ్లందరికీ ఒకే రకమైన జాడ్యమయితే, దాని చికిత్స వేరుగా ఉంటుందా?"

"ఇంతకీ ఈ జాడ్యం పురుమలకు సంబంధించింది-మరి చికిత్స.."

గోపీకృష్ణ మాటలు పూర్తికాకుండా అలమేలు ఆపింది.

"డాక్టరుగారు! ఈ మెలికలన్నీ దేనికి? అసలు

నంగతి మీకుతెలును, మాకుతెలును. కాని మీ వైద్యం సంగతి మాత్రం అంతుపట్టడంలేదు."

"అంటే మేము చేస్తున్న చికిత్స సరియైనది కాదనా?"

"మీరు చేసే చికిత్స ఎటువంటిదో మాకుతెలీదు. మీరు మాలో ఒకరికి, ఇంకా నిర్దిష్టంగా చెప్పాలంటే రామునాయుడు కోడలు వరహాలుకి, ఇచ్చిన సలహాలు చాల గమ్మత్తుగా ఉన్నాయి."

"అవి డాక్టరు నిర్మల గారు స్వయంగా, ఒక పద్ధతి మీద ఇస్తున్నవి."

"మీకు కూడా తెలీదా?"

గోపీకృష్ణ ఆలోచిస్తున్నాడు.

"అవేవో అభ్యాసాలట..." అలమేలు మళ్లా అంది.

వారం రోజులకిందట రాత్రిపూట తాను సెక్సువల్ ప్రి కాసిటీ గురించి చెప్తున్నప్పుడు నిర్మల ఏదో పుస్తకం చదవడంలో ఉండిపోయింది. ఈ సలహాలు ఆ తరువాత యిచ్చినట్లుంది.

"ఎప్పుడావిడ చెప్పారు?"

"మూడురోజులయింది."

గోపీకృష్ణ కొంచెంసేపు ఆమెముఖంలోకి చూచి మెల్లగా అన్నాడు.

"మీరు విన్నవాటి గురించి చెప్పండి."

"అవి కాముకత్వం కలిగించేవట..సెన్సు..ఏదోపదం....ఎక్సర్సయిజెస్ అంట."

"అవును. అవి సెన్సేట్ ఎక్సర్సయిజెస్- భార్యా భర్త లిద్దరూ ఆచరించవలసినవి."

"అవే సరి. అవి చేయడానికి అమెరికాలో వీలవుతుందేమో! కాని, మన యిండియాలోను, ముఖ్యంగా పల్లెటూరిలోను వీలవుతుందా?"

"భార్యా భర్తలు తమలో నిద్రాణమై ఉన్న వాంఛలను, సుఖానుభూతులను, ఆనందమయమైన సన్నివేశాలను జ్ఞాపకం తెచ్చుకోవడమే కదా! అందులో తప్పేముంది?

"తప్పా, మంచా! డాక్టరమ్మగారు వరహాలుతో ఏం చెప్పారో తెలుసా? ఇంట్లో మొగుడు పెళ్లాం బట్టలు విడిచి దినమొలతో తిరగాలన్నారు. మన యిళ్లల్లో మరుగెక్కడిది? కంబారులు, రైతులు, ఊరివాళ్లు అందరూ యింట్లో తిరుగుతుంటే రామునాయుడు కొడుకు, అతనిపెళ్లాం వాళ్ల ఎదుట బట్టలు విప్పుకొని తిరగ్గలరా?"

"మీరు సలహాను సరిగా అర్థంచేసుకోలేదు. స్త్రీ శరీరం ఒక కళాఖండం. ముఖ్యంగా మగాడి మనసును ఆకర్షించే సౌందర్యం ఆమెలో ఉంది. ఆనవాయితీగా భార్యా భర్తలు, దీపాలార్పి సంసారాలు చేస్తున్నారు. ఒకరి శరీరాన్ని ఒకరు చూచి, ఆ సౌష్ఠవాన్ని మెచ్చుకొని పంచేంద్రియాలలో ప్రధానమైన చక్షువులకు ప్రీతి కలిగించాలి. ఒకరి కొకరు దగ్గిరిగా వచ్చి, నున్నటి శరీరాలు తగిలేటప్పుడు విద్యుత్ ప్రవాహం ఒకరి నుండి ఒకరికి పాకి సుఖానుభూతి కలగాలి. అప్పుడే స్నానాలు చేసి వచ్చిన శరీరాల వాసనల మత్తులో వాళ్లు పరవశించాలి. లలితంగా ఒకరి చెవిలో ఒకరు పులకించే శృంగార కథలు చెప్పుకోవాలి."

"డాక్టరుగారు! పుస్తకాల్లో మీరు చదువుకున్నారు. కాని, మీకు అనుభవం తక్కువ. మీరు లేడీ డాక్టరుగారు ఈ విధంగానే సంచరిస్తారా?"

ఒక్కసారి చెంపమీద కొట్టినట్లయింది గోపీకృష్ణకు.

"మేమిద్దరం డాక్టర్లం. భార్యాభర్తలం కాము. డాక్టరు నిర్మలకు గాని నాకుగాని ఈ రుగ్మత అంటలేదు. ఈ వూరి ప్రజలలో వ్యాప్తిపొందిన ఈ జాడ్యాన్ని రూపుమాపడం కోసం చేస్తున్న ప్రయత్నాలివి. మే మిద్దరం మా హద్దులలో ఉండాలి".

"మీకు స్త్రీ సౌఖ్యం గురించి, ఆమెకు పురుష సౌఖ్యం గురించి అనుభవాలు లేవు. మరి మీరేం వైద్యం చేయగలరు?"

మాస్టర్సు-జాన్సన్‌లు చెప్పినది రమారమి యిదే. అనుభవజ్ఞులైన స్త్రీ, పురుష థెరాపిస్టులు విషయాన్ని భార్యా భర్తలతో కలిసి చర్చించినప్పుడు వారి మానసికోద్రేకాలు, సంసారంలో వారు పొందిన యింద్రియ సుఖాలు ఒకటీ ఒకటీ పొంగి పొర్లుతవి. భర్తకు మగ-థెరాపిస్టు, భార్యకు స్త్రీ-థెరాపిస్టు పనిచేసి, తమ అనుభవాలనుబట్టి వారి యిబ్బందులను అర్థంచేసుకొని, భార్య ఆలోచనలనుకాని, భర్త ఉద్వేగాలను కాని, వారి ప్రవర్తనను కాని అన్వయించి, దౌర్బల్యానికి కారణాలు కనుక్కోగలరు. వారిలో కలకాముకత, వారి వ్యక్తిత్వాన్ని రూపొందించే స్వభావస్వరూపమై, వారుచేసే ప్రతిపనిలోను కనిపిస్తుంది. ఈ ప్రయత్నాలలో భార్యా భర్తల మధ్య అవగాహన పెంచడం చాలముఖ్యం. వారికి కల అపనమ్మకాలు, భయాలు, వారు నమ్మిన పుక్కిటిపురాణాలు- వాటి నుండి వారిని విముక్తులను చేయాలి.

గోపీకృష్ణ ఆలోచిస్తున్నాడు.

ఎదురుగా కూర్చున్న అలమేలు లేచినిలబడింది. ఒకటి ఒకటిగా ఒంటిమీద నున్న బట్టలన్నీ విడిచిపెట్టింది. పైనా, క్రిందా పల్చని బ్రా, అండర్‌వేర్ తప్ప మరేం లేవిప్పుడు.




# విడుదలయ్యాయి

ఆరెకపూడి (కోడూరి) కౌసల్యాదేవి
డైరెక్ట్ నవలలు

**మోహనమురళి** ____ రూ 20/-

**మార్గదర్శి** ____ రూ 20/-

ఆర్. సంధ్యాదేవి డైరెక్ట్ నవలలు

**చంద్రహాసం** ____ రూ 20/-

**అమృతశిల్పం** ____ రూ 20/-

యమ్.బి. సౌజన్య

**ఆడదిలో అనూరాధ** ____ రూ 20/-

(ఆంధ్ర జ్యోతి వీక్లీ సీరియల్)

జి.వి. సుబ్బయ్య

**బ్లడ్ ఆఫ్ డ్రాక్యులా** ____ రూ 20/-

## శ్రీ శ్రీనివాసా పబ్లిషింగ్ హౌస్

ఎ.టి. అగ్రహారం, గుంటూరు-522004

Bachi

గోపీకృష్ణ మాటలు లేకుండా ఉండిపోయాడు.

వైద్యుడుగా అతను వివిధ వయసులలోని స్త్రీ శరీరాలకు కొత్తవాడుకాదు. శరీరం గురించి పరిపూర్ణ మైన జ్ఞానమున్ననాడే వైద్యశాస్త్రం రాణిస్తుంది. ఈ పరిస్థితులలో మామూలు మనిషిలో తప్పకుండా ఉద్రేకం కలుగుతుంది. అతను కూడా మామూలు మనిషే. ఆమెకు ముప్పయి సంవత్సరాలకు మించిన వయసులేదు. అందమయిన రూపం. చక్కగా పెరిగిన శరీరం. ఆమె నడకలో ఒక విలాసం. ఆమె చూపులలో కొంటె తనం-ఆమె పెదవుల మీద చిరునవ్వు-వీటి నన్నిటిని ఆమె అతనిమీద ప్రయోగిస్తోంది.

వైద్య వృత్తికి కొన్ని మర్యాదలున్నవి. అందులో ఒకటి వైద్యుడికి రోగికి గల సంబంధం. స్త్రీ నగ్న శరీరాన్ని చికిత్సకోసం చూడడం-తరువాత ఆమెతో పరిచయం పెంచుకోవడం, ఆమె రహస్యాలను తెలుసుకొని-ముఖ్యంగా సైకో అనాలిసెస్‌లో-ఆమెకు దగ్గరయి సంబంధం పెట్టుకోవడం-ఇవి గర్హించ దగినవి. ఈ దౌర్బల్యానికి లోబడ కూడదని మొదటి నుండీ డాక్టరు గోపీకృష్ణ ప్రయత్నించాడు. ఈనాడు ఈ నియమాన్ని పటా పంచలు చేస్తున్న అలమేలు అతని నిజాయితీకి సమస్యగా నిలి చింది.

ఒక పదినిమిషాలు ఆమె గదిలో అతని ఎదుట తనప్రతి శరీర భాగాన్ని ప్రదర్శిస్తూ పచార్లుచే సింది.

"అలమేలు గారు! ఇక బట్టలు వేసుకోండి!"

అలమేలు బట్టలు వేసుకొని తిరిగి కూర్చుంది కుర్చీమీద.

"ఇవన్నీ మీరు కౌస్తుభంగారి యెదుట ప్రద ర్శించవలసినవి. నేను వైద్యుడిని. మీరు శరీరాన్ని చూపించడంలో తప్పులేదు. నాలో కామం కలి గించాలని మీరు ప్రయత్నించారు. వైద్యుడుగా నేను చలించడంలేదు. మీలో ఎగ్జిబిషనిజమ్ అన్న మానసిక దౌర్బల్యం ఉంది. మీ బాధలకు నేను జాలిపడుతున్నాను. మీ శరీరాన్ని చూచి ఉద్రేకం పొందలేకపోతున్నాను. మీకు మిగిలిన పద్ధతులలో ఏ విధంగా అభ్యాసాలు సాగించాలో తెలిసే ఉంటుంది. ఆ విధంగా మీ భర్తను ఉత్తేజపరచి, అతనిలో పాదుకున్న భయాలను పోగొట్టి, అతనికి సంసారసుఖం కలిగించండి."

ఆమె లేచి నిలబడింది. గోపీకృష్ణకు దగ్గరగా వచ్చి అతని భుజంమీద చేయివేసి, అయిదు నిమిషాలు అతని ముఖంలోకి చూచి అంది.

"డాక్టరుగారు! నేనెన్ని వేషాలువేసినా నా భర్తలో మార్పురాలేదు. అతడు ఊరివాళ్లందరి మగతనం బాగుపరచడానికి వైద్యం చేస్తున్నాడుకాని, తనను తాను బాగు చేసుకోలేదు. ఏ పాటి మగతనమున్న పురుషుడయినా, వయసులో నున్న స్త్రీ శరీరాన్ని చూచి చలించకుండా ఉండలేడు. మీరు కూడా నా భర్తకు మల్లే మగతనం లేనివాళ్లని అనుకోలేదు."

ఆమె చరచర నడిచి తలుపులు వేసుకొని వెళ్ళిపోయింది.

ఆమె వెనుకనే వరండా వరకు వెళ్ళిన గోపీకృ ష్ణకు దూరంగా ఊరి వేపు నడుస్తున్న కౌస్తుభం కనిపించాడు.

ఆ కౌస్తుభం, తన భార్య చేసినవన్నీ మొదటి నుంచి చివరి వరకు చూశాడా?

★ ★ ★

పదకొండు గంటలయింది.

డిస్పెన్సరీలో పనేమీలేదు. గోపీకృష్ణ ఒకసారి వెంకట్రావుతో మాట్లాడి రావాలని గ్రామంవేపు బయలు దేరాడు.

నరసింహారావు పంతులుగారు, వెంకట్రావు భోజ నాలు చేస్తున్నారు. అప్పుడే కూర్చున్నారు. ఒక్క పావుగంట వీధి గదిలో కూర్చోమని పంతులుగారి భార్య చెప్పింది. కూర్చున్న తరువాత చిక్కటి తీయటి మజ్జిగ గోపీకృష్ణకిచ్చి తిరిగి ఇంటిలోకి వెళ్ళి పోయింది.

ఏమీతోచక గోపీకృష్ణ టేబుల్‌మీదనున్న ఫైలొకటి చూశాడు. దానిమీద 'టాప్ సీక్రెట్' అని ఎర్రసిరాతో పంతులుగారే రాసినట్లున్నారు. చూడరాని విషయ మేమిటాని అతడు కొంచెంసేపు ఆలోచించాడు. చూడకూడదని అంతరాత్మ ఘోషిస్తున్నా లక్ష్యపెట్ట కుండా అందులో ఏముందో తెలుసుకోవాలన్న కోరిక బలమయి, ఫైలు తెరచి చూశాడు. పైన ఒక ఉత్తరం పంతులుగారి దస్తూరీతోఉంది. అది కార్బ నుకాపీ. దానిమీద "గౌరవనీయులైన ఆరోగ్యశాఖ మంత్రిగారు-ముఖ్యమంత్రిగారు-మాత్రమే చూడవ లసినది." అని వ్రాసిఉంది. ఆ ఉత్తరం తెలుగులో నేఉంది. దానిని చదువుతుంటే గోపీకృష్ణకు చెమట లు పట్టాయి. తొందరగా ఫైలు అడుగు నుంచి చదవడం మొదలు పెట్టాడు.

అందులో మొదటి ఉత్తరం:

గౌరవనీయులైన ముఖ్యమంత్రిగారికి,

గోనెలపాడు గ్రామం కాపురస్థుడు శ్రీ నరసింహా రావు పంతులు వ్రాసుకొన్న అర్జీ విన్నపములు.

అయ్యా! మా గ్రామం ఉత్తరాంధ్ర పేపరు మిల్లుకి నాలుగు కిలోమీటర్ల దూరంలోఉంది.

అర్యా! ఇంతకాలం ఈ గ్రామం కాపురస్థులమ యిన మేము సుఖ సంతోషాలతో మా జీవితాలు

గడుపుతూ ఉండేవాళ్ళం. చీకుచింతా లేకుండా ఉండేవాళ్ళము. కాని, ఈ మధ్యనే, అంటే ఒక సంవత్సరం క్రిందట ఒక కొత్త రకమయిన ఇబ్బందిని ఎదుర్కోవలసి వచ్చింది. దానిని ఇబ్బంది అనాలో, అనారోగ్యమనాలో, రోగమనాలో మాకుతెలియదు. దీనివలన మా గ్రామంలోకల పురుషులలో మగతనం తగ్గుతూ వచ్చింది. పరిస్థితులు ఈవిధంగా ఒక ఆరు నెలలు సాగడంతో చాలామంది పురుషులు పుంసత్వం లేకుండా పోయారు. దానితో సంసారంలో కలతలు ప్రారంభమయాయి. పెద్దింటి ఆడవాళ్ళు చాటుగా ఏడుస్తున్నా తక్కువ కులాల్లోని స్త్రీలుమాత్రం హంగామా చేస్తున్నారు. మనువులు వొదులుకుంటున్నారు. కలహంలేని ఇల్లులేదు.

మనం తెలుగు వాళ్ళం. పరువు ప్రతిష్ఠ కలవారం. తెలుగు వాళ్ళలో కొంతమంది నిర్వీర్యులయారని అందరికీ తెలియడం సిగ్గుచేటు. జాతికే తీరని కళంకం. అందుచేత ఆలోచించి, ఒకవారం రోజులు శ్రమించి, గ్రామం ప్రజల తరపున మీకీ రహస్యమయిన ఉత్తరం వ్రాస్తున్నాము.

మీరు పరిస్థితిని అర్థంచేసుకొని వెంటనే చర్య తీసుకోగలరని మేమందరం విశ్వసించుతున్నాము. లేని పక్షంలో మన పరువు బజారున పడగలదని మాభయం.

భవదీయుడు
నరసింహారావు పంతులు

పై ఉత్తరానికి జవాబు వారంరోజులలోవచ్చింది.

ఈ ఉత్తరం ఆరోగ్యశాఖ మంత్రిగారి సెక్రటరీ నుండి వచ్చింది. తెలుగులోనే జవాబుఉంది.

శ్రీ నరసింహారావుగారికి,

మీరు ముఖ్యమంత్రిగారికి రాసిన ఉత్తరం చూడటమయినది. దానిమీద వెంటనే చర్య తీసుకొంటున్నామని గౌరనీయులైన ఆరోగ్యశాఖ మంత్రిగారు తెలియ జేయమన్నారు. జనాభా రికార్డుల ప్రకారం (నాలుగు సంవత్సరాల క్రిందతీసినవి) మీగ్రామంలో 816 మంది మనుషులున్నారు. వారిలో 420 మంది స్త్రీలు. 396 మంది పురుషులు. మీ ఉత్తరం ప్రకారం అందరు పురుషులు నిర్వీర్యులైనట్లు తెలుస్తున్నది. మీరు ఒక ముఖ్య విషయం మరచిపోయారు. బాలురను, వృద్ధులను మీరు వేరు చేయలేదు. సాధారణంగా పదహారేళ్ళ ప్రాయంనుండి, డెబ్బైఏళ్ళ వరకుగల వయస్సుల్లోని పురుషులు స్త్రీసుఖానికి అర్హులు. ఆవిధంగా సంయోగ యోగ్యులైన పురుషుల సంఖ్య 290 ఈ విషయం గుర్తుంచు కోవలసింది.

మీరు మరొక విషయం గణించలేదు. క్రిందటి సంవత్సరం మీ గ్రామంలో శిశు జననాల సంఖ్య 16 ఈ శిశువుల సంఖ్యనుబట్టి, మీ గ్రామం పురుషులకు పట్టిన దుర్గతి పుంసత్వలోపం కాదని తెలుస్తుంది. దీనిని ఇన్ఫెర్టిలిటీ అండ్ స్టెరిలిటీ క్రింద పరిగణించాలి.

ముఖ్యమంత్రి గారికి తప్పుడు వ్రాతలురాసి, తెలుగువారు నిర్వీర్యులని చెప్పడం బాగోలేదు.

ఇట్లు
సెక్రటరీ-ఆరోగ్య విభాగం

ఈ ఉత్తరం అందిన రోజునే రాసిన జవాబు:

గౌరవనీయులైన, ఆరోగ్యశాఖ సెక్రటరీ గారికి,

మాకు పట్టిన తెగులు స్టెరిలిటీనో, ఇన్ఫెర్టిలిటీనో మాకెలా తెలుస్తుంది. మా ఊరికి ఇరవై కిలోమీటర్ల లోపల ఒక హాస్పిటలుగాని, డిస్పెన్సరీకాని లేదు. ఎవరో డాక్టర్లను పంపించి, మాకు చికిత్స చేయించడమో, లేక ముద్రవేసి మగతనం లేనివాళ్ళమని సర్టిఫికెట్లు ఇవ్వడమో చేయవలసింది. దానితో మరో ఊరికిపోయి కొత్త మనువులకోసం ఆడవాళ్ళు ప్రయత్నిస్తారు.

రోజు రోజుకి మా సంసారులలో రాజుకుంటున్న ఈ మహాగ్ని మా కుటుంబాలను నాశనం చేస్తుందనడంలో సందేహంలేదు.

మా ఉత్తరాలను ముఖ్యమంత్రిగారికి కూడా చూపించగలరని విశ్వసిస్తున్నాము.

భవదీయుడు
నరసింహారావు పంతులు

ఈ ఉత్తరానికి ప్రభుత్వం నుండి వచ్చిన జవాబు:

శ్రీ రావు గారికి

విషయం: ఇనెఫెర్టిలిటీ అండ్ స్టెరిలిటీ

మీ ఉత్తరాన్ని ఆరోగ్య శాఖమంత్రిగారు, ముఖ్యమంత్రిగారు చూశారు. సత్వరచర్య తీసుకుంటున్నామని హామీ ఇచ్చారు. ఈ విషయం మీకు తెలియజేయడానికి చాల సంతోషిస్తున్నాము.

ఒక నెల్లాళ్ళ తరువాత ప్రభుత్వం నుండి వచ్చిన మరో ఉత్తరం.

గైనకాలజీ ప్రొఫెసరు గారికి,

విషయం: ఇన్ఫెర్టిలిటీ అండ్ స్టెరిలిటీ

'గోనెలపాడు గ్రామంలోపైన ఉదహరించిన విషయంలో అత్యవసర పరిస్థితి ఏర్పడింది. ప్రస్తుతం 'గ్రామానికో వైద్యశాల' పథకంక్రింద కేటాయించిన 'నిధుల నుండి మూడులక్షల రూపాయలు వైద్య

బృందం జీతాలక్రింద, ఔషధాలకింద విడుదల చేయడమైనది.

మంచి తెలివితేటలు, చురుకుదనం, అనుభవం కలిగిన లేడీ డాక్టరును, గైనకాలజీ స్పెషలిస్టును గోనెలపాడుకు వెంటనే పంపవలసింది. కంట్రాక్టరు అప్పలస్వామి, డిస్పెన్సరీకి, వైద్యబృందానికి ఇళ్ళు కట్టినట్లు తెలియజేశారు.

ఒక విషయం ముఖ్యంగా గుర్తుంచుకోవాలి. లేడీ డాక్టరు చాల చురుకైనవారై ఉండాలి.

లేడీ డాక్టరు కోరితే ఆమెకు సహాయం చేయడానికి ఒక మగడాక్టరును కూడా పంపవలసింది.

మీరు తీసుకొన్న చర్యను వెంటనే తెలియజేయవలసింది.

సెక్రటరీ-ఆరోగ్యశాఖ

తరువాత నరసింహారావు పంతులుగారి ఉత్తరముంది.

గౌరవనీయులైన ఆరోగ్యశాఖ మంత్రిగారికి,

విషయం: ఇన్‌ఫెర్టిలిటీ అండ్ స్టెరిలిటీ

మీరు, ముఖ్యమంత్రిగారు తక్కువ వ్యవధిలో గోనెలపాడు గ్రామానికో మంచి డిస్పెన్సరీ కట్టించడమే కాకుండ, చాల చురుకైన లేడీ డాక్టరుని, మగ డాక్టరును పోస్టుచేసి మా ఇబ్బందులకు తగిన ప్రాధాన్యమిచ్చారు. దీనికి మా గ్రామం ప్రజలందరము కృతజ్ఞతలు తెలియజేస్తున్నాము.

ఇట్లు
నరసింహారావు పంతులు

ఈ ఉత్తరానికి ప్రభుత్వంనుండి జవాబు లేదు.



ఆఫైలులోని ఆఖరు ఉత్తరం రెండోసారి చదివిన ప్పుడు కూడా, అతని ముఖంలో కోపం చిందులు దొక్కింది.

గౌరవనీయులైన ఆరోగ్యశాఖ మంత్రిగారికి,

విషయం: ఇన్‌ఫెర్టిలిటీ అండ్‌స్టెరిలిటీ

మీరు, ముఖ్యమంత్రిగారు మాఊరి ప్రజల జబ్బును కట్టించడానికి ఇద్దరు డాక్టర్లను పంపించారు. ఇద్దరి కిద్దరూ జపంవిడిచి లొట్టలలో పడుతున్నారు. మగవాళ్ళకు పట్టుకున్న మహామారి విడవనే లేదు, కొత్త రోగమొకటి ఆడవాళ్ళను పట్టుకొంది. ఇలాళ్ళందరూ చాల అసభ్యంగా ప్రవర్తిస్తున్నారు. ఎవరేనా ప్రశ్నిస్తే చికిత్సలో ఒక భాగమంటున్నారు. ఈ విధంగా ఉపేక్షిస్తే కొన్నాళ్ళలో మాగ్రామం మగతనంపోయిన పురుషులతోను, 'మదపిచ్చి పట్టిన ఆడవాళ్ళతోను నిండిపోతుంది. సత్వరంగా ఇద్దరు డాక్టర్లమీద చర్య తీసుకోవలసింది.

ఇట్లు

నరసింహారావు పంతులు

ఆఖరి ఉత్తరంమీద ఆరోజు తేదీయేఉంది. ఫైలులో ఉన్నది కార్బను కాపీ. డాక్టరు నిర్మల చేస్తున్న ప్రయత్నాలకు ఈ ఉత్తరం ఏవిధంగా ఉపకారం చేయదు. పైగా అంతరాయం కలిగిస్తుంది

ఏంచేయడం?

రోజూ పన్నెండు గంటలుదాటిన తరువాత పోస్టలు రన్నరు రామన్న పేటనుండివచ్చి పోస్టాఫీసులో ఉత్తరాలు తీసుకుపోతాడు. అతనింకా వచ్చినట్లులేదు.

గోపీకృష్ణ లేచి నిలబడ్డాడు.

"అయ్యా! నరసింహారావు పంతులుగారూ!ఒక్క అయిదు నిమిషాలలో పోస్టాఫీసుకు వెళ్ళివస్తాను. మీరు భోజనం పూర్తిచేసేసరికి తిరిగి వస్తాను"

లోపల నుండి జవాబు కోసమైనా చూడకుండా, ఫైలు యథాస్థానంలోఉంచి, వీధిలోకి నడిచాడు గోపీకృష్ణ.

పోస్టుమాస్టరు సుందరయ్యగారు మనిఆర్డర్లు లెక్కబెడుతున్నారు.

"అయ్యా, సుందరయ్యగారు! నమస్కారం!

"రండి, రండి! డాక్టరుగారా?"

"చిన్న సహాయం కావాలి"

"చెప్పండి."

"మా స్నేహితులిద్దరికి ఉత్తరాలురాసి పోస్టులో వేశాను. తొందరలో ఒకరి చిరునామా ఇంకొకరి కవరుమీద రాయడం జరిగింది. ఆరెండు ఉత్తరాలు తీసుకుందామని."

"మీరు మరోవిధంగా అనుకోవద్దు. ఆపెద్ద బ్యాగులో రెండు కట్టలున్నాయి. మీ ఉత్తరాలు వాటిలో ఉంటాయి. చేతిలో పనుంది, లేకపోతే నేనే తీసిఇచ్చేవాడిని.

అదే గోపీకృష్ణ కోరుకున్నది

తన రెండు ఉత్తరాలతోపాటు నరసింహారావు పంతులుగారి ఉత్తరంతీసి పంట్లాంజేబులో పెట్టుకున్నాడు. పోస్టుమాస్టరుగారికి మరో నమస్కారం పెట్టి గోపీకృష్ణపైకి నడిచాడు.

గోపీకృష్ణ తిరిగి పంతులుగారి ఇల్లు చేరేసరికి తండ్రి, కొడుకుల భోజనాలు అయిపోయాయి. టేబిలుమీద న్యూస్‌పేపర్‌కాని, దానికిందనున్న ఫైలు కాని లేవు.

పంతులుగారు తాంబూలం వేసుకుంటున్నారు.

"ఏమండి డాక్టరుగారు! విశేషాలేమిటి?" పంతులుగారే ప్రశ్నించారు. ఆ ప్రశ్నలో హేళన స్పష్టంగా కనిపిస్తున్నది. ఇంతకీ పంతులుగారినంటే ఫలిత మేముంది! దానివెనుక కౌస్తుభం హస్తముందా?

"పంతులుగారు! ఒకసారి మిమ్మల్ని కలసి వెళ్ళిపోదామని వచ్చాను"

"మంచిది. మీకేదేనా సహాయం కావాలా?"

"అలాంటిదేమీలేదు. ఇక్కడ ఒక డాక్టరుకే పని లేదు. అందుచేత నేను వెళ్ళిపోదామని అనుకుంటున్నాను. మీరు సలహా యిస్తారేమే- అని వచ్చాను."

నరసింహారావు పంతులుగారు ఆలోచిస్తున్నారు. కుర్చీ పక్కనే నిలబడ్డ వెంకట్రావు ముందుకొచ్చాడు.

"డాక్టరుగారు! మీరెందుకు వెళ్ళిపోవటం?" అడిగాడు కుర్రాడు.

"నేనేం పనిచేస్తున్నాను? మందులు కలపటం, మాత్రలు లెక్క పెట్టటం-ఇవి ఎవరైనా చెయ్యగలరు. " అన్నాడు గోపీ.

"అవును. మీరు వెళ్ళిపోవడమే మంచిది. "అన్నారు నరసింహారావు పంతులుగారు.

"మీరు చాలమంచి డాక్టరని, ఊళ్ళోవాళ్ళందరూ అంటున్నారు" అన్నాడు వెంకట్రావు.

"అందుచేతనే అతను వెంటనే వెళ్ళిపోవాలి. మంచి డాక్టరుకి పనిలేకపోతే ప్రభుత్వం అనవసరంగా జీతాలు చెల్లించి నష్టపోతుంది" అన్నారు పంతులుగారు.

"ఆలోచిస్తే ఈ ఊరికి వేరే డాక్టరు అక్కరలేదు. ఆయుర్వేద వైద్యులు కౌస్తుభంగారే చాలు. ఇంతకీ





మమ్మల్ని ఒకర్నికాదు ఇద్దరిని, ఎందుకుతెచ్చారో నాకు ఈనాటికి కూడా అర్థమవడంలేదు." అన్నాడు గోపీ.

"అవును అది నిజం!" అన్నారు పంతులుగారు.

"డాక్టరుగారూ! మీరోనాడు మాట్లాడుతూ, ఈ ఊరి మగాళ్ళకు పట్టిన దుర్గతికి అంతం కనుక్కుంటా నన్నారు. మరి మధ్యలో వెళ్ళిపోవడం భావ్యంగాఉందా?" వెంకట్రావు అన్నాడు.

"ఒరేవెంకా! మాటలనడం తేలిక. గోపీకృష్ణగారు వచ్చిన తరువాత పరిస్థితి ఏమాత్రం బాగుపడలేదు. గవర్నమెంటువారి డబ్బులు కాలువలో పోయడం నాకిష్టంలేదు. ఈ డాక్టర్లు రాకముందు సంసారాలు గుట్టుగా నడిచేవి. ఇప్పుడన్నీ వీధిని పడ్డాయి. పరిస్థితులు ఇంకా క్షీణించకముందే మీరు పెట్టేబేడా సర్దుకోవడం మంచిది."

"పెద్దవారు మీరిలా సెలవిస్తున్నారు. నేనుకూడా సిద్ధంగానే ఉన్నాను. ఉన్నది ఒక్కటే పెట్టె-పుస్తకాలు, మైక్రోస్కోప్ డాక్టరు నిర్మల గారికి విడిచి పెడతాను. ఆర్డర్లు రావడమే తడవు..." అన్నాడు గోపీ.

"ఆర్డర్లు వారం రోజులలో వస్తాయి. గౌరవనీయులైన ఆరోగ్య శాఖామంత్రి గారి అభిప్రాయం కూడా అదే." అన్నారు పంతులుగారు.

డాక్టరు గోపీకృష్ణ మరేమీ మాట్లాడలేదు. పోస్టాఫీసులోతాను చేసిన పని తప్పుకాదు. కొంచెం సమయం కావాలి.

గోపీకృష్ణ వీధిలో పదడుగులు నడిచాడో లేదో, వెంకట్రావు చొక్కా వేసుకొని అతనివెనుక పడ్డాడు.

"డాక్టరుగారూ! మీరు వెళ్ళిపోతారంటే నాకు అదోవిధంగా ఉంది."

"అవును నాకూ అలాగేఉంది. ఈ ఊరిలో మంచి స్నేహితుడివి నువ్వు ఒక్కడివే. నిన్ను విడిచి వెళ్ళడానికి నేనుకూడా బాధపడుతున్నాను."

"ఇదంతా మా కౌస్తుభం మాకు తెచ్చిన పెంటే"

"అతనికీ దీనికీ సంబంధమేమిటి?"

"మానాన్నగారు అడక్కుండానే అతను అయిదువేల రూపాయలు నిన్ననే అప్పిచ్చాడు, వడ్డీ పుచ్చుకోనన్నాడు. మా అలమేలు అత్తను మీరు లోబరుచుకోవడానికి ప్రయత్నిస్తున్నారనీ అప్రదిష్ఠ అనీ, మిమ్మల్ని వెంటనే పంపివేసే ప్రయత్నం చెయ్యమనీ అతను మానాన్న గారితో చెప్పాడు"

"దీనికి మీనాన్న ఒప్పుకున్నారా?"

"ఆడవాళ్ళకు అవమానం జరుగుతున్నదంటే ఆయన ఒప్పుకోరా? వెంటనే హెల్తు మినిస్టరుగారికి ఉత్తరం రాశారు."

గోపీకృష్ణ పంట్లాం జేబు తడుముకున్నాడు. అందులో మంత్రిగారికి రాసిన ఉత్తరం భద్రంగా ఉంది.

"ఓహో! కథ చాలావరకు వెళ్ళిందే!"

"డాక్టరుగారూ? ఒక్క సంగతి నిజం చెప్పండి. మీకు మా అత్తమీద మనసుందా?"

"ఉందని మీ మామ అంటున్నాడుగా!"

"మా మామ వట్టి అబద్ధాలకోరు. మీరు సరదాకేనా నాతో ఒక్క అబద్ధంకూడా ఆడలేదు. నిజంగా మీకు ఆవిడ మీద మనసుందా?"

"లేదు"

"అమ్మయ్య! నాకు మనసుఇపుడు తేలికపడింది. ఇంకా మరో విషయం మీకు చెప్పాలనుకున్నాను".

"చెప్పు"

"ఈఊరి మగాళ్ళు మరి బాగుపడరు. కంసాలి కామమ్మ శపించింది."

"ఏమిటేమిటి"

"కంసాలి సూరయ్య భార్య రెండేళ్ళకింద ఊరి బావిలో పడిపోయింది. తరువాత ఆమె పాలకొంత హాస్పిటల్లో చచ్చిపోయింది. చచ్చిపోతూ ఆమె శాపంపెట్టింది."

వెంకట్రావు మరికొన్ని వివరాలతో కథ చెప్పాడు.

"నీకీ కథ ఎవరు చెప్పారు?"

"కౌస్తుభం మామ"

"ఎందుకు చెప్పాడు?"

"అదేమరి! ఆమధ్యన మీతో చెప్పాను కదా, నాలో కూడా మగతనం పోయిందని. ఊరుకోకుండా నేను మామను మందియ్యమన్నాను.

"అతని కూతురు నిన్ను రమ్మందని చెప్పావా?"

"అలా ఎందుకు చెప్తాను. మరో అమ్మాయి అన్నాను."

"దానికేం మందిచ్చాడు?"

అతనేం మందులివ్వలేదు. కాకమ్మకథ చెప్పి పొమ్మన్నాడు."

"చాలా అదృష్టవంతుడివి. అతను మందిస్తే నీ మగతనం పూర్తిగా పోతుంది. జాగ్రత్తసుమా!"

వెంకట్రావు గుండె బాదుకున్నాడు.

గోపీకృష్ణ డిస్పెన్సరీ వేపు నడిచాడు.

# 5



నిర్మల చాలా ఉత్సాహంగా ఉంది.

వంటావిడ సాయంకాలమే వండి, గోపీ కారియరు అతని గదిలో పెట్టి వెళ్ళిపోయింది.

ఆదివారంనాడు డిస్పెన్సరీ ఒక్కపూటే పనిచేస్తుంది. ఇవాళ స్పెషలు కేసులవాళ్ళు ఎవరూ రాలేదు.

పొద్దున్న నారాయణ సెట్టిగారి భార్య చంద్రమతి, పెరటిలో పూసినవని, చామంతిపూలు పంపించింది.

మధ్యాహ్నం భోజనమయిన తరువాత నిర్మల చాలాసేపు నిద్రపోయింది. నిద్రలేచి షాంపూతో తలంటుకుంది. పలుచని తెల్లచీర కట్టుకుంది. ఒదులుగా జడవేసుకుంది. జడలో చామంతుల దండ తురుముకొంది. కొంచెంసేపు ట్రాన్సిష్టరులో పాటలువింది. వినడానికి మనసులేకపోవడంతో దానిని ఆపేసింది. కొద్దిసేపు ఇంగ్లీషు నవలఒకటిచదివి, మనసు నిలకడలేక పక్కకు పెట్టింది.

కొంచెంసేపు గదిలో పచార్లు చేసింది నిర్మల.

ఆమె మనసునిండా ఏవో ఆలోచనలు. తాను గోనెలపాడువచ్చి ఎనిమిది నెలలయింది. వచ్చినదగ్గిరనుండీ తనకు సంబంధించిన గైనకాలజీ కేసులు ఏవో నామమాత్రంగా ఒకటి రెండు వచ్చాయి. మిగిలిన వాటిలో చాలమట్టుకు ఆ వూరి స్త్రీల సాంసారిక జీవితాలకు సంబంధించినవే. ఏదో పట్టుదలతో కేసులన్నీ జాగ్రత్తగా పరీక్షచేసి, ఆడవాళ్ళకు ధైర్యంచెప్పి, వాళ్ళ సంసారాలను చక్కదిద్దడంకోసం శ్రమపడుతున్నది.

మగవాళ్ళకు కలిగిన దౌర్బల్యం తాత్కాలికమైనదని, కేవలం మానసికమైనదని ఆమె ఒక నిర్ధారణకు వచ్చింది. భార్యాభర్తలిద్దరూ సహకరిస్తే కొన్ని కేసులు రెండువారాల్లోనే దారిపడతాయి. కొన్ని కేసులు పదిహేను వారాలవరకు సాగుతాయి. మరి, గోనెలపాడులోమాత్రం ఒక కేసు కూడా ఇప్పటికి పరిష్కారంకాలేదు. వరహాలు, చంద్రమతి, వెంకాయమ్మ, రంగమ్మ ఇంకా చాలమంది, చాల శ్రద్ధగా నిర్మలచెప్పినవి వింటున్నారు. కొన్ని పనులు సిగ్గుకలిగించేవయినా, తమ సంసారాలు తిన్నబడటానికి తప్పకుండా చేస్తామన్నారు. ఆ విధంగా ఆచరిస్తున్నారు.

ఈతతంగమంతా దేనికి?

ఇది తన వృత్తి. మగవారిలో కలిగిన దౌర్బల్యం పోగొట్టడం తన కర్తవ్యం. వాళ్ళు సహకరించడంలేదని వాపోవడం దేనికి? వాళ్ళ భార్యలు సహకరిస్తున్నారు. తను వాళ్లకు ఒకటే చెప్పింది. తమ మగవాళ్లతో చనువుగా, ప్రియంగా మెలగడంవలన వారు నష్టపోయేది ఏమీలేదు. వాళ్ళు మరింత దగ్గరగా వస్తారు. సంసారాలు కుదుటపడతాయి.

భార్యలు ఎంత అనుకూలంగా ప్రవర్తిస్తున్నా ఫలితాలు కనిపించడంలేదు.

ఈ చికిత్సతో వచ్చిన చిక్కే అది. కాలాన్ని మింగుతుందీ ట్రీట్‌మెంటు. విసిగెత్తి మానేస్తే చేసిన ప్రయత్నమంతా వ్యర్థమై సమస్య మొదటికే వస్తుంది.

తనకు చాల నమ్మకముంది.

స్త్రీలో ఓ సమ్మోహనశక్తిఉంది. మగాడు దాని నుండి తప్పించుకోలేడు.

నిర్మల మళ్లా ఆలోచనలో పడింది.

తన ఆలోచనలకు తానే నవ్వుకుంది. ఒళ్లుపులకించినట్లయింది. స్త్రీ పురుషుల సమాగమం ఒక దివ్యమైన అనుభూతి.

నిర్మల టైము చూసుకుంది. ఎనిమిదిగంటల రాత్రయింది. భోజనం ముగించింది. వీధి తలుపులు తీసింది. లోకమంతా వెన్నెలలో స్నాతమయింది. గాలిలో చల్లదనం గిలిగింతలు పెడుతున్నది.

చెప్పులు వేసుకొని నిర్మల బయలుదేరింది. తలుపులు దగ్గిరగా వేసింది. గోపీ గదివేపు నడిచింది. లోపల దీపం వెలుగుతోంది. అతను కూడా భోజనం ముగించి పుస్తకమేదో చదువుతున్నట్లుంది.

గదిలోకి కాలుపెట్టకుండా నిర్మల ద్వారందగ్గిరే నిలబడింది.

"గోపీ! వెన్నెల చాల అద్భుతంగాఉంది. అలా తిరిగొద్దామా!"

గోపీ తన చెవులను తానే నమ్మలేకపోయాడు. మంచి బాలిక అయిన డాక్టరు నిర్మల రాత్రిపూట మరో మగాడితో తిరగడానికి బయలుదేరడమా? ఈ గోనెలపాడు చాలా గొప్పదిలాఉంది. విశాఖపట్నంలో

ఎంత ప్రయత్నించినా డాక్టరు నిర్మలతో తిరిగే అవకాశమే దొరకలేదు - ఈ గ్రామంలో అనుకోకుండా లభిస్తున్నది. అదృష్టమో, ఛాన్సో, లక్కో - ఏదయినా ఇటువంటి అవకాశం విడిచిపెట్టరాదు.

గోపీలేచి చొక్కా తొడుక్కున్నాడు. వదులుగా షరాయి వేసుకున్నాడు.

ఒక ఫర్లాంగు దూరంలో గోనెలపాడు బావి, అంటే అదే, ఊరిబావి, వెన్నెలలో స్పష్టంగా కనిపిస్తున్నది.

ఇద్దరూ నడుస్తున్నారు. మెల్లిగా అడుగులు వేస్తున్నారు. గాలిలో ఒక నిధమైన మత్తు ఉన్నట్లుంది.

"విశాఖపట్నంలో ఇలా తిరిగిరాడానికి వ్యవధి దొరికేదికాదు. ఏదో రోజు మనం ఇక్కడినుంచి వెళ్లిపోతాం. ఇక్కడుండేప్పుడు ఈ ఆనందం ఎందుకు అనుభవించకూడదని నాకనిపించింది." అంది నిర్మల.

"రియల్లీ!" గోపీకృష్ణ ఇంకా ఆశ్చర్యం నుండి తేరుకున్నట్లులేడు.

"గోపీ! నిన్ను నేను ఎన్వీచేస్తాను. చాల హాయిగా జీవితం గడపడం నీకు తెలుసు. ఎప్పుడూ ఏదో ఆలోచిస్తూ, ఏదో చేస్తూ, కాలం వ్యర్థంచేయకూడదని, మరొకరికి సహాయపడాలని, మరికొంచెం సంపాదించాలని, చేజేతులా కష్టాన్ని కొనితెచ్చుకుంటున్నాను."

"ఇవి, ఈ మాటలంటున్నది డాక్టరు నిర్మలేనా?"

"అవును గోపీ! ఒకరి జీవితాలు బాగుచేయడానికి నా జీవితాన్ని, ఒకరిని సుఖపెట్టడం కోసం నా సుఖాన్ని ధారపోయడం అలవాటయింది. అందుకోసమే నువ్వేమన్నా ఊరుకుంటున్నాను."

గోపీకృష్ణ వెన్నెల్లో మెరుస్తున్న నిర్మలముఖంలోకి చూచాడు.

"నిర్మలా! ఇంతకాలం నీలో నాకో క్రమశిక్షణతో వ్యవహరించే డాక్టరు కనిపించింది. కాని, ఈ రాత్రి నాకో సుందరమైన మానవమూర్తి కనిపిస్తోంది. నువ్వు మెడికల్‌కాలేజిలో అడుగుపెట్టిన నాటినుండి నీ హృదయపు లోతులను తెలుసుకోడానికి ప్రయత్నించాను. నువ్వు మామూలు స్టూడెంట్లకు అందుబాటులో లేకుండాపోయావు. ఎప్పుడూ లెక్చరర్లు, ప్రొఫెసర్లు, పరీక్షలు, పేషెంట్లు - బుద్ధిమంతురాలవైన మంచిపిల్లవుగానే నిన్ను భావించి, నీనుండి దూరంగా ఉండడానికే ప్రయత్నించాను."

"గోపీ! నా స్నేహితులు చాలమంది నీకోసం తపస్సు చేసేవారు. వాళ్లు నీగురించి చెప్తుంటే నేను కోపాన్ని నటించేదాన్ని. వాళ్లందరితో నువ్వు చనువుగా తిరిగేవాడివి. నేనంటే ఆమడదూరంలో ఉండేవాడివి. స్త్రీలను ఆకర్షించే లక్షణాలన్నీ నీలో ఉన్నాయి."

"అవన్నీ బాహ్యమయినవేనా?"

"అప్పుడవన్నీ పైపైమెరుగులని నేను అనుకునేదాన్ని. అమ్మాయిల ప్రేమ సంపాదించడంకోసం నువ్వు పోజులు కొడుతున్నావని భావించాను."

"ఇప్పుడు?"

"నా అభిప్రాయం మార్చుకున్నాను."

"ఎందుచేత?"

"అప్పుడు నీగురించి ఆలోచించడానికి తీరుబడి ఉండేదికాదు. ఇప్పుడు నాకున్న తీరికఅంతా నీ గురించి ఆలోచించడంతోనే సరిపోతున్నది."

"నిజంగా?"

"అవును. నువ్వు ఉద్యోగంలో చేరిన తొలిరోజులలో భయపడ్డాను, ఏ రాత్రోవచ్చి బలవంతం చేస్తావని. క్రమంగా ఆ భయంపోయింది. నువ్వు నావట్ల మర్యాదగా ప్రవర్తిస్తున్నావనుకున్నాను. కాని, అలమేలు వృత్తాంతం తెలిసిన తరువాత నాకుండే సంశయాలన్నీ తొలగిపోయాయి."

ఇద్దరూ బావివరకువచ్చి ఆగిపోయారు.

గోనెలపాడుబావి చాల పెద్దది. పదిహేనడుగుల వ్యాసముంటుంది. దాని పిట్టగోడ అడుగున్నరమందముంది. ఎత్తు మూడున్నర అడుగులు. చుట్టూఉన్న పళ్లెం పదడుగులవెడల్పుంది. అయిదు గిలకలు చుట్టూ అమర్చిఉన్నాయి. ఈబావినుండి గ్రామంలోని ప్రజలు తమ అవసరాలకు కావలసిన నీళ్లు తోడుకొనిపోతుంటారు. కలిగినవాళ్లు మనుమలనుపెట్టి పోయించుకుంటారు. చుట్టుపక్కల ఇంతమంచి బావిలేదని అందరూ అంటారు. నుయ్యి తవ్వించడానికి రెండులక్షలు అయింది. ఎవరో మంత్రిగారు ఇంతదూరంవచ్చి దీనికి ప్రారంభోత్సవం చేసినట్లు చెప్పారు. ఆ బావిని తవ్వి గంగను తీసుకురాకముందు గోనెలపాడు వాస్తవ్యులంతా రామన్నపేటకుపోయి నీరు తెచ్చుకునేవారు. చాల కాలం అలా బాధపడ్డారు. ఇప్పుడు కంట్రాక్టరు అప్పలస్వామి పేరుచెప్పుకొని, కడుపునిండా నీరు తాగుతున్నారు. ఒంటినిండా స్నానం చేస్తున్నారు. పశువులకు, మొక్కలకు కూడా వాడుకుంటున్నారు. గోనెలపాడుబావికి నాలుగేళ్ల వయసే. అయినా ప్రజల మన్ననలకు పాత్రమయింది.

బండిదారికి ఏభై అడుగులదూరంలో, గ్రామంలోకి పోయేటప్పుడు ఎడమచేతివేపుఉంది బావి.

ఇద్దరూ బావివేపు నడిచారు.




బావి పళ్లెం చాలబాగా కట్టారు. వెడల్పుగా ఉంటుంది. దానిమీద ఒక్కచుక్కయినా నీరు నిలిచి ఉండదు. కిందపడ్డనీరు తిన్నగా కాలువలోంచి దిగువకు పోతుంది. సిమెంటుచేసిన పళ్లెం ఎప్పుడూ శుభ్రంగానే ఉంటుంది.

ఇద్దరు బావి రెండోవేపునకు నడిచారు. పిట్టగోడ అడ్డువచ్చి బాటమీద పోయేవారికి వాళ్లు కనిపించరు. రాత్రిపూట ఆ వేపు ఎవరూ తిరగరు.

పైకిలేచిన చందమామ వాళ్లిద్దరి ముఖాలమీద వెండి వెన్నెల కోటింగ్ వేశాడు.

"అద్భుతంగా ఉంది వెన్నెల!" అంది నిర్మల.

గోపీ ఆమెకు దగ్గరగా కూర్చున్నాడు.

"అంతకన్నా అద్భుతంగాఉంది నీ హృదయం" అన్నాడు గోపీ.

"ఈరోజు మనసువిప్పి నీతో మాట్లాడాలి"

"నేను చాల అదృష్టవంతుడిని"

"ఇందులో నా స్వార్థంకూడా ఉంది."

"నీకు స్వార్థమా?"

"అవును, నేను ఈ గ్రామానికి వచ్చినదగ్గిర నుంచీ, భార్యలకు సలహాలివ్వడం పరిపాటయింది. కాని, నేను మాత్రం ఎవరికీ భార్యనుకాను. నాకు ఏమనుభవముంటుంది?"

"మనం వైద్యులం - మనం శాస్త్రం చదువుకున్నాం - దీనికి అనుభవానికి సంబంధంలేదు."

"నేనూ అదే అనుకున్నాను - పల్లెటూరి ఆడవాళ్లు చిన్న చిన్న ప్రశ్నలు వేస్తుంటే ఒకప్పుడు జవాబు చెప్పలేకపోతున్నాను."

"దానికి బాధపడడంలో అర్థంలేదు. నీ పని నువ్వు చేస్తున్నావు.

నిర్మల అతనికి ఇంకా దగ్గరగా జరిగింది.

"మనం ఎప్పుడో దగ్గరికి రావలసింది. గోపీ నీకు సెన్సేటు ఎక్సర్సయిజెస్ గురించి తెలుసుకదా! కామాన్ని రేకెత్తించే ఈ వ్యాయామంలో స్త్రీ ముందుకు రావాలి. తన శరీరాన్ని తన మనసుని పురుషునిముందు విప్పాలి. అతడు తన శరీరంలో ఏ భాగాన్నిచూసి ఆనందిస్తాడో, తాను చెప్పే ఏమాటవిని పులకిస్తాడో తెలుసుకోవాలి. బాహ్యేంద్రియాలలో చైతన్యం కలగాలి."

"నిర్మలా!"

"గోపీ! చాలా ఆలోచించాను".

నిర్మల గోపీ ముఖం చేతుల్లోకి తీసుకొని, అతని కళ్లలోకి చూస్తూ అతని పెదవులతో పెదవులు చేర్చింది. ఆ ముఖాన్ని తన గుండెలమీదకు లాక్కుంది.

"నేనెంత అందమయిన దాన్నో నాకుతెలియదు - నీ చూపుల్లో తెలుసుకుందామంటే, చాల బుద్ధిమంతుడివై నా కళ్లల్లోకిచూడడం మానేశావు."

"నిర్మలా!"

"నీకేం భయంలేదు. రాత్రిపూట ఎవరూ ఇటువేపురారు. ఈ వెన్నెట్లో నీ కళ్లకు నేను నచ్చానా?"

నిర్మల గోపీ గుండెల్లో ముఖం దాచుకుంది.

"గోపీ! - నా హృదయంలో ఏదోచెప్పలేని ఆనందం పొంగిపొర్లుతూ.."

నిర్మల మాట్లాడడం ఆపింది. అతని ముఖంమీద ముఖముంచింది. విశాలమైన అతని వీపును మృదువుగా స్పృశించింది.

"పుస్తకంలో చాల విషయాలు చెప్పారు.. స్త్రీపురుషులిద్దరూ చాల దగ్గరగా రావాలి. కాని రిస్ట్రెయింట్స్ - నిగ్రహం చాల ముఖ్యం - కామంతో ఉద్రిక్తులమయి మనం కలిసిపోకూడదు - మన శరీరాలు ఒకటికొకటీ తగులుతుంటే కలిగే స్పర్శ సుఖం, మనమాటలలో లాలన, అన్నీ అనుభవించాలి."

నిర్మల అతని శరీరంలో పైభాగాన్ని తన శరీరంతో కుమ్మేతోంది. పులకించిపోతున్నది. ఆనంద తన్మయురాలవుతున్నది. సెన్సేట్ ఎక్సర్సయిజెస్‌లో గమనించవలసింది నిగ్రహం.. ఉద్రేకం ప్లాటోస్టేజికి చేరినప్పుడు కామం గురించి ఒక్క క్షణం మరచిపోయి..

"గోపీ! ఈవూరు నీకు నచ్చిందా?" ఆమె సంభాషణమారుస్తోంది. అభ్యాసం పునరావృతం కావాలి.

గోపీలో ఏ విధమైన ఉద్రేకంలేదు. నిర్మల ఎంత చక్కటిదో అతనీరోజే దగ్గర్నుంచి చూశాడు. ప్రతి అవయవం తూచినట్లుంటుంది. అనాఘ్రాతపుష్పం - వనిత తనంత తానలచి వచ్చినది - శరత్పూర్ణిమ - కానీ ఆ మనిషిలో ఉద్రేకమేలేదు.

ఒక్కసారి, చిన్నసెలయేరు పారుతున్న శబ్దం. నూతిలో నీళ్ళు పడుతున్న చప్పుడు. అతని ధ్యానం నిర్మల మాటలమీదలేదు - ఆమె ముద్దులమీద లేదు. వెన్నెల్లో మెరుస్తున్న ఆమెమీద లేదు. బిగికౌగిలింత మీదలేదు. నూతిలోంచి వచ్చే శబ్దం మీదే అతని మనసంతా లగ్నమయింది.

రెండుసార్లు..ఇది మూడోసారి..నిర్మల మళ్ళా ఉద్రేకస్థితికి చేరుకుంటోంది. ఇక ఆపడం ఎవరితరంకాదు. స్త్రీపురుష సమాగమమే దానికి జవాబు. ఆ ఉద్రేకంలో నిర్మల అతని శరీరాన్నంతటినీ పులకిస్తున్న తనమునివేళ్ళతో స్పృశిస్తున్నది.

హఠాత్తుగా డాక్టర్ నిర్మల లేచి నిలబడింది. చేయిచాచి గోపీ చెంపమీద కొట్టింది.

"యూ ఇంపొటెంట్ బాస్టర్డ్"! అంటూనే కాలితో అతనిని తన్ని ఇంటివేపు పరుగెత్తింది.

"ఓ గాడ్! అయామ్ ఛీటెడ్" అరుస్తోంది నిర్మల హృదయం.

గోపీకృష్ణ లేచాడు. నూతిలో నీరుపడుతున్న చప్పుడు. ఆకాశం మీద చంద్రుడు మధ్యవరకు పోలేదు. నూతిలో చాలాభాగం చీకటిగానే వుంది.

గోపీకృష్ణ అడుగులో అడుగువేసుకుంటూ ఇళ్ళ వేపు నడిచాడు.

నిర్మల ఇంటితలుపు మూసిలేదు.

గోపీకృష్ణ లోపలికి ప్రవేశించాడు. నిర్మల మంచంమీద కూర్చొని ఏడుస్తోంది.

గోపీ కుర్చీలాక్కొని మంచం దగ్గిర కూర్చున్నాడు.

పదినిముషాలు ఎవరూ మాట్లాడలేదు.

తరువాత గోపీకృష్ణ మంచును విరక్కొట్టాడు.

"డాక్టర్ నిర్మలా! ఈ గ్రామంజనాభా 816. మనిద్దరంకాక - అందులో 420 మంది స్త్రీలు. 396 మంది పురుషులు - ఈ పురుషులలో స్త్రీసంపర్కానికి యోగ్యులైనవారు - అంటే పదహారు సంవత్సరాలనుండి డెబ్బైసంవత్సరాల వయసువరకు ఉన్న మగాళ్ళు - 290 మంది. వీరందరూ మగతనంపోయినవారే. ఇంతవరకూ నాగురించి ఆలోచించలేదు. ఇపుడీ సంఖ్య 291 అయింది. దానికోసం దుఃఖించడంలో అర్థంలేదు. అరమర

అభ్యంతరం లేకుండా ప్రతిరాత్రి మనం సెన్సేట్ ఎక్సర్‌సైజెస్ చేసుకోవచ్చు.''

''స్టాప్ టాకింగ్ రాట్''.

''డాక్టర్ నిర్మలా! నేను నీపేషెంటుని. నామీద కోర్సు మొదలెట్టు - టెస్టోస్టెరోన్ ఇవ్వడం మొదలు పెట్టు''.

''గోపీ! దయచేసి వైద్యంగురించి మాట్లాడకు''

''అయితే విను. మనమొక నేరంచేశాము. ఈ గోనెలపాడు బావి చాలా మహత్తుకలది. దీనిలో కంసాలికామమ్మ పడింది. గోనెలపాడులోని మగాళ్లు ందరూ నపుంసకులై పోతారని శపించింది. ఆ బావిగట్టున, తొలిసారిమనం కలుసుకుంటే శాపంత గలకుండా పోతుందా?''

''కాక్ అండ్ బుక్ స్టోరీస్ఇవి.''

''డాక్టర్ నిర్మలా! విను. ఈ వూరిలో కంసాలినూర య్యకు ఒక పడుచుభార్య కామమ్మ అనేది ఉండేది ఆమెకు పిల్లలమీద మనసుపోయి, తనభర్తను కలి యమని అడిగింది. ఆ మగడు నిర్వీర్యుడై ఆమె కోరిక తీర్చలేకపోయాడు. ఆమె ఊరిమీదపడి కని పించిన మగాడినల్లా తనకు సంతానం ప్రసాదించ మంది. ఎవరూ ఆమెకోరికను తీర్చలేదు. ఆమె కోపంతో ఆత్మహత్య చేసుకోడానికి ఈ వూరిబావిలో గెంతింది. పట్టపగలు - నలుగురూచూస్తూ ఊరు కుంటారా? ఆమెనుపైకి తీశారు. కాని తలపై గట్టిదె బ్బ తగిలింది. ఆమెను వెంటనే పాలకొండ హాస్పిట ల్‌లో చేర్చారు. మూడురోజుల తర్వాత ఆమె చనిపో యింది. చనిపోయేముందు ఆమె గోనెలపాడు మగ వారినందరినీ శపించింది. అందరూ నపుంసకులు కమ్మని శపించింది. ఆశాపం అమలులో ఉన్నన్నా ళ్ళు ఏ మగాడయినాయింతే.''

'నువ్వు డాక్టర్‌వయి ఇటువంటి పుక్కిటిపురాణా లు నమ్ముతావా?''

''చాలాపెద్ద వైద్యులు, భిషక్ ప్రవీణులు, కౌస్తు భాచారిగారు, తన దగ్గరికివచ్చి ఫెయిలయిన అందరితోనూ ఈ కామమ్మ శాపంగురించి చెప్పి నముదాయిస్తున్నారు. బహుశా ఆ కర్స్ మనక్కూ డా...''

''నేనడుగుతున్నది, నువ్వీసంగతి నమ్మావా అని?''

''లేదు. వడ్రంగి చిన్నయ్యద్వారా నిజం తెలి సింది. ఆమె అత్త బాధలు పెట్టేది. ఒకసారి అత్తాకోడళ్ళు దెబ్బలాడుకొని రచ్చకెక్కారు. కోడలు నూతిలో గెంతింది. నూతిలో నీరున్నా తలకిరాయి మోసింది. ఆమె పాలకొండ హాస్పిటల్‌లో చనిపో యింది. శావం సంగతి తెలుసుకోవాలని నిన్న మధ్యాహ్నం పాలకొండవెళ్ళి హెడ్‌నర్సుని కలుసుకు న్నాను. ఈ కేసుజరిగి రెండు సంవత్సరాల ఆరునెల లకుపైగాఅయింది. అయినా ఆమె మరచిపోలేదు. తలకి బలమైన దెబ్బ తగిలిందని, మాటాచూపులే కుండా మూడురోజులు బ్రతికి చనిపోయిందని నర్సుచెప్పింది.''

''ఈ సంగతి ఊళ్ళోవాళ్ళకి చెప్పలేకపోయావా?''

''మనంచెప్పినా వాళ్ళు వినరు. దీనిని సమయా నుకూలంగా మనం వాడుకోవచ్చు.''

''ఏం చేస్తావేమరి.''

''డాక్టర్ నిర్మలా! మనబతుకులు ఈ ఊళ్ళో వీధినిపడ్డాయి. మనం వీళ్ళకక్కరలేదు. మనమీద అర్జీలు వ్రాయడం మొదలుపెట్టారు. పల్లెటూరివా ళ్ళు అమాయకులని అనుకోకు.మనం వెళ్ళిపో వడం తప్పదు. మనల్ని ఒకందుకు ఇక్కడికి పంపించారు. ప్రొఫెసరుగారికి నీమీద పూర్తి నమ్మక ముంది. నువ్వు ఏదోపద్ధతిని దీనిని సాధించడానికి ప్రయత్నాలు చేస్తున్నావు. మనం ఈ జాడ్యానికి అంతుతెలుసుకోకుండా వెళ్ళిపోతే ఓడిపోయినట్లే. ఈ ఓటమికి నామనసు అంగీకరించడంలేదు.''

''గోపీ! మనంఏమి చేయగలం?''

''ఏంచేసినా మనమే చేయాలి. ఒక్కసంగతి డాక్టర్! ఈ రోగానికి చికిత్సకోసం మనం ఏవిధమైన లోపంచే యలేదు. కాని రోగానికి మూలకారణమేదని ఆలో చించలేదనిపిస్తోంది.

''మేల్ ఇంపొటెన్సు, ఫిమేల్ లిబిడో - ఈ రెండూ రెండున్నర సంవత్సరాలకింద ఈ గ్రామానికి సంక్ర మించాయి. అంతవరకూ వాటిగురించే ఎవరికీతెలీ దు. దీనికి నువ్వు అనుకున్న సైకిక్ కారణాలు ఆధారంకావు. ఈ సైకో - సెక్సో ఎక్సర్‌సైజెస్ ఏ విధంగానూ పనిచేయడంలేదు. మనంమరేదేనా కారణంకోసం వెదకాలి.''

నిర్మల మంచంమీంచి లేచి.

గోపీనిపంపించి తలుపులు వేసుకుంది.

★ ★ ★

గోపీకృష్ణ నిద్రలేచేసరికి ఉదయం ఎనిమిది కావ చ్చింది. రాత్రి అతనికి వెర్రిగా నిద్రపట్టింది. ఇంత వరకు అతనికొక సందేహముండేది. అది గడచిన రాత్రి తీరిపోయింది. గ్రామంలో పురుషులందరూ ఒక విధంగా, తాను మరో విధంగా ఉన్నట్లు అనుకు న్నన్నాళ్లు అతనికి కష్టంగా ఉండేది. ఇపుడు అంద రితోబాటు తనుకూడా!

అందరికీ రోగం కుదరకపోవచ్చు తనకీకూడా కుదరకపోతే?...

కాబట్టి దీని అంతు తేల్చాలి. అప్పుడు ఈ విముక్తి తనకేకాదు—గోనెలపాడు ప్రజలందరికీ కలిగితీరుతుంది.

తొందరతొందరగా కాల్యాలు ముగించుకొని డిస్పెన్సరీకి వచ్చేసరికి ఎనిమిదిన్నరఅయింది. అప్పటికే నలుగురయిదుగురు పేషెంట్లు వచ్చి కూర్చున్నారు. ఫకీరు, నరసమ్మ తన కోసం ఎదురుచూస్తున్నారు.

టేబిలు మీద ఒక చీటీ ఉంది.

''డియర్ గోపీ,

నా మనసు బాగులేదు. పాలకొండ వెళ్తున్నాను. సాయంకాలానికి తిరిగి వస్తాను. లేకపోతే రేపు ఉదయానికి—అంత వరకూ డిస్పెన్సరీ చూసుకో''

నిర్మల.

గోపీకృష్ణ నవ్వుకున్నాడు. నిర్మలను ఈ అడుసులోంచి పైకి తప్పించాలి. ఈలోగా ఆర్డర్లు వస్తాయి. సర్వీస్ టెర్మినేషను జరుగుతుంది. కాలం చాలా విలువైనది.

డాక్టరు గోపీ కృష్ణ పన్నెండు వరకు నిర్విరామంగా పని చేశాడు. ఈ రోజు చాలామంది రోగులు వచ్చారు. అందరికీ మందులిచ్చేవరకూ మరేమీ ఆలోచించడానికి అవకాశం చిక్కలేదు.

ఉన్నట్టుండి పన్నెండు గంటలకు ఇద్దరు మనుష్యులు రామన్నపేట నుండి సైకిళ్ల మీద వచ్చారు. వాళ్లు ఆయా నరసమ్మను కలిశారు.

''డాక్టరమ్మగారు లేరా?'' ఒకతను అడిగాడు.

''లేరు. పాలకొండ వెళ్లారు'' నరసమ్మ జవాబు చెప్పింది.

''బాబుగారు మంచోళ్లేనా?''

''చాల మంచోళ్లు.''

''చెయ్యి చలవ?''

''చాల మంచి చెయ్యి''

తరువాత వాళ్లిద్దరూ కన్సల్టింగ్ రూములోకి ప్రవేశించారు. ఆఖరిరోగి వెళ్లిపోయి గోపీకృష్ణ లేస్తున్నాడు.

''బాబుగారు! మేం రామన్నపేటనుండి వచ్చాం. సీతంనాయుడుగారు పంపించారు. వాళ్లమ్మాయి చావు బతుకుల్లో వున్నారు. రెండురోజులయి పురుడయినారు. మంత్రసాని ఎవరూ లేక వాళ్లపెద్దమ్మే పురుడు పోసింది. ఏంజరిగిందో మరి—పురిటాలికి ఒళ్లుపేలిపోతున్నది—పసిపాపకుకూడా జ్వరమే. తమరు వెంటనే రావాలి.''

గోపీకృష్ణ వాళ్లవేపు చూశాడు. ఆత్రత, బెంగ, భయంవాళ్ల ముఖాల్లో కనిపిస్తున్నాయి.

''ఎలా మీవూరెళ్లాలి?'' అడిగాడు

''బండి చేయించి తెస్తాం''

''కాలం ఒక్క నిమిషంకూడా వ్యర్థం కాకూడదు. మీరు చెప్పిన మాటల్ని బట్టి రోగి చాల ప్రమాద పరిస్థితిలో ఉంది. మీ దగ్గర సైకిలుందా?''

''ఉంది బాబూ ఉంది. ఒక సైకిలు మీకిచ్చి, రెండోదానిమీద ఇద్దరం వస్తాం.''

డాక్టరు గోపీకృష్ణ ఎమర్జన్సీ బాగ్ ఎప్పుడూ సిద్ధంగా ఉంటుంది. కావలసిన మందులు, ఇంజక్షనులు—అన్నీ తయారుగా ఉంటాయి—

ఒక్క నిమిషంలో గోపీకృష్ణ సైకిలుమీద రామన్నపేట బయలుదేరిపోయాడు. డాక్టరు నిర్మలకు చీటి కూడా రాయలేదు కనీసం స్టాఫ్‌తోనైనా చెప్పలేదు. అతనికి మరే ఆలోచనలులేవు..ఒకటే చూపు..ఆమెను రక్షించాలి.

ఎండ కొంచెం ముదిరింది. కార్తీకం ఇంకారాలేదు. దసరా వెళ్లిపోయింది. అరగంటలో గోపీకృష్ణ రామన్నపేట చేరుకున్నాడు.




రామన్నపేటలో సీతంనాయుడుగారిల్లు చాల పెద్దది. పెంకుటిల్లు. వీధిలో పెద్ద అరుగులు. విశాలమైన వరండా. ఒక పక్కనున్న గదులలో ధాన్యం నిలువకుపోయించినవున్నాయి. రెండవవేపున్న గదులలో, మధ్య నున్న హాలులో ఇంట్లోవాళ్లుంటున్నారు.

పురిటాలిని, చంటిపిల్లాడిని చూడగానే గోపీకృష్ణ చాల ఆందోళనపడ్డాడు. ఇల్లు అంత పెద్దదున్నా పురిటాలిని మాత్రం మూలనున్న వంచలో, నులక మంచంవేసి, గాలివెలుతురు లేనిచోట ఉంచారు. పురిటాలిదగ్గర వంటాముదం వాసన—దిగదుడుపులకు పోసిన బియ్యం, పారాణి, వసంతం—అదో విధంగా ఆ పరిసరాలు జుగుప్సను కలిగిస్తున్నాయి.

ముందు పురిటాలిని, శిశువును గాలివెలుతుర్లు న్న పెద్ద గదిలోకి మార్పించాడు. మంచంమీద తెల్ల దుప్పటీ వేయించాడు. తరువాత వైద్యం మొదలు పెట్టాడు డాక్టరు గోపీకృష్ణ. వెంటనే ఇంజక్షను ఇచ్చాడు. కాప్సూలు తినిపించాడు. తడిగుడ్డతో స్పాంజ్ చేశాడు. కుర్చీ ఒకటి తెప్పించి పురిటాలి మంచం ప్రక్కనే వేసుకుని కూర్చున్నాడు.

ఇంటివాళ్లు, ఊళ్లోవాళ్ళు గుమిగూడి గుసగుస లాడుతుంటే అందరినీ పైకి పంపించాడు. పురిటా లు బతుకుతుందాలేదా అని అందరూ సందేహం వెలిబుచ్చుతుంటే ఒకటే సమాధానం చెప్పాడు. తల్లీ. పిల్లాడు తప్పకుండా బతుకుతారు.

ఆ విధంగా అతను మూడురోజులురాత్రులు, వగళ్లు పురిటాలిదగ్గిరే కూర్చున్నాడు. మందు మార్చి మందిస్తున్నాడు. మనుషులను పాలకొండ వంపి ఖరీదైన ఇంజక్షన్లు తెప్పించాడు. మధ్య మధ్యలో శిశువునుకూడా చూసేవాడు.

ఒక మనిషి గోనెలపాడు వెళ్లి డాక్టరుగారి సూట్‌కే సు పట్టుకొచ్చాడు. ఒక వయసులోనున్న అమ్మాయి పురిటాలి సంరక్షణకోసం ఉండిపోయింది. ఇద్దరు కంబార్లు అహర్నిశలు వాకిట్లో ఉండేవారు. సీతంనా యుడుగారు దుఃఖంతో డాక్టరు గోపీకృష్ణను తొలి రోజు పలకరించి, ఏవిధంగానైనా తన ఒక్క కూతు రినీ రక్షించమని అతని చేతులు పట్టుకున్నారు. ఎంతడబ్బయినా ఇస్తానన్నారు. గోపీకి ఒకటే ధ్యానం. మందులు ఏవి ఇవ్వడం, ఫలితం లేకపోతే మరే మందు మార్చడం, ఆ మందు అందుబా టులో ఉందా, లేని వక్షంలో తెప్పించి సిద్ధంగా ఉంచడం, అన్నిటికన్న పురిటాలి గదిని పరిశు భ్రంగా ఉంచడం, అనవసరంగా ఎవరినీ గదిలోకి రాకుండా వారించడం మొదలైన పనులన్నీ చాల ఖచ్చితంగా చేశాడు.

వైద్యం మొదలైన మూడు రోజులకి పురిటాలు కళ్లు తెరిచింది. నూట నాలుగు, నూట అయిదు ఉన్న జ్వరం తగ్గుదల చూపింది. ఇంట్లో వాళ్లకి, ఊళ్లోవాళ్లకి కొంచెం నిబ్బరం కలిగింది.

''చంటి పిల్లాడు ఎలా ఉంటేనేం, తల్లిప్రాణం దక్కితే చాలు'' అనుకున్నారందరూ.

కాని, డాక్టర్ గోపీకృష్ణకిది అగ్ని పరీక్ష.

తల్లి ప్రాణం ఎంత ముఖ్యమో, శిశువు ప్రాణం కూడా అంత ముఖ్యమే.

పురుడు పోసిన ఆవిడకు అనుభవం కూడా లేదు. బొడ్డుకోయడంకూడా చేత కాదు. శిశువు బొడ్డు వాచిపోయింది. చిన్న పిల్లాడికి కూడా చికిత్స జరు గుతోంది. ఆవిషయం అందరికీ తెలీదు. మందులు క్రమబద్ధంగా యిచ్చి, బొడ్డును చాల జాగ్రత్తగా డ్రెస్‌చేసి, కట్టుకట్టి, శిశువు ఆహారం విషయంలో కూడ శ్రద్ధ వహించి గోపీ కృష్ణ పనిచేశాడు.

అయిదో రోజు పురిటాలు ప్రమాద పరిస్థితి నుండి బైటబడింది. డాక్టరుగారికి చేతులుజోడించి నమస్కరించింది. సీతంనాయుడుగారి ముఖంలో దైన్యం తొలగింది. నాయుడుగారి భార్య ఎందరో దేవుళ్లకు మొక్కుకుంది. వ్రతాలు చేస్తానంది. సాధు వులకు భోజనాలు పెడతానంది.

డాక్టరు గోపీకృష్ణ వైద్యానికి వచ్చిన రెండు మూ డుగంటలలో వెళ్లిపోతానని అనుకోలేదు గానీ పదిరో జులు ఉండిపోవలసి వస్తుందని మాత్రం అనుకోలే దు. అయిదో రోజుకు పురిటాలు దారిపట్టినా, శిశువు మాత్రం ఏడో రోజువరకు చావు బ్రతుకులలో తారా డాడు. ఏడో రోజు, మందులు రాసి గోపీకృష్ణ వెళ్లిపో తానంటే సీతంనాయుడు అంగీకరించలేదు.

గోపీకృష్ణ రామన్నపేటలో గడిపిన పదిరోజులు తనజీవితంలో ఎప్పుడూ మరచిపోలేదు. గౌతముడి కి బోధివృక్షం క్రింద జ్ఞానోదయమైనట్లు, డాక్టరు గోపీకృష్ణకు రామన్నపేటలో వివేకసూర్యోదయమ యింది.

మొదటిరెండురోజులు, డాక్టరుగోపీకృష్ణ గడ్డంకూ డా గీసుకోలేదు. పురిటాలిమంచానికి కొద్దిదూరంలో వాలుకుర్చీ ఒకటివేశారు. దానిమీద అతను చాలాకా లం-కాదు, పదిరోజులూ గడిపాడు. రెండురోజులు ఇంట్లోనే స్నానానికి ఏర్పాటుచేశారు. మూడోరోజు నుండి ఊరిబయటనున్నపొలంలో నున్నబావికి పోయిస్నానంచేసివచ్చేవాడు. భోజనానికి ఏమీలోటు లేదు. అయిదురోజులవరకు ఇంటివాళ్ళు ఏమిపె ట్టారో, తాను ఏమితిన్నాడో అతనికి జ్ఞాపకంలేదు.

తల్లికి పిల్లాడికి బాగున్న తరువాత అతను ఈ లోకంలో పడ్డాడు. అన్నిటికన్న అతనిని ఒకదృశ్యం ఆకర్షించింది. పురిటాలికి సహాయంచేయడానికి నాయుడుగారి మేనకోడలు సింగమ్మనునియో గించారు. గదిలో డాక్టరుగోపీకృష్ణ, సింగమ్మ, పురిటా లు, శిశువు- వారేముఖ్యంగా కనిపిస్తారు. ఇరవైనా లుగుగంటలు గోపీకృష్ణ, సింగమ్మ ఆగదిలోనే ఉండే వారు.

మొదట ఏడురోజులు డాక్టరుగారికి నిద్రఅవున రమని, అతనికోమంచం, పక్క అవుసరమని ఎవరి కి తోచలేదు. అతనుప్రతిమూడుగంటలకు మందు లివ్వడమో, ఇంజక్షన్లు చేయడమో, టెంపరేచరుతీ సుకోడమో చేస్తూఉంటే, అతనికి నిద్రకావాలని ఎవ రూ అనుకోలేదు. ఒకటిరెండుసార్లు సీతంనాయు

 

ఏర్పాటులు చేయొద్దన్నాడు. వాలుకుర్చీలో కూర్చొని, విశ్రాంతి తీసుకొంటూ, వైద్యంచేయకతప్ప దని చెప్పాడు.

డాక్టరుగారితోపాటు సింగమ్మకు కూడా విశ్రాంతి తీసుకొనే అవకాశాలు తక్కువయ్యాయి. ఆమెపూరి టాలికి సేవచేయడమేకాకుండా, డాక్టరుగారిసేవకు కూడా నియోగించబడింది. డాక్టరుగారికి భోజనం, కాఫీ, టిఫిన్ అవన్నీ ఆమెతెచ్చియిచ్చేది. ఏదికావ లసినా సింగమ్మనుపిలిచి చెప్పడంగోపీకి తప్పని సరి అయింది. ఆవిధంగా వాళ్ళిద్దరూ అయిదురో జులు కలిసి పనిచేసిన తరువాత చాలసన్నిహితు లయారు. మందులివ్వడానికి డాక్టరెంత అవస రమో, రోగిసేవ, కాదు కాదు- ఇద్దరురోగులసేవకు సింగమ్మ అంత అవసరమనిపించింది.

సింగమ్మకు పద్దెనిమిదేళ్లుంటాయి. ఏ కారణం చేతనో పెళ్లికాలేదు. ఆమె అంత అందమయినది కాదు. కానీ పల్లెటూరి వాతావరణంలో పుట్టిపెరి గిందేమో, మనిషిలో అవయవ సౌష్ఠవం కొట్టొచ్చిన ట్లు కనపడుతుంది. రవికలు తొడుక్కోడం, బాడీలు వేసుకోడం ఆమెచేయడంలేదు. కాళ్లకు కడియాలు, చేతులకు మురుగులు, కొప్పుపెట్టుకున్న పొడుగాటి జుట్టు, ఇవన్నీ ఆమెను నూటికి నూరుపాళ్లు పల్లె టూరి పిల్ల అని చెప్తాయి. కొత్తలో డాక్టరుగారి దగ్గర బిడియపడ్డా, అయిదో రోజుసరికి ఆమె అతనికి కుడిచేయిగా వ్యవహరించింది.

పనిచేసినంతసేపు పనిచేసి, గదిలో గోడపక్కన చాపవేసుకొని సింగమ్మపడుకొనేది. పిలవగానే ఎంతనిద్రలోనున్నాలేచి, విసుక్కోకుండా పనిచే సేది. బాగా శిక్షణపొందిన నర్సులా ఆమె పనిచేసేది.

ఏడోరోజు ఉదయం ఆరుగంటలయింది. సూర్యో దయమింకా కాలేదు. కాని గదిలోకి బాగావెలుతురు వచ్చింది. సింగమ్మప్రతిరోజూ ఉదయంఆరుగా కుండా కాల్యాలు తీర్చుకుని స్నానంచేసి వచ్చేది ప్రతిదినానికిమల్లే ఆరోజుకూడా స్నానం పూర్తిచేసి, తడిచీరవిడిచి పొడిచీర కట్టుకోబోతుంటే డాక్టరు గోపీకృష్ణ సింగమ్మ కోసం పిలుస్తూ ఆమెవేపు చూసి స్థాణువైపోయాడు.

పంచవన్నెల బొమ్మలా నున్నగానున్న ఆమె శరీరం, స్నానం చేసిన తరువాత చిన్నచిన్న నీటిబొట్లతో నిండి, ఉదయిస్తున్న సూర్యుడికాంతిపడి ఆమె వీనస్‌లా కనిపించింది.

"సింగ..." అంతవరకే అతని పిలుపు సాగింది.

యాడు.

సింగమ్మడాక్టరువేపుతిరిగి చిన్నినవ్వుతో పొడిచీర కట్టుకోవడం పూర్తిచేసింది. తలకు పొడిగుడ్డ చుట్టు కొని, మదగజానికిమల్లే అడుగులు వేసుకుంటూ అతనివేపు వచ్చింది.

వీనస్‌లా ఉన్న ఆమెను చూసినప్పుడు అతనిశ రీరంలో హైవోల్టేజీ కరెంటు పాసయినట్లయింది. అతనిలో ఉద్రిక్తత నెలకొంది. అతని మనోఫల కంమీద లోతుగాచెక్కిన ఆబొమ్మ అన్నితలపులను తుడిచిపెట్టింది.

రోగికి సేవజేసేప్పుడు వంగితే ఆమె వక్షం తనభుజాలకు తాకినప్పుడు, ఆమె నవ్వుతూ తనవే పుచూస్తున్నపుడు అతనిమనసు వికావికలై పోలేదా నాడూ! మరి...?

అప్పుడే తనలోగొప్పమార్పు కలిగినట్లు గోపీకృష్ణ నిశ్చయానికి వచ్చాడు.

తనలో మగతనంమేలుకొంది.

గోనెలపాడులో తననువిడిచిపెట్టిన సంపద తా నుగా వెతుక్కుంటూ వచ్చింది.

డాక్టరు గోపీకృష్ణ వెంటనే ఈపరిణామానికి అర్థంచెప్పుకోలేకపోయాడు.

మృదువైన సింగమ్మచేతులు తగిలినప్పుడు, ఆమె తననుసమీపించినపుడు, మీదకువంగితే వక్షం తన శరీరంమీదకు ఆనినపుడు అతనిలో కోరిక వెల్లువై పారుతోందిప్పుడు.

సీతంనాయుడుగారు చాల మర్యాదస్తులు. వారి అమ్మాయికి వైద్యం చేయడానికివచ్చి, తప్పుదారు లు తొక్కడం చాలపొరపాటు. తనలో మగతనం పునరుజ్జీవనం అవడానికి సింగమ్మహేతువు. అంత వరకే ఆమెకు ప్రాముఖ్యత. ఇంతవరకు అతను పెద్దమనిషిగా వ్యవహరించాడు. ఆ యింట్లోంచి ఆగౌరవంతోనే వెళ్లిపోవాలి. అందుకే అతడు ఏడో రోజు సాయంకాలమే గోనెలపాడు తిరిగిపోతానన్నా డు కాని. సీతంనాయుడుగారే ఒప్పుకోలేదు. బల వంతంచేసి మరోమూడురోజులుంచారు.

ఎనిమిదోరోజు ఉదయంగోపీకృష్ణఊరిబయటపొ లాల్లో ఉన్నబావిదగ్గర స్నానంచేస్తున్నపుడు అతనికో సంగతి తట్టింది.

డాక్టరుగారికి పెళ్లుతోడిపోయ్యడానికి రోజూ ఒకపు [illegible] రోజూపోసినట్లు, గట్టుకి కొంచెందూ [illegible] గోపీకృష్ణ తలమీంచి పోస్తున్న [illegible] [illegible] బిడియపడుతుంది [illegible] [illegible] అప్పుడే [illegible] తగిపోయింది



గోనెలపాడు నూతినీరు తాను రమారమి ఎనిమి దినెలలుగా తాగుతున్నాడు. పట్టణంలో పంపునీటి వలె క్లోరిన్‌వాసనవేస్తుంటుంది. విశాఖపట్నంలో పంపునీళ్ళు తాగడానికి అలవాటుపడి, నూతినీళ్ళు తాగినప్పుడుకూడా పంపునీళ్ళే తాగుతున్నట్లుగా అనిపించేది. ఒకనాడుకూడా కొంచెమైనా అను మానం కలుగలేదు.

నూతినీటిలో ప్రత్యేకంగా పల్లెటూళ్ళలోఉన్ననూ తులలో, క్లోరిన్ వాసన ఎలావస్తుంది. ఆనీరు స్వ చ్ఛంగా రామన్నపేట నూతినీటివలె ఉండాలిగదా!

సీతంనాయుడు గారి మనిషి బాల్టీ మీద బాల్టీ తలమీద పోస్తున్నాడు. మరి ఈవూరి నీటిమహాత్మే మిటి?

సింగమ్మ జ్ఞాపకంవచ్చింది- ఆమెశరీరంజ్ఞా పకం వచ్చింది. మీదనుండి చల్లనినీళ్లుపడుతున్నా కామంకలుగుతుంది. ఇదంతా సెక్సు హార్మోనుల పని. అవన్నీ సవ్యంగాతనశరీరంలో పనిచేస్తున్నవి. మెదడునుంచి సంకేతాలు-గ్రంథుల నుండిహార్మో నులు ప్రత్యేకస్థానాలకు ప్రవహించి పురుషుడిని సంయోగానికి ఆయత్తంచేస్తున్నవి. దెబ్బతిన్న 'ఈ హార్మోనుల సంచార కార్యక్రమం తిరిగి తనలో ఉద్ధరణ జరిగింది.

ఓగాడ్! అయామ్ రెస్టోర్డు టు మాన్‌హుడ్!! ఒక్కసారి గోపీకృష్ణలేచినిలబడ్డాడు. సబ్బురుద్దుకోలే దు. ఒళ్ళు తోముకోలేదు. తువాలుతో తలతుడుచు కొని బట్టలుమార్చుకొన్నాడు.

సెకండరీ ఇంపొటెన్సులో ఒక సుగుణముంది. తాను కోరిన స్త్రీ దగ్గరికి పోయినప్పుడే ఇదికన్పి స్తుంది. ఉదయంపూట ఏదో కాముకమైన సంఘ టన గురించి ఆలోచిస్తుంటే ఉద్రేకం సహజంగా కలుగుతుంది. కాని, గోనెలపాడులో ఇటువంటి సు గుణంకూడా కనిపించలేదు. ఈ పరిస్థితులు మరో రెండుమూడేళ్ళు కొనసాగితే పురుషులందరూ సె కండరీ స్టేజినుండి, ప్రైమరీ స్టేజ్ ఆఫ్ ఇంపొటె న్సుకి చేరుకుంటారు.

ఆమాట తలుచుకుంటే అతనికి భయంపుట్టుకొ చ్చింది. గోనెలపాడులో వున్నసంసారాలన్నీ ఛిన్నాభి న్నమయి మట్టికొట్టుకు పోతాయి. మగాళ్లంతా సినిక్ లుగా, ఆడవాళ్లంతా నింఫోమానియక్‌లుగా తయా రయి సాంసారికజీవితం అవహేళన పాలవుతుంది.

కారణం కొంతవరకు తెలిసింది.

గోనెలపాడులో ప్రజలు తమవూరిబావి నీళ్ళుతా గడంమానేసి, మరోఊరి నూతినీళ్లుకాని, ఏటినీళ్ళు కాని, చెరువునీళ్లుకాని, మునిసిపల్‌పంపునీరుకాని తాగితే, గ్రామంతిరిగి మామూలు పరిస్థితికి వస్తుంది.

వచ్చిన చిక్కంతా అక్కడేవుంది.

గోనెలపాడుగ్రామం కొంచెంఎత్తులో ఉంది. రామ న్నపేటపల్లంలో ఉంది. అందుకే అక్కడ తొందరగా నీళ్ళుపడేబావులు, పల్లపుపంటలు, కాయగూరలు, తోటలు అన్నీ ఉన్నాయి. చాలాకాలం, అంటే శతాబ్దాలుగా గోనెలపాడుగ్రామస్థులు నానాశ్రమలు పడి రామన్నపేటనుండో, మరోచోటినుండో నీళ్లు బళ్లలో అండాలు నింపుకొని తెచ్చుకొనేవారు.

ఇంతనీటి ఎద్దడిఉన్న చోట మనుషులెందుకు కాపురాలుంటున్నారు?

గోనెలపాడుచుట్టూ వెదురుపొదలున్నాయి. వెదు ళ్లవ్యాపారంలో అవూరి వాళ్లు చాలాలాభాలు గడించారు. ఆరేళ్లకింద ఉత్తరాంధ్ర పేపరుమిల్స్ నెలకొల్పడంతో గోనెలపాడుకి మరీప్రాముఖ్యత వచ్చింది. మిల్సుకి కావల్సిన వెదుళ్లలో అయిదో వంతు గోనెలపాడుగ్రామంవాళ్ళే సప్లయిచేస్తారు. అంటే ఈఅయిదారు సంవత్సరాలలో ఈగ్రామం మరీ గొప్పదయిపోయింది. అయిదేళ్లక్రింద కరెంటురావడం, నాలుగున్నర ఏళ్లకింద పదిహేన డుగుల వ్యాసమున్న బావి తవ్వించడం, వీటితో గోనెలపాడు చరిత్రే మారిపోయి అది సంపన్నగ్రా మాలలో ఒకటయింది. గోనెలపాడు బావి తవ్వించడానికి ప్రభుత్వం చాలఖర్చుపెట్టింది.

రాతినేలలో నూయితవ్వడం చాలకష్టమయింది. బ్లాస్టింగ్‌చేశారు. చాలశ్రమలుపడితే నలభై అడు గుల లోతులో నీరుపడింది. నూయి తవ్వించిన మొదటిసంవత్సరం వేసవిలో నీటికి కొంచెం ఇబ్బందయింది. రెండవసంవత్సరం ఎండాకాలాని కి ముందే నూయి ఎండిపోవడం, టాంకులతో కంట్రాక్టరు అప్పలస్వామి నీరుసరఫరాచెయ్యడం, తిరిగిమరో ఇరవై అడుగులు రాతిని తవ్వడం జరిగింది. అప్పుడు పెద్ద జలపడి గోనెలపాడు గ్రామస్థుల యిబ్బందులన్నీ తీరిపోయాయి.

నూయి, తొలిసారి తవ్వడానికి లక్షరూపాయలు, నాలుగునెలలు రామన్నపేటనుంచి టాంకులతో నీరుసరఫరాచేసినందుకు మూడులక్షలరూపాయ లు, తిరిగి నూతిని మరో యిరవై అడుగులలోతు తవ్వినందుకు మరో లక్ష ఈవిధంగా కంట్రాక్టరు అప్పలస్వామి అయిదులక్షల రూపాయలవనిచేశా డు. ఇప్పుడు గ్రామంప్రజలతోగాని, ప్రభుత్వంతో గాని ఈనీళ్ళుఉపయోగించరాదంటే ఎవరూవినరు. చెప్పినవాడికి మతిపోయిందంటారు. ఈనూయిత



వ్విన ఘనుడు కంట్రాక్టరు అప్పలస్వామి మాత్రంగో నెలపాడులో ఉండడంలేదు. అతను చక్కగా రామన్నపేటలో రెండంతస్థుల పెద్దమేడ కట్టించి హాయిగా ఇద్దరు భార్యలతో ఉంటున్నాడు. అతనికుడిభుజమైన మేస్త్రీరామిరెడ్డి అంతకన్నహాయిగా ఆవూరిలోనే ఉంటున్నాడు. వారికి ఏవిధమైన యిబ్బందులులేవు.

ఎవరేమన్నా- గోనెలపాడు బావినీటిని ఎవరూతాగకుండా చెయ్యాలి. ఈప్రయత్నానికి తనకు సహాయం ఎవరునిలుస్తారు?

డాక్టరునిర్మల ఏవిషయం తొందరగా నమ్మదు. ఆమెకు నచ్చచెప్పేసరికి తనకుఉద్యాసన చేస్తూ ఆర్డర్లు వస్తాయి. ఈసరికి మినిస్టరుగారి నుండి జవాబు రాలేదని శ్రీనరసింహారావు పంతులుగారు, అతని శిష్యకోటి తహతహలాడు తుంటారు.

చేస్తే తనే ఏవనేనా చెయ్యాలి.

లేకపోతే?

గోనెలపాడుగ్రామం వారిని దేవుడే రక్షించుగాక!

ఈ నిర్ణయానికి వచ్చిం తరువాత పదోనాడు సాయంకాలం గోపీకృష్ణ రామన్నపేట విడిచి పెట్టాడు.

సీతంనాయుడుగారు వెయ్యినూటపదహార్లు ఇచ్చారు. గోపీకృష్ణతీసుకోలేదు.

పంచలచాపులుపెట్టారు. వాటినీ అతను తీసుకోలేదు.

"మీ రామన్నపేట నాకు చాలఉపకారంచేసింది. నేనువడిన శ్రమకు ఫలితందక్కింది. అమ్మాయి,



మనవడు బతికి బయటపడ్డారు. మీరు కన్నతండ్రి కంటె ఆప్యాయంగా ఆదరించారు. మీశ్రీమతి సరే సరి. సింగమ్మ, కంబారులు అందరూ ఎంతోనాకు తోడ్పడ్డారు. నేనుడాక్టర్ని. డబ్బుగడించడం కాదు నావృత్తి. ఏప్రాణాన్ని రక్షించినా అదేనాకు వదివేలు. మీవంటి మంచివారు నాకు స్నేహితులని చెప్పుకో డమే నాకు గర్వకారణం.''

సీతంనాయుడుగారు ఈమాటలువిని అమాంతంగా గోపీకృష్ణను కౌగిలించుకున్నారు.

ఆనందంతో అతనికళ్లవెంబడి భాష్పజలం కారు తుంటే ఆయన అన్నారు.

''డాక్టరుగారు! మామనవడికి గోపీకృష్ణ అని పేరుపెడతాను. మీవంటి డాక్టరుగా వాడిని తీర్చడా నికి ప్రయత్నిస్తాను. మిమ్మల్ని మేం ఎప్పుడూ మరచిపోలేము''



# 7

గోపీకృష్ణ గొనెలపాడు డిస్పెన్సరీ చేరేసరికి సాయంకాలం అరుదాటింది. చలికాలం వస్తుంటే డిస్పెన్సరీ వేళల్లో మార్పులు చేశారు. మధ్యా హ్నంవేళ మూడునుంచి అయిదువరకు తెరిచేవా ళ్లు. ఫకీరు, నరసమ్మ ఇళ్లకు వెళ్లి పోయారు.

సూట్‌కేస్ చాలా తేలికగా పట్టుకొని గోపీకృష్ణ రెండెడ్ల బండి నుండి కిందికి దూకాడు. అతని హృదయం చెప్పలేని ఆనందంతో నిండిపోయి ఉంది.

గోపీకృష్ణ రాగానే నిర్మలను కలిశాడు. ప్రతిరోజు రామన్నపేట వార్తలు ఆమెకు చేరుతున్నాయి. ఆమె పూర్తిగా తన స్త్రీరోగుల పునర్వ్యవస్థీకరణ గురించి తాపత్రయపడుతున్నది. పుస్తకాలు చదువు తోంది. పాశ్చాత్య దేశాలలో దంపతుల కిచ్చే సలహా లను మన ప్రజలకనుగుణంగా మార్చుతున్నది. ఏ ఒక్క వనిత అయినా తనసంసారం కుదుటబ డింపని చెప్పే తన శ్రమఫలిస్తుందని ఆమె భావించింది.

కాని, ఆమెకు శ్రమే మిగిలింది.

చీకటి పడుతుండే సమయానికి వెంకట్రావు వచ్చాడు. అప్పటికి గోపీకృష్ణ తనగదిలోనే ఉన్నాడు. అతడు రామన్నపేటనుండి తిరిగి వస్తున్నప్పుడు దారిలో తాను రోజూ స్నానం చేస్తున్న నూతిదగ్గిర బండి ఆపించి, కడుపునిండా చల్లని నూతినీరు తాగి, తనతో తెచ్చిన వాటర్‌బాటిల్‌లో పూర్తిగా నింపాడు. గొనెలపాడు చేరి తనగదిలో సామానుపె ట్టిన వెంటనే, ఆనీటిని పదిలంగా ఒక పెద్దసీసాలోకి బదిలీ చేశాడు. ఇది అతడు కనుగొన్న అమృతం- ఎరిక్జర్.

''డాక్టర్‌గారు! మీకోసం వేయికళ్లు పెట్టుకొని ప్రతిరోజు ఎదురుచూస్తున్నాను. మీరు రామన్నపేట వెళ్లి పూర్తిగా మారిపోయారు. మీచేతిచలవ గురించి గ్రామంలో వింతవింత వార్తలు వస్తున్నవి. అవి అన్నీ నిజమేనా?''

''నిజమోకాదో నాకు తెలీదు. చికిత్సచేసినవారు బతికి బయటపడ్డారు.''

''మీకో రహస్యం చెప్పాలని వచ్చాను. సీతంనా యుడుగారమ్మాయి పురుడయేముందర వాళ్ల పెద్ద మ్మవచ్చి మా కౌస్తుభం మామ దగ్గిర అనాసా ముదం, మాతాశిశుసంజీవని, ఇంకా మరికొన్ని మందులు కొనుక్కొని వెళ్లింది. పురుడురాక ముందు, పురుడు వచ్చిన తరువాత వాటిని ఏవి ధంగా వాడాలో అతను చెప్పాడు. కాని, ఆముసలా విడ ఏమివిందో- ఏమందు ముందు వేయాలో, ఏది తరువాత వేయాలో ఆమెమరచి పోయింది. ఆమందు ఏమందువాడిందో- తల్లికి పిల్లడికి చచ్చి నంత పని చేసింది.''

డాక్టరు గోపీకృష్ణ వింటున్నాడు. అతని కాముస లామె మీద కోపం లేదు. పల్లెటూళ్లలో పరిస్థితులు ఇంతకన్నా మెరుగుగాలేవు.

'' ఆపెద్దావిడ పురిటి తరువాత వచ్చి తానువా డిన మందులకు విరుగుడు చెప్పమంటే మా కౌస్తుభంమామ ఏమందూ ఇవ్వడంమానేశాడు. తల్లీ, పిల్లడు చచ్చిపోతారన్నాడు. ధనుర్వాతమన్నా డు. ఈ మంచిమర్యాద ఇంగ్లీషు డాక్టరుకు దక్కని మ్మన్నాడు. అప్పుడే మీకు కబురు వచ్చింది.'' అన్నాడు వెంకట్రావు మళ్లీ.

'' పోనీ, ఇప్పుడేనా మీమామ హాయిగా ఉన్నా డా?''

'' అదే అసలు వినవలసిన సంగతి. ఏ రోజ యితే సీతంనాయుడు గారి కూతురు, మనుమడు బతుకుముఖం పట్టారని విన్నాడో, ఆ రోజు తన ప్రాక్టీసల్లా మీరుదోచుకున్నట్లు ఏడ్చాడు. వాళ్లిద్దరూ

వచ్చిపోయి, ఊరి వాళ్లు మిమ్మల్ని నిందిస్తుంటే విని ఆనందించాలనుకున్నాడు. మీ కీర్తి నలుమూలలా వ్యాపిస్తుంటే మరి ఓర్చుకోలేకపోయాడు. మొన్ననే మానాన్నగారికి వేయిరూపాయలిచ్చాడు. గొనెలపాడు గ్రామంలోకల సంసారుల పడకటింటి రహస్యాలను మీరిద్దరు బట్టబయలు చేసి మగాళ్లను తలెత్తుకొని తిరగనీయకుండా చేస్తున్నారని వెంటనే మీయిద్దరినీ ఇక్కడినుండి తీసివేయవలసిందని ముఖ్యమంత్రిగారికి, గౌరవనీయులైన ఆరోగ్యశాఖ మంత్రిగారికి అర్జీలు వ్రాసి, టెలిగ్రాములు పంపడానికి, ఊరిలోని పురుషులందరి దగ్గరా సంతకాలు తీసుకోవడానికి ఆడబ్బును వినియోగించమని మానాన్నగారితో చెప్పాడు.''

'' అయితే టెలిగ్రాములు పంపలేదా? ''

'' లేదు. ఇవాళ బుధవారం. రేపు గురువారం. ఎల్లుండి పంపిస్తారు. అంటే సోమవారానికి ముఖ్యమంత్రిగారికి పుటప్ చేస్తారు. ''

'' మీనాన్నగారికి దీనివలన లాభముందా? ''

'' ఈ పనిమానాన్నగారు సాధిస్తే, తప్పకుండా తనకూతురు రంగనాయకిని నాకిచ్చి పెళ్లి చేస్తానన్నాడు కౌస్తుభం మామ. ''

'' మీనాన్న గారు ఒప్పుకున్నారన్న మాట? ''

'' ఆయన తటపటాయించారు. మాఅమ్మతో ఆలోచించారు. బడిపంతులుగా భర్త బతుకు గణన కెక్కకపోయినా, కనీసం ఉన్న ఒక్కకొడుకు మంచి ఆస్తితో వస్తున్న అమ్మాయిని పెళ్లి చేసుకోవాలని ఆమె కోరింది. ''

'' మరి, నువ్వేం కోరుకున్నావు? ''

'' నేను నిజంగా రంగనాయకిని ప్రేమిస్తున్నాను. నాకు డబ్బొవద్దు, దస్కం వద్దు. ''

'' రంగనాయకి ఏమంటోంది? ''

'' అదే వచ్చిన చిక్కల్లా. వెంకట్రావు వట్టి మొగతనం లేని వెధవ- వాడిని నేను చేసుకోనని నిక్కచ్చిగా వాళ్లమ్మతో చెప్పింది. ''

గోపీకృష్ణ నవ్వుకున్నాడు.

'' డాక్టరుగారు! రేపు ఉదయం వస్తాను. ఇద్దరం ఉత్తరాంధ్ర పేపరు మిల్లుకు పోదాం. మాచుట్టమొకాయన పి.ఆర్.ఒగా ఉన్నాడు. మిమ్మల్ని తీసుకురమ్మని చాలసార్లు అన్నాడు. ''

'' అలాగే! పొద్దున్న ఎనిమిదిన్నరకు తయారయి ఉంటాను. ''

ఆరాత్రికి గోపీకృష్ణ కారియర్‌లో వచ్చిన భోజనం ముట్టుకోలేదు.

సీతంనాయుడుగారు మిఠాయి యిచ్చారు. అది కొంచెంతిని, రామన్నపేట నూతినీళ్లు కడుపారతాగాడు. గొనెలపాడులో ఉండడం తప్పకపోయినా, శాపగ్రస్తమయిన ఆవూరి నూతినీళ్లు తాగనని శపథం చేశాడు.

★ ★ ★

ఉత్తరాంధ్ర పేపర్ మిల్లు గొనెలపాడుకు నాలుగు కిలోమీటర్ల దూరంలో ఉంది. కాకి ఎగిరే మార్గంలోనయితే మూడు కిలోమీటర్లే ఉంటుంది. బండిదారి వెదురు పొదలనుచుట్టి ఉంది. అది తిన్నగా పేపరు మిల్లు టౌన్‌షిప్‌కు తీసుకుపోతుంది.

టౌన్‌షిప్ చాలా ఆధునికమైనది. అక్కడ ఆఫీసర్ల ఇళ్లన్నీ కంట్రాక్టరు అప్పలస్వామి కట్టినవే. అవికాక మిల్లులో చాలాకట్టడాలు అతనే నిర్మించాడు.

కంట్రాక్టరు అప్పలస్వామంటే విజయానికి మారుపేరన్నమాట. ఎంతశ్రమకు ఓర్చి అయినా, రేట్లు ఇటూ అటూఉన్నా అన్న వేళకు అతను పనిపూర్తి చేస్తాడు. ఆవిధంగా అతను పేరు సంపాదించుకోడమేకాక డబ్బు కూడా చేసుకుంటున్నాడు. అతను పట్టు బట్టి పనిచేశాడు కాబట్టే పేపరుమిల్లు చాలతొందరగా తయారయ్యాయని అంటారు.

టౌన్‌షిప్ నుండి నేషనల్ హైవేకు పక్కా గట్టుంది. దానిమీదే లారీలలో పేపరు రవాణా అవుతుంది.

ఆరోజు అక్కడికి బయలుదేరాలని డాక్టరు గోపీకృష్ణ ఉదయమే లేచాడు. కాల్యాలు తీర్చుకున్నాడు. భుజాలకు ఇటోవాటర్ కాన్, అటొకటి తగిలించుకొని మూడు కిలోమీటర్లు మార్నింగ్ వాక్ చేసి రామన్నపేట పొలాలలో నున్న నూతికిపోయి స్నానంచేసి, కడుపార నీళ్లుతాగి, రెండు వాటర్‌కానలలో పదిలీటర్ల నీటిని నింపి, వచ్చినంత వేగంగా ఇంటికి తిరిగొచ్చాడు. ఈ విధంగా గొనెలపాడులోనున్న మిగిలిన రోజులు గడపాలని అతను ఒక నిర్ణయానికి వచ్చాడు. ఆ నీరే తాగడానికి నిశ్చయించాడు. వంటకు ఏంచేయాలో ఆలోచించలేదు.

ఉదయం ఎనిమిది గంటలయింది. పేషెంట్లు వస్తున్నారు. వారిని పదిరోజులయి డాక్టరు నిర్మలే చూచుకుంటున్నది. ఇక మీదట కూడా ఆమే చూస్తుంది. మిగిలినపని తనది.

సరిగ్గా తొమ్మిది గంటలకు వెంకట్రావు వచ్చాడు. ఇద్దరూ బండిదారిని, వెదురు పొదలకు కొంచెం దూరంలో నడవడం మొదలుపెట్టారు. అప్పటికే ఎండముదిరింది. దారిలో తోటలుకాని, పొలాలుకాని

లేవు. ఆ వెదురు పొదలు పేపరుమిల్లు గోనెలపా డు వాళ్లకు కనిపించకుండా అడ్డం నిలబడ్డాయి.

నాలుగు కిలోమీటర్లు నడిచిన తరువాత ఇద్దరూ టౌన్‌షిప్ చేరుకున్నారు. అక్కడ నుండి పేపరుమి ల్లు అడ్మినిస్ట్రేటివ్ ఆఫీసువరకు ఒక కిలోమీటరు నడిచి వచ్చారు. గేటు దగ్గర సెక్యూరిటీ ఆఫీ సుంది. అక్కడనుండి వెంకట్రావు టెలిఫోను చేశా డు తమచుట్టానికి. అతను సీటులో లేడని, పదిని మిషాలలో రావచ్చని అతని పి.ఎ. చెప్పాడు.

ఒక్క పావుగంటలో ఆ పబ్లిక్ రిలేషన్ ఆఫీసరు వచ్చాడు. అతని పేరు మధుసూదన్. అతను పాతికేళ్లవాడు. కొంచెం సన్నగా పొడుగ్గా ఉంటాడు. జుత్తు వెనక్కు దువ్వు కుంటాడు. కళ్లకు చలవజో డు. టిప్‌టాప్‌గా సూటు వేసుకొని, టైకట్టుకొని, కారు వేసుకొచ్చాడు.

కరచాలనాలయిన తరువాత గోపీని, వెంకట్రా వుని ముందు అడ్మినిస్ట్రేటివ్ ఆఫీసులో నాలుగో అంతస్తులోనున్న తన ఛాంబరుకి తీసుకుపోయాడు. అక్కడ వాళ్లకు టీ, స్నాక్స్ ఇచ్చి, కిందికిదిగి, భవనం రిసెప్షనిస్టుకు ఎదురుగా గాజుతలుపుల షోకేస్‌లో నున్న ఉత్తరాంధ్రపేపరు మిల్లు మోడలు చూపించాడు.

" డాక్టరుగారు! ఏ కాగితం పరిశ్రమకైనా కర్రగు జ్జు ముఖ్యం. ఇక్కడ మనం ఉపయోగించేది కర్ర, వెదురు. బోటనీ ప్రకారం వెదురు ఒక రకం గడ్డిజా తికి చెందుతుంది. వెదురు గట్టిగానే ఉంటుంది. మామూలు గడ్డికన్నా పొడవుగానే ఉంటుంది. సాంద్రతలోను, గట్టిదనంలోను కర్రను పోలి వుంటుంది. అయినా దీనిని గడ్డిజాతికి చెందినదనే చెప్తారు. వెదురు మనం దేశంలోను, థాయిలాండ్‌లో ను, ఫిలిప్పీన్సులోను కాగితం తయారీకి ఉపయోగి స్తారు. "

వెంకట్రావు, గోపీ అతని వెంట నడుస్తున్నారు.

త్వరలో పల్పు గ్రైండర్లు వచ్చాయి.

అక్కడ, తిరుగుతున్న సానరాతిమీదికి చాల హెచ్చు ఒత్తిడితో వెదురు ముక్కలను పంపి, వాటిని నారగా తయారు చేస్తున్నారు. ఆ నారను సరియైన సైజులకు కోస్తున్నారు.

కొంతభాగం గుజ్జు రసాయనిక పద్ధతిలో తయా రు చేస్తున్నారు. రసాయనిక ద్రావణాలలో చిన్న వెదురుముక్కలను వండుతారు. వాటిని డైజెస్టర్లు అంటారు. చాల హెచ్చు టెంపరేచరు, ప్రెషరు ఈ వంటకు అవసరం. కర్రలో నార కాక, వేరేభాగం, లిగ్నిన్ అన్నది - ఈ రసాయనిక ద్రావణంలో కరిగిపోతుంది. నారపోగులు పూర్తిగా వేరవుతవి. తరువాత బ్లీచింగ్ జరుగుతుంది. రసాయనిక పద్ధ తిలో సల్ఫేట్‌క్షారాలు, సల్ఫర్‌డైయాక్సైడ్ హెచ్చుగా నున్నవి, ఉపయోగిస్తారు.

కాస్టిక్ సోడా, సోడియం సల్ఫైడ్ క్రాఫ్ట్‌పద్ధతికి ఉపయోగిస్తారు.

ఈ రసాయనచర్య డైజెస్టర్లలో గల వేరువేరు గదులలో జరుగుతుంది. ఈ డైజెస్టర్లు స్తంభాకా రంలో ఉండి, రెండు వందల అడుగుల ఎత్తువ రకు ఉంటాయి. వీటిలో గుజ్జును వండుతారు. రసాయనాలలో ముంచుతారు. కొన్ని దేశాలలో ఆరు వందల టన్నుల గుజ్జువరకు ఒక డైజెస్టరులో ఇరవైనాలుగు గంటలలో తయారవుతుంది.

తరువాత కాగితం తయారుచేయవలసిన గుజ్జు ను ఒక నేతజల్లెడమీద చాపవలె విస్తరించుతారు. దానినుండి నీరు కారిపోతుంది. తడిగానున్న ఆ షీటును ఒత్తి, కుద్దరంగా చేసి చాలమట్టుకు నీరు పిండేస్తారు. మిగిలిన తడిని ఆరబెడతారు. అవసరా లను బట్టి పేపరు షీటును ఇంకాకుదించి, దాని పైన పూతపూసి, లేక రసాయనంలో తడిపి మనకు పనికొచ్చే కాగితంగా రూపొందిస్తారు.

ఛిప్పర్లు, డైజెస్టర్లు, పల్పువాషర్లు, రికవరీఫ ర్నేస్, స్టీమ్‌హీటర్లు, ఎవాపరేటర్లు- వీటన్నిటినీ చూపించి, వెదురు ముక్కల దశనుండి కాగితం పూర్తిగా తయారయిన దశవరకు చూపించాడు మధుసూదన్.

అప్పటికి ఒంటిగంట అయింది.

" మిస్టర్ మధుసూదన్! థాంక్స్! మీరు చాల శ్రమ తీసుకొని మిల్లు చూపించారు. మేమిక వెళ్లిపో తాము " అన్నాడు గోపీ అతనితో.

" డాక్టరుగారు! మీరు ఇంకా చూడవలసిన ముఖ్యమైన భాగమొకటి ఉంది. మనకు గెస్టుహౌ సులో లంచ్ ఆర్డరు చేశాను. లంచ్ అయిన తరువాత ఒకగంట రెస్టు తీసుకొని మీరు సిద్ధంగా ఉంటే వాటర్ రీసైకిలింగ్ సిస్టమ్ చూపిస్తాను. చాల ఇంటరెస్టింగ్‌గా ఉంటుంది. " అన్నాడు పి.ఆర్.ఒ

గోపీకృష్ణ వెంకట్రావు ముఖంలోకి చూచాడు. ఈ ఆహ్వానం కోసమే ఎదురుచూస్తున్న కుర్రాడు ఎగిరి గంతేశాడు. వాళ్లు ముగ్గురూ ఊరికికొంచెం దూ రంలో ఎత్తుమీదనున్న గెస్టు హౌసుకు వెళ్లారు.

వాళ్లు మధ్యాహ్నం తిరిగి మూడుగంటలకు బయలుదేరారు.

" డాక్టర్ గోపీకృష్ణ! ఈ కాగితం పరిశ్రమకు చాలా నీరుకావాలి. ఒకటన్ను పేపరు తయారుచేయడానికి ఒకలక్షగాలన్ల మంచినీరు అవసరమవుతుంది.

కాగితం తయారీకి ఉపయోగించే కర్రలో ఏభై శాతం పనికిరాని నీటితోకలిసి కాలువలగుండా పోతుంది. ఈ కర్రను తిరిగి రాబట్టడానికి, ఈ నీటిని ట్రీట్‌మెంటు చేయాలి. ఈ విధంగా చేస్తే ఎందుకూ పనికిరాకుం.~ పైకి పోయేనీరు ఆదా అవుతుంది. పరిశుభ్రంగా తయారయి తిరిగి పరిశ్రమలో వాషింగ్‌కు, కూలింగ్ టవర్సులో ఉపయోగించడానికి, మిగిలిన నీరు వ్యవసాయానికి పనికొస్తుంది. మురికి నీటిని పరిశుభ్రంచేసి, తిరిగి ఉపయోగించడాన్ని రీసైకిలింగ్ అంటారు. '' అన్నాడు మధుసూదన్- కారులో

తరువాత వాళ్లను మిల్లువెనుక భాగంలో కొంచెం ఎడంగానున్న వాటర్ ట్రీట్‌మెంట్ ప్లాంట్ వేపు తీసుకొని పోయాడు.

మురికి నీటిలో తేలిపోతున్న ఘనపదార్థాలను ఆటంకపరచి వేరుచేయడానికి సెడిమెంటేషన్ టాంకులున్నాయి. నీరుతోడడానికి రోటరీ పంపులు. - క్లోరిన్ ట్రీట్‌మెంట్- గాలి పారడానికి టాంకులు- ఈ విధంగా అవి వరుసగా ఉన్నాయి.

మొదట పైకి తేలిన తొక్కు తొలగిస్తారు.

తరువాత ప్రిలిమినరీ సెడిమెంటేషను టాంకులో వీలయినంత కర్రగుజ్జును వేరుచేస్తారు. సెడిమెంటేషనుకు ముందు క్లోరినేషను జరుగుతుంది. కర్రగుజ్జుతోపాటు ఆ నీటిలో రసాయనపదార్థాలు- కర్రలో ఉండే సాంబ్రాణి వంటి పదార్థం- డైజస్టర్లనుండి వచ్చినది, కాగితాన్ని అదమడంవల్ల వచ్చినది- అంతా సెడిమెంటేషను టాంకులో వేరు చేయబడుతుంది. క్లోరినేషన్ వలన దుర్గంధం తగ్గి, డిసిన్ఫెక్షన్ జరుగుతుంది. తరువాత ఆ నీటిని ఏరేషను టాంకులకు పంపుతారు- అక్కడ నీరు గాలిబారుతుంది. అక్కడనుండి ఫైనల్ సెడిమెంటేషను టాంకులకు వస్తుంది. ఈ దశకు వచ్చేసరికి చాలఫిల్టర్లు దాటి, నీరు పరిశుభ్రమౌతుంది. ఫైనల్‌సెడిమెంటేషను తరువాత తిరిగి క్లోరినేషన్ చేస్తారు. దానితో ఆ నీరు అన్ని విధాలవరిశుభ్రమయి, తిరిగి ఉపయోగించడానికి యోగ్యంగా ఉంటుంది.

'' మేము ఈ విధంగా పరిశుభ్రం చేసిన నీరు తాగే మంచినీటి కన్నా స్వచ్ఛమైనది. కాబట్టి ఎంత శ్రద్ధ తీసుకుంటున్నామో మీకే అర్థమౌతుంది. '' ఆనీటి గురించి చెప్తూ మధుసూదన్ అన్నాడు.

'' కర్రగుజ్జులో సల్ఫేటుక్షారాలుంటాయి. వాటిలో అధికంగా సల్ఫరుడయాక్సయిడు ఉంటుంది. కాస్టిక్‌సోడా, సోడియమ్ సల్ఫేట్ ఉంటాయి. కర్రలోని చేవభాగం కరిగినదుంటుంది. తరువాత ఈ గుజ్జు బ్లీచ్ చేస్తారు. పిమ్మట ఆల్కలీ పదార్థాలు తీసివేస్తారు. ఈ విధంగా తయారయిన గుజ్జును ఆల్ఫాపల్పు లేక కరిగిన గుజ్జు అంటారు. ఈ గుజ్జులో కూడా చాలశాతం మురికి నీటిలోకలిసి పోతుంది. ఈ రీసైకిలింగ్ ప్రాసెస్‌వల్ల గుజ్జును తిరిగి రాబట్టడమేకాకుండా, నీటిని కూడా ప్రయోజనకరంగా వాడుకుంటున్నాము. '' అన్నాడు మధుసూదన్ అంతా చూపించి.

క్లోరినేషను టాంకులు, సెడిమెంటేషను టాంకులు, ఏరేషను టాంకులు, ఫిల్టర్‌బెడ్‌లు- అన్నీ చాల పెద్దవి. ఎంతో నీరు ఉపయోగిస్తారు. కాబట్టి పెద్దవే నిర్మించారు. ఈ టాంకులవెనుక ప్రహరీగోడ పదహారడుగుల ఎత్తులో ఉంది. దానిమీద ముళ్లకంచె దుర్భేద్యంగా ఉంది. టాంకులకు కొంచెం దూరంలో నూరడుగుల ఎత్తులో వాచ్‌టవర్, దానికి కొద్దిదూరంలో సెర్చ్‌లైట్లు కనిపిస్తాయి.

వాచ్‌టవరు మీదికి వెళ్లడానికి ఇనుపమెట్లు వర్తులాకారంగా ఉన్నాయి. మీదను ఆరడుగుల వ్యాసం, పదడుగుల ఎత్తు ఉన్న టవరునుండి మిల్స్ వెనుకభాగమంతా కనిపిస్తుంది. మధుసూదన్ ఈ వాచ్‌టవర్ మీదికి వాళ్లను ఎక్కించి అన్నీ విశదీకరించాడు.

'' ఈగోడ దాటివెళ్తే మీవూరు ఒకటిన్నర కిః టర్లే '' అన్నాడు మధుసూదన్.

గోపీకృష్ణ గోనెలపాడు వేపు చూశాడు. కాని, కొంత అడుగుభాగం అడ్డొచ్చింది. వెదురు పొదలు దట్టంగా ఉండి ఏవీకనిపించలేదు.

ప్రహరీ గోడకు పక్కనే పెద్ద పెంకుటిల్లు కనిపించింది.

'' ఇదెవరిదీయిల్లు? ''

'' గిరిజన కార్పొరేషనుది. సీజన్‌లో చింతపండు, శీకాయ, విస్తళ్లు మొదలయినవి నిలువచేస్తారు. లేకపోతే ఎవరూ ఇక్కడుండరు. ''

గోపీకృష్ణ టాంకులన్నీ మరోసారి చూశాడు. స్పిలోవరు నుండి పారిన నీరు దిగువనున్న భూములకు పోతున్నది. ఆ భూముల్లో సంవత్సరానికి మూడు పంటలు పండిస్తారు.

గోపీకృష్ణ మనసు చాలా తేలికగా ఉంది. గోనెలపాడు గొడవలు పూర్తిగా మరచిపోయాడు. నాలుగున్నరకు మధుసూదన్ ఛాంబరుకు వచ్చి టీతాగి అతని దగ్గర సెలవు తీసుకొని ఇద్దరూ యిళ్లకు బయలుదేరారు.

'' డాక్టరుగారు! వెదురు పొదలలోంచి మనవూరికి అడ్డదారుంది. చాల దగ్గిర- దానిని బట్టి వెళ్తే మనం తిన్నగా మనవూరి బావిచేరుకుంటాం. దారి




ఎత్తుపల్లాలుగా ఉంటుంది. మీరు నడవగలరా? ''

'' దానికేముంది, పద. ''

ఇద్దరూ మెయిన్ గేటునుండి, టౌన్‌షిప్ వేపు మళ్లకుండా, కుడిచేతివేపు తిరిగి ప్రహరీగోడపక్క నుంచి నడిచారు. వాళ్లలా అరకిలోమీటరు దూరం నడిచేసరికి పైవరుసనుండి చూసిన పెంకుటిల్లు కనిపించింది. దానిమీద ' గిరిజన కార్పొరేషను వారి గోడౌను ' అని వ్రాసిఉంది.

ఆ యింటిదగ్గర కొంచెం సేపు గోపీకృష్ణ నిలబడ్డాడు.

ప్రహరీగోడ పక్కనుంచి వస్తున్న నీటి గొట్టమొకటి ఆయింట్లోకి పోయింది.

పేపరు మిల్లువారు కనెక్షనిచ్చారన్నమాట.

ఆ పెంకుటిల్లు చాల పెద్దది. పెద్దపీడివరండా- దానికి ఈ చివరను ఆచివరను రెండు గదులు- మధ్యన పెద్దహాలు, ఇటు పక్కగదులు, అటుపక్క గదులున్నాయని వెంకట్రావు అన్నాడు. వెనుక మరోవాస ఉంది. అందులో వంటిల్లు, భోజనశాలలు అన్నీ ఉండవచ్చు. ముందున్న తలుపులకు పెద్ద తాళం కప్పలు తగిలించి సీల్లు వేశారు. ఇంటి పక్కనుంచి వెళ్తుంటే వెనుక వాసకు సందుతలుపు కనిపించింది. దానికి పెద్దయిత్తడి తాళం వేశారు. దీనికి సీలు లేదు. ఆ గుమ్మం దగ్గర ఒక వేరు గోపీకృష్ణ కంటపడింది.

గోపీకృష్ణ వంగి ఆవేరును తీశాడు. అయిదంగుళాల పొడవు, బొటనవేలు మందంలో, మెలికలు తిరిగి, ఒంపులు పోయి ఉందావేరు. గోపీకృష్ణ దానిని విరిచాడు. చప్పుడు చేయకుండా సరిగా విరిగింది. లోపలతెల్లదనం బూడిదరంగు కలిసి ఉన్నాయి. పీచుపదార్థం హెచ్చుగా ఉంది. దానిని వాసన చూశాడు- ఏమీలేదు- దానిని జేబులో వేసుకున్నాడు.

అత్తవారి ఆయింటిని చుట్టుకొని పోతుంది. పెరటిభాగం నుండి అంగుళంన్నర మందంలో నున్న పైపొకటి వచ్చి, ప్రక్కనే ఉన్న ప్రహరీగోడ మీద నుండిలోపలనున్న టాంకులవేపు పోయింది. ముందున్నపైపు నుంచి నీళ్లు రావడానికైతే మరి ఈ వెనుక నున్న పైపు దేనికి?

ఇద్దరూ వెదురుపొదల మధ్యనపోతున్న అడ్డదారి మీంచి నడుస్తున్నారు. దారిఎగుడు దిగుడులుగా ఉంది.

ఆదారిపక్కనే ఎలక్ట్రికల్ కేబిలు కోసం తవ్విన ట్రెంచి కనిపిస్తుంది. తొందర తొందరగా దానిని కప్పినట్లున్నారు. కేబిలు మీద ఇటుకలు పెట్టి మరీ మట్టిసింపుతారు. ఇక్కడ అంతశ్రద్ధ తీసుకున్నట్లు లేదు. చాలయిటుకలు ట్రెంచి పక్కనే ఉండిపోయాయి. ఎవరో తొందరతొందరగ పనిముగించారు.

వెంకట్రావు నడుస్తూ అడిగాడు!

'' డాక్టరుగారు! మీరు జేబులో వేసుకొన్న వేరేమిటి? ''

'' రవున్ఫియా- సర్పెంటీనా అంటారు- దీనిని సంస్కృతంలో సర్పగంధి లేక చంద్రిక అంటారు. తెలుగులో పాటల గంధి లేక పాటలగరుడ అంటారు. హిందీలో ఛోటా అని చాంద్ అని, బెంగాలీల చంద్రా అని, చోటా చాంద్ అని అంటారు. ''

'' మీకు ఇంగ్లీషు మందులేకాకుండా తెలుగు మందులు కూడా తెలుసా? ''

'' తెలియడానికేముంది? బోటనీలో వీటి గురించి చదువుతాము. ఇంగ్లీషు మందులలో రెస్పిరిన్ అన్నది దీనినుంచే తయారవుతుంది. ''

'' ఇవెక్కడ దొరుకుతాయి? ''

'' సాధారణంగా కొండప్రాంతాలలో దొరుకుతాయి. బెంగాలు, బీహారు, అస్సాములలో బాగాదొరుకుతాయి. ఈ ప్రాంతపు కొండల్లో ఈ వేరు దొరుకుతున్నట్లు నాకు తెలీదు.

'' అవునవును. మా మామ దగ్గరకు ఒక కొండవాడొచ్చాడు- రమారమి రెండుమూడు సంవత్సరాలవుతుంది. ఇటువంటిదే వేరు చూపించాడు. వెంటనే మామవాడికి నూరురూపాయలిచ్చాడు. ''

'' వాడు సరుకు తెచ్చాడా? ''

'' మావూరిలో తెచ్చిఇచ్చినట్లు లేదు. ''

'' మీమామకు ఈ గోడౌనుకు సంబంధముందా? ''

'' ఏమో తెలీదు. ఒక మనిషి- ఆమనిషికి ఆరువేళ్లుంటాయి, ప్రతి చేతికి- అతని పేరు పద్మనాభం- అతనికి టౌన్‌షిప్‌లో ఒక మందులషాపుంది. అతనేతరచు మా మామతో మాట్లాడుతుంటాడు. ''

'' అతన్ని గుర్తుపట్టడానికి ఇంకేమైనా...? ''

'' అతని ముఖం మీదస్ఫోటకం మచ్చలు- ఉంగరాలజుత్తు- లోతుకుపోయిన కళ్లు- మనిషి అయిదడుగుల కంటె పొడవుండడు- నల్లగా ఉంటాడు- కుడిచేతికి నాలుగుంగరాలు- ''

'' బాగుంది. ''

'' అడుగుతున్నానని మరేం అనుకోకండి. మరి ఈ వేరుదేనికి పనికొస్తుంది. ''

'' దీనికి చాలమంచి పేరుంది ఆయుర్వేదంలోను- ఇంగ్లీషుమందులలోను. ఇది చేదుగా

ఉంటుంది. విరేచనాలకు, నులిగడుపుకు పనిచేస్తుంది. పాముకాటుకు, పురుగుకాటుకు ఇది విరుగుడు- నిద్రలేకపోవడాన్నీ ఉన్మాదాన్నీ పోగొడుతుంది. మంచి సమ్మోహన ప్రభావముంది. అన్నిటికన్న ముఖ్యంగా కేంద్రనాడీమండలం మీద చాలప్రభావంకలది- శిరోభాగంలో ఉపశమనం కలిగిస్తుంది. ముఖ్యంగా దీనిని రక్తపుపోటు, అంటే బ్లడ్‌ప్రెషర్‌కు వాడతారు. ''

'' ఇంత గొప్పమందా? ''

'' అవును- ఈ ప్రాంతపు కొండల్లో మీ కౌస్తుభం మామ దీని ఉనికి కనిపెట్టాడన్న మాట ''

'' అతను చాలవ్యాపారాలు చేస్తాడు. పాలకొండలో ఒక పెద్ద మందులషాపుంది. దానిలో నగం పెట్టుబడి మా మామదే. ''

'' ఆయుర్వేదవైద్యమే కాకుండా మిగిలిన వైద్యాలు కూడా తెలునన్న మాట. ''

'' ఏమో మరి! ''

'' అతను ఔషధాలు తయారుచేస్తాడా? ''

'' అటువంటి శ్రమలేకుండా మిగిలిన కంపెనీల లేబిళ్లు చింపి, సీసాలు మార్చ వ్యాపారం చేస్తాడు.''

వెదురు పొదల్లోంచి వాళ్లు నడుస్తున్నారు.

సాయంకాలం. పొదల్లో చీకటి మొదలయింది.

ఆ కేబిలు త్రెంచి, ఆ బాటపక్కనుండి, అలానే నడుస్తోంది.

పొదలయిపోయాయి.



దూరాన విశాలమైన స్థలం- అక్కడ గోనెలపాడు బావి. మరి, కేబిలు త్రెంచి మాయమైపోయింది.

" వెంకట్రావ్! మీవూరికి ఎలక్ట్రిక్ కరెంటు స్తంభాలమీద వచ్చినట్లు అందరికీ స్పష్టంగా కనిపిస్తోంది. మరి యీ కేబిలుత్రెంచి దేనికి? "

" అప్పుడే ప్రభుత్వం మారిపోయింది. పాత ప్రభుత్వం కేబిలంటే, కొత్త ప్రభుత్వం స్తంభాలన్నారు. "

" అదాసంగతి! "

" అదేమరి. కంట్రాక్టరు అప్పలస్వామి బాగు పడ్డాడు. ప్రభుత్వాలు మారినా కంట్రాక్టరు మాత్రం మారలేదు. "

ఇంతలో ఊళ్లోకి పోయే బండిదారి వచ్చింది.

వెంకట్రావు, సెలవు తీసుకున్నవాడు, ఒక్క క్షణంఆగి, గోపీకృష్ణ చెవిలో అయిదునిమిషాలు ఏదో చెప్పి వెళ్లి పోయాడు.

గోపీకృష్ణ ముందిపడుతూ డిస్పెన్సరీవేపు నడిచాడు.

తిన్నగా నిర్మల యింట్లోకి తలుపులు తోసుకొని ప్రవేశించాడు.

వంటావిడ యింకా వంట ప్రయత్నం చెయ్యడంలేదు- టీతయారు చేసి, డాక్టరు నిర్మలకోసం డిస్పెన్సరీకి పంపించింది.

" బామ్మగారు! ఇదిగో నూరురూపాయలనోటు. దీనిని తీసుకోండి. మీరు మాకోసం మరి వండనక్కర్లేదు. నాకు పనిలేదు- వంటపని నేనే చూసుకుంటాను. వెళ్లిపొండి. "

" ఈ రాత్రికి కూడా వండొద్దా? "

" వద్దనే చెప్తున్నాను. "

ఇంతలో నిర్మల వచ్చింది.

" అమ్మగారూ! నన్ను వెళ్లి పొమ్మంటున్నారు ఈయన "

నిర్మల గోపీ ముఖంలోకి చూచింది.

" డాక్టర్ నిర్మలా! నేనే వెళ్లిపొమ్మన్నాను. మన ఉద్యోగాలు మరోవారం రోజుల్లో పోతున్నాయి కదా- ప్రస్తుతం నాకేదీ పనిలేదు- లేడీ డాక్టరు గారికి వండిపెట్టడానికి నేను సిద్ధం. "

" గోపీ! డోంట్‌కిడ్! ఇంతకీ నీకు వంటొచ్చా? "

" డాక్టర్ నిర్మలా! నేను హాస్టలులో వంటబ్రాహ్మణులదగ్గర నేర్చుకున్నాను. "

" అయితే వెళ్లిపొండి బామ్మగారు! "

ఆ పెద్దావిడ వెళ్లి పోయింది.

" దీని అర్థమేమిటి? " నిర్మల ప్రశ్నించింది.

" ఈ డర్టీఓల్డు ఉమన్ పంచమాంగదళ సభ్యురాలు. కౌస్తుభం చాల నేర్పుతో నీయింట్లో ఉంచిన స్పై. నువ్వు ఈ మనిషి ఎదుట సెన్సేటు ఎక్సర్సయిజెస్ వివరాలు నీ పేషంట్లకు రహస్యంగా యింటి దగ్గిర చెప్తుంటే, వాటికి వేరువేరు అర్థాలు కల్పించి ఈవిడ కౌస్తుభానికి నివేదిస్తోంది. "

" అంతఘోరమా? "

" గోనెలపాడు గ్రామం చిన్నదేకాని, రాజకీయాలలో ఏమీ తీసిపోదు. "

" అయితే రాత్రికి పాలు తాగి పడుకోడమేనా? "

"నోనో! మిస్టర్ మధుసూదన్, పేపరుమిల్లు పి.ఆర్.ఓ. రెండు ఇంపోర్టెడ్ టిన్నులు- టమాటో సూప్ యిచ్చాడు. రెండిచ్చాడు. ఒకపాకెట్ బటర్- మరొకటి ఛీజ్- ఈ రాత్రికి బ్రెడ్- టోస్టు- టమాటో సూప్- ఒక్క అరగంటలో అన్నీరెడీ! "

" ప్లీజ్ యువర్ సెల్ఫ్- గోపీ! "

నీరసంగా నిర్మల మంచం మీదకూలబడింది



## 8

డాక్టరు గోపీకృష్ణ చాల కోపంగా ఉన్నాడు.

సరిగ్గా పది గంటలకు అటాచీ పట్టుకొని గోనెలపాడు పంచాయతి ఆఫీసు లోకి ప్రవేశించాడు. తెల్లటి డ్రస్సు మడతలు నలగకుండా వేసుకున్నాడు. అతని కాలిజోడు పాలిష్‌అయి మెరుస్తోంది.

"నమస్కారాలు, నమస్కారాలు - డాక్టరుబాబూ!"

నారాయుడు పంచాయతి ఆఫీసు బంట్రోతు. ఇతని కొడుకుకే తొడమీద కుట్లుకుట్టి బాగు చేశాడు గోపీకృష్ణ. గోపీకృష్ణకు కుర్చీ చూపించాడు కూర్చోమని.

"మీఆఫీసు ఎంతకు తెరుస్తారు?" అడిగాడు గోపీ.

"పదిగంటలకు."

"మరి మీగుమాస్తా ఏరీ?

"పదకొండు గంటలు దాటిం తర్వాతే వస్తారు."

"మీ ప్రెసిడెంటు గారు?"

"ఆయన ఎప్పుడు రమ్మంటే అప్పుడే వస్తారు."

"అయితే పోయి పిల్చుకురా! మెడికలాఫీసరు గారు వచ్చారని చెప్పు."

నారాయుడు ఆఫీసరు పేరు వినడమే తడవు తొందరగా రామునాయుడు గారిని పిలవడానికి పోయాడు.

నాయుడుగారు స్నానం చేస్తున్నారు. అదయిం తర్వాత ఒక పావుగంట పూజ చేసుకొని వస్తానని చెప్పమన్నారు. "బాబూ! కాఫీతెద్దునా?"

"వద్దు."

డాక్టరు గోపీకృష్ణ అటాచీ టేబులు మీదపెట్టి, కుర్చీమీద చేరబడ్డాడు. రాత్రి సంగతి తలచుకుంటే అతనికింకా ఒళ్ళు జలదరిస్తోంది.

- - - - రాత్రి ఎనిమిది గంటలకు వేడి చేసిన టమాటా సూప్‌లో, కాల్చి బాగావెన్న రాసిన రొట్టె ముక్కలు ముంచుకొని ఇద్దరూ భోజనం ముగించే సరికి ఎనిమిదిన్నర అయింది. నిర్మలకు నిద్ర ముంచుకొని వస్తుంటే తనే వచ్చేశాడు. పడుకుందామంటే నిద్రరాలేదు తనకు

ఆరోజు రాత్రి వెన్నెల్లో బావిగట్టు మీద, నిర్మల శరీరం మెరుస్తూ తన్ను గాఢంగా కావలించుకుంటే .... ఆసంగతి తలచుకుంటే ఇప్పుడాతనికి పులకలు లేస్తున్నవి... మగతనం ముంచుకొస్తోంది... ఆరోజు ఇలాఉంటే నిర్మల తనను ఎంత మెచ్చుకునేదో....

ఇప్పటికీ మించి పోయిందిలేదు.

ఆసమయంలో తనకామె మీద ఎందుకు ధ్యానంలేదు?

తనకు ఆనాడు మగతనం పూర్తిగా పోయింది.

అదొక్కటే కారణంకాదు.

అదేవేళకు నూతిలో జలజలమని నీరు పడుతున్న శబ్దం... ఎంతో మధురంగా, చెవిలో నిర్మల ప్రణయం గురించి మాట్లాడుతుంటే, ఈనీటి శబ్దం తన మనసును పాడుచేసింది.

ముందీ శబ్ద రహస్యాన్ని ఛేదించాలి.

అప్పటికి పదిహేను నిమిషాలు తక్కువ తొమ్మిది.

ఏం చేయాలి?

నూతిలో దిగాలి.

ఎంతలోతు?

శబ్దాన్నిబట్టి పదిహేను, ఇరవై అడుగుల లోతు.

మరి, జల అడుగునుంచి ఊరుతుంది - ఒకవేళ మీదనుంచయితే అన్ని సమయాలలోను కొద్దోగొప్పో నీరురావాలి. దానికి సరిగ్గా తొమ్మిది కనివేళలేదు.

అదే ఛేదించవలసిన రహస్యం!

మరి పనిముట్లు?

ఆయానరసమ్మకోసం కట్టిన యింట్లో కంట్రాక్టరు సామాన్లున్నాయి. వాటిలో ఒక వలంపటి తాడుంది. చాలపెద్దది. ఒంటి పొరేచాలు. సులువుగా ఏభై అడుగుల లోతు వరకు దిగొచ్చు.

గోపీకృష్ణ మరికాలం వ్యర్థం చేయలేదు.

అయిదు నిమిషాలు తక్కువ తొమ్మిదికి గొనెల పాడు బావిని చేరు కున్నాడు. అంతా నిశ్శబ్దం. చీకటి రాత్రి. ఆకాశం మీద చుక్కలు చురుగ్గా వెలుగు తున్నాయి. నూతి లోంచి ఏచప్పుడూ రాలేదు.

ఒక్కొక్క సెకెండు ఒక యుగంలా తోచింది గోపీకి.

సరిగ్గా తొమ్మిది గంటలకు చిన్న శబ్దం. క్రమంగా అది ఒకస్థాయికి చేరుకుంది. అప్పటికి తొమ్మిదిదాటి అయిదు నిమిషాలయింది.

బావికి చుట్టూ పదడుగుల వెడల్పుగల పళ్లెముంది. అయిదు గిలకలు, చుట్టూ సమాన దూరాల్లో అమర్చి ఉన్నవి. బండిదారికి దూరంగా ఉన్న గిలకకు తాడు దిట్టంగా కట్టాడు. ఒకవేళ తాడుతెగితే, లేకమరే కారణం చేతనో తాను జారి నీటిలో పడితే ప్రమాదం లేదు. ఈదగలడు. ఏరాతికో తల కొట్టుకుంటే ప్రమాదం తప్పదు.

నోటితో వెలిగించిన పెన్‌లైటు టార్చి కరుచుకున్నాడు. జాగ్రత్తగా తాడు పట్టుకొని మెల్లిమెల్లిగా లోనికి దిగాడు. సరిగా పన్నెండడుగులు దిగాడో లేదో, ఒకచిన్న మర్రిమొక్క కనిపించింది. దానికి కొంచెం దిగువ నుండి శబ్దం వస్తున్నది.

మరి కొంచెం లోనికి దిగి గోపీకృష్ణ ఆగిపోయాడు.

అక్కడ పడుతున్న నీరు జోరుగా వస్తున్నా ఆజోరు దేనినో తగిలి తగ్గి పోతోంది.

మరి రెండడుగులు గోపీకృష్ణ దిగాడు. అతని

పంట్లాం మీదికి నీళ్లు చింది తడిసి పోతోంది. బావిలో నీటి మట్టం మరో అయిదడుగుల క్రింద ఉంది. ఒక చేతితో తన శరీరం బరువు కానుకొని, రెండవ చేతితో నోటిలోని టార్చితీసి పట్టుకొని నీరువస్తున్న చోటును చూశాడు.

రెండంగుళాలు వ్యాసం కల గొట్టం నుండి నీరు వస్తోంది. జోరుగా వస్తోంది. ఆజోరును తగ్గించ టానికి, నీరు ధారగా నూతి మధ్యను పడకుండా ఉండడానికి ఒక దళసరి రేకు, గొట్టం మీదిభాగానికి వెల్డు చేశారు - నీరు ఆరేకుకు తగిలి నూతి గోడమీంచి లోపలికి దిగుతుంది. ఈ ఏర్పాటువల్ల ఎవరికీ ఆర్భాటంగా నీరు వస్తున్న ట్లు తెలియదు.

ఆనీరు ఘాటయిన క్లోరిన్ వాసన వేస్తోంది.

మరి కొంచెంసేపు అక్కడేఉండి, ఆనీటి పారుదలను సాంతంగా చూసి, తిరిగి మీదకు ఎక్కడం ప్రారంభించాడు.

లోపలికి దిగడంకన్న నూతినుండి పైకి రావడం కష్టమయి పోయింది.

పైన పళ్లెంమీద ఉంచిన చొక్కా, చేతివాచీ భద్రంగా అక్కడే ఉన్నాయి.

ఎక్కడ నుంచీ అలికిడి వినిపించడం లేదు.

తాడు పట్టుకొని రమారమి అరగంటసేపు లోపల ఉండిపోవడంచేత, చేతులు, భుజాలు రగుడుకు పోయాయి. గట్టుమీద ఒకపది నిమిషాలు కూర్చున్నాడు గోపీ.

నూతిలో నీరు పడుతున్న శబ్దం వినపడుతూనే ఉంది. చొక్కా వేసుకొని వాచీ చూశాడు. రాత్రి పదిగంటలయింది. ఎంతవరకు ఈ నీరిలా వస్తుందో?

ఆనీరు అంత ఘాటుగా క్లోరిన్ వాసనవేస్తోంది. బాక్టీరియా చచ్చిపోతుంది. ఆరోగ్యకరమైన నీరు. ఏదో నల్లయి లైను నుండి దీనికి కలిపినట్లున్నారు. ఈనీరు అంతమంచిదయితే మగవారికి అంతహాని చేస్తున్న దెందుకు?

అక్కడే నూతిగట్టున పద్మాసనం వేసుకొని గోపీకృష్ణ కూర్చున్నాడు.

ఈనూతి చరిత్ర చాల అద్భుతంగా ఉంది.

డబ్బు చేసుకున్న వాళ్లు డబ్బు చేసుకున్నారు. శాపం మాత్రం సామాన్యుల మీదపడింది.

పొరపాటు!

ఆశాపం విచక్షణా రహితంగా, గొప్ప పేదఅన్న భేదంలేకుండా, గోనెలపాడు గ్రామంలో ప్రతి పురుమడికి తగిలింది. ఈనూతిని నీళ్లతో నింపే వారికి ఈవిషయం తెలుసా?

గోపీకృష్ణ మళ్లా వాచీ చూసుకున్నాడు. పదిన్నర - జరజరా పాములా నీరునూతి లోపలికి దిగుతోంది.

సరిగ్గా పదకొండు గంటలకు శబ్దంతగ్గి ఒక్క నిమిషంలో ఆగిపోయింది.

రాత్రంతా ఆనీరు పడుతూ ఉంటే?

ఆనూయి నిండి పొంగిపొర్లదా!

కాబట్టి ఖర్చయిన మేరకు నింపుతున్నారు. చాలవరకు లెక్కలుకట్టి ట్రయల్సు చేసి ఈ నిర్ణయానికి వచ్చినట్లున్నారు.

డాక్టరు గోపీకృష్ణ లేచి నిలుచున్నాడు. భుజానికి తాటిచుట్ట తగిలించు కున్నాడు. అతని అడుగులు తేలిగ్గా పడుతున్నాయి. గదిచేరి బట్టలు మార్చుకునే సరికి పదకొండున్నర అయింది.

- - - -

- - - గోపీకృష్ణ మళ్లా యీ లోకంలోకి వచ్చాడు.

రామునాయుడు గారు యింకా రాలేదు. అప్పుడే పదిన్నర.

తాను ఉదయం తెల్లార కుండానే రామన్నపేట నూతికి పరుగెత్తి స్నానం ముగించి, రెండు సార్లు నీళ్లు తెచ్చుకున్నాడు. వంటకు కూడా గోనెలపాడు నీటిని ఉపయోగించ దలచలేదు. టిఫిన్ ముగించి, నిర్మల డిస్పెన్సరీకి వెళ్లిపోయింది.

తాను చేయవలసిన పనంతా సమగ్రంగా ఆలోచించాడు.

అన్నింటికన్న ముందు తెలుసుకోవలసింది గోనెలపాడు బావి చరిత్ర. దాని రికార్డులన్నీ పంచాయతి ఆఫీసులోనే ఉంటాయి. మామూలుగా అడిగితే రాము నాయుడు గారు యివ్వకపోవచ్చు. ఇవాళకూడా, డాక్టర్లకు వ్యతిరేకంగా ప్రచారం సాగిస్తూ సంతకాలు సేకరిస్తున్నారు నరసింహారావు పంతులు, కౌస్తుభం.

గ్రామ వాసులలో కూడా రెండు పార్టీలు ఏర్పడ్డాయి.

రామునాయుడు, కౌస్తుభం, నరసింహారావు ఇత్యాది పెద్ద మనుషులంతా ఒకపార్టీ - ఇద్దరు డాక్టర్ల దగ్గిర చికిత్సపొంది, వారితో స్నేహంచేసి, వాళ్లమంచితనాన్ని నలుగురిలో చెప్పుకుంటున్న నారాయడు, వడ్రంగి చిన్నయ్య, వెంకట్రావు వంటివాళ్లు ఒకపార్టీ. ఊరి ఆడవాళ్లందరూ డాక్టర్లకు అనుకూల మయిన పార్టీవాళ్లే. వాళ్లెవరికి ఈసంతకాల వ్యవహారం ఇష్టంలేదు.

ఆంధ్రప్రదేశ్ ఎంతో వైవిధ్యం గల రాష్ట్రం – విభిన్న సమ్మేళనాలు, దేవాలయాలు, చారిత్రాత్మక విహార స్థలాలు, ఆరామాలు – హిందూ, బౌద్ధ, ముస్లిం మతాల సంగమం. వరంగల్లు లోని రామప్ప దేవాలయం, కాకతీయ తోరణం, జంతుశాలలు, పక్షుల విడుదులు – పాకాల, శ్రీశైలం పులికాట్, కొల్లేరు సరస్సులు – అరకులోయలు, హార్సిలి కొండలు మొదలగు విహార కేంద్రాలు, విశాఖ పట్టణంలోని సముద్ర తీరాలు – ప్రఖ్యాతి చెందిన తిరుపతి, భద్రాచలం, శ్రీశైలం, సింహాచలం మొదలగు పుణ్యక్షేత్రాలు.

నాగార్జున సాగర్ – ఎత్తైన రాతి కట్టడపు ఆనకట్ట.
నాగార్జున కొండ – బౌద్ధ అవశేషాల ప్రదర్శనశాల.

ఆంధ్రప్రదేశ్ – కూచిపూడి నాట్యానికి పుట్టినిల్లు. నిర్మల్ చిత్ర లేఖనాలు, కొండపల్లి బొమ్మలు, కలంకారీ వస్త్రాల అద్దకాలు – సప్తవర్ణాల అందాలు.





రాష్ట్ర రాజధాని హైదరాబాద్ – చార్మినార్, సాలార్‌జంగ్ మ్యూజియం, బిర్లా వేధశాల, గోల్కొండ కోట, కుతుబ్ షాహీ రాజుల స్మృతి చిహ్నాలు, చలువ రాతి వేంకటేశ్వర దేవాలయం, జంతు ప్రదర్శనశాల – మరెన్నో విహార యాత్రా స్థలాలు.

ఆంధ్రప్రదేశ్‌లోని హైదరాబాదుకు రండి – మరపురాని మధురాను భూతిని పొందండి!!



ఆంధ్రప్రదేశ్ పర్యాటక విభాగం
మొదటి అంతస్థు, గగన్ విహార్,
యం.జె.రోడ్డు, హైదరాబాద్ - 500 001.
టెలిఫోన్లు : 556493, 42835, 77192, 70087, 233384, 233385.

# ఆంధ్రప్రదేశ్ – వర్ణ వర్ణాల చిత్ర విచిత్రం
# మరపురాని మధురానుభవం





రేపు మరోవేయి రూపాయలు కౌస్తుభం ఇస్తున్నాడు. అర్జీఅంతా టెలిగ్రాం రూపంలోనే వెళ్తుంది. ఊరు అట్టుడికి పోతోంది.

గోపీకృష్ణ ఆలోచిస్తున్నాడు.

ఇంకా ఆవూరిలో ఉండవలసిన రోజులు . . . నాలుగా, అయిదా?

ఇంతలో రామునాయుడు గారు రావడం జరిగింది.

అతనిని చూసి డాక్టరు గోపీకృష్ణ నమస్కారం చేయలేదు.

రామునాయుడుగారు కూడా తమ గౌరవానికి భంగమని నమస్కారం చేయలేదు.

"ఏం డాక్టరుగారు! పొద్దున్నే వచ్చారు?" రామునాయుడు గారే అడిగారు.

"నేను ఈవూరికి పోస్టయిన మెడికలాఫీసరుని." అన్నాడు గోపీ.

' అదెప్పట్నుంచీ?"

"మొదటినుంచీ... మీరు మాపోస్టింగ్ ఆర్డర్లు చూడండి. డాక్టర్ నిర్మలను సివిల్ అసిస్టెంటు సర్జను గాను, నన్ను మెడికల్ ఆఫీసరుగాను వేశారు."

"ఏదేది?"

రామునాయుడు గారు స్టీలు అల్మారాలో భద్రంగా దాచిన ఫైలు తీసి చూశారు.

"అవును. అయితే ఏంచేయమంటారు?"

"నాకురెండు బాధ్యత లున్నాయి. ఒకటి, డాక్టరు నిర్మలకు సహాయం చేయడం- రెండు, మీగ్రామ పారిశుధ్యం గురించి శ్రద్ధ తీసుకోడం."

"మరిన్నాళ్లు ఏంచేస్తున్నారు?"

"అదే! ఏంచేయలేదు. వెళ్లిపోయే ముందు ఒకసారి మీ రికార్డులు తనిఖీచేసి, ప్రభుత్వం వారికి రిపోర్టు పంపించాలి."

"చాలా విడ్డూరంగా ఉందే! వెళ్లిపోయే వాళ్లకు శ్రమదేనికి?"

"శ్రమకే ముంది? ఇదినా డ్యూటీ!"

"అయితే గుమాస్తాగారు రానీండి."

"అదేనేను చూస్తున్నాను. రోజూ అతను పదకొండింటికి వచ్చి, పన్నెండు కాకుండా వెళ్లిపోతున్నాడు. తనిఖీ రిపోర్టులో ముందు ఈవిషయమే ఉదహరిస్తున్నాను."

"ఇవి మా పంచాయతి సమితి అంతరంగిక విషయాలు."

"అనే - సరిగాలేవని ఆఫీసరుగా నేను ప్రభుత్వానికి తెలియ చేస్తున్నాను."

'ఒరి నారాయుడూ . . . ఎక్కడ సచ్చావురా! పోరా!. . . ఆ కౌస్తుభం వెంట తిరుగుతున్న సూర్యనారాయణను పిల్చుకురా!"

ఇంతలోనే సూర్య నారాయణ వచ్చాడు.

అతను కూడా డాక్టరు గోపీకి నమస్కారం చేయలేదు.

"గుమాస్తాగారూ! మీరు పదిగంటలకు రావలసిన వాళ్లు పదకొండుకు వచ్చారు. మీవూరి జననమరణాల రిజిస్టరు, టీకాలరిజిస్టరు, కలరా ఇనాక్యులేషను రిజిస్టరు - ఇవన్నీ ముందు చూపించండి."

"ప్రెసిడెంటుగారు! చూపించమని సెలవా?" సూర్యనారాయణ అడిగాడు.

"చూపించవయ్యా దేవుడా, మెడికలాఫీసరు గారికి" అరిచారు నాయుడుగారు.

ఇదీ, అధికారం చేయగలపని.

"ఈ జననమరణాల రిజిస్టరులో రెండు సంవత్సరాలయి ఎంట్రీలు లేవేమి?"

"ఎవడూ పుట్టకపోతే ఏంచేస్తాను?"

"మరిమరణాలో?"

"ఎవరూ చావలేదు కూడా!!

"మరి కంసాలి సూరయ్య భార్య కామమ్మ చనిపోయిందికదా?"

"అదేదో రెండున్నర సంవత్సరాల క్రిందటి మాట - ఆవిడ ఇక్కడ చనిపోలేదు- పాలకొండలో."

"ఆమె శరీరాన్ని ఇక్కడకే తెచ్చారు. ఈమట్టి మీదనే సంస్కారం చేశారు. ఆమెపేరు ఎక్కలేదేం?"

"దాని మొగుడు రిపోర్టు చెయ్యలేదు."

"అది నేరంకాదా?"

"నేరమో, పాడో."

"ఇక్కడ మంచినీళ్లు దొరికే స్థలాలలో మందు జల్లడం గురించి ఎక్కడ రికార్డు చేశారు?"

"ఇక్కడ ఉన్నదల్లా ఒకటే బావి. దానిలో మందులు మాకులు జల్లడంలేదు."

రామునాయుడు గారు నిలబడే ఉన్నారు మరి గుమాస్తా సరేసరి.

"ప్రెసిడెంటు గారు! ఈనుయ్యి తవ్వి ఎన్నేళ్లయింది?"

"నాలుగున్నర సంవత్సరాలు."




"సరియైన వివరాలు కావాలి. ప్లానులు, గవర్నమెంటు శాంక్షన్ - ఇవన్నీ ఎప్పుడొచ్చాయి? ఎవరికి కాంట్రాక్టు యిచ్చారు? ఏతేదీ నుంచి తవ్వడం మొదలెట్టారు? ఎప్పుడు పూర్తయింది?"

"ఓయి సూర్యనారాయణా! ఫైలు తీయవయ్యా!"

గుమాస్తా ఫైలు తీశాడు.

"సాయిల్ టెస్టు చేయించారా?"

"చేయించారు" నాయుడు గారే జవాబు చెప్తున్నారు.

"ఎస్టిమేటేది?"

గుమాస్తా తడుము కుంటున్నాడు.

"ఆఫైలిలా ఇవ్వండి."

గుమాస్తా డాక్టరు గారికి ఫైలిచ్చాడు. నాయుడు గారు కళ్లతో వారిస్తున్న సంగతి కూడా అతను గమనించటం లేదు.

వివరాలు కొన్ని పుస్తకంలో రాసుకున్నాడు గోపి.

"ఈనూతి నీటిని గవర్నమెంటు టెస్టుహౌసుకి పంపించారా?"

"పంపించాము. ఇదిగో సర్టిఫికేటు."

రామునాయుడు గారే దానిని గోడనుండి తీసి యిచ్చారు.

చట్రం కట్టించిన సర్టిఫికేటులో నూతి నీటిని పరీక్షించిన తేదీ, దానిలోని క్షారపదార్థాల శాతం, పి. హెచ్. వాల్యూ, ఆనీరు ప్రజలు, పశువులు తాగడానికి, వంటలు వండడానికి పనికొస్తుందో లేదో, మొదలయిన వివరాలన్నీ అందులో ఉన్నాయి. అవన్నీ గోపీకృష్ణ నోటు పుస్తకం లోకి ఎక్కించాడు.

"నూయి తవ్విన ప్రదేశం నల్లరాతి కొండ. మరోచోటు మీకు దొరకలేదా?"

"ఊరికి సమీపంలో మరేదీ మంచిచోటు లేదు."

"ఈరిపోర్టు ప్రకారం మీవూరి నూతినీళ్లలో సున్నపు పాలు హెచ్చుగా కనిపిస్తోంది. నల్లరాళ్ల లోంచి వచ్చే నీటికి ఈ గుణముండదు. ఇంతకీ ఈవాటర్ శాంపిలు ఎప్పుడు పంపించారు? ఫైలులో దాని గురించి ఏఉత్తరం లేదే!"

"అదే, అదే! ఈ నూతిని తవ్వించిన కంట్రాక్టరు అప్పలస్వామిగారు రెండు సీసాల్లోకి నూతినీరు నింపి, హైదరాబాదు వెళ్లి పరీక్ష చేయించి సర్టిఫికెటు తెచ్చారు."

"అదాసంగతి!"

డాక్టరు గోపీకృష్ణ రాస్తున్నకలం పక్కనపెట్టి, అయిదు నిమిషాలు చేష్టలు దక్కి ఉండిపోయాడు.

"మాబోటివాళ్లం వెళ్తే ఎవరూ చూడరుకదా!"

"మరొక్క విషయం. మొదటి సంవత్సరం ఎండలకు నీరు తగ్గిపోయింది. రెండో సంవత్సరం ఎండలు రాకముందే నూయి పూర్తిగా ఎండిపోయింది. అప్పుడు మరో ఇరవై అడుగులు లోతుకు తవ్వారు. చుట్టుపట్ల అంతారాళ్ల మయం. నీళ్లు ఎలాపడ్డాయని నాకింకా సందేహంగానే ఉంది."

"సందేహ మేమిటి- అదినిజమే. అరవై అడుగుల లోతుకుపోయినా ఒక్క చుక్కకూడా నీరువడలేదు. అపుడు కంట్రాక్టరు అప్పలస్వామి గారే స్వయంగా హైదరాబాదు వెళ్లి, వాళ్లెవరో నీటివాలు తెలిసిన వాళ్లు. . . ."

" వాళ్ళా.... వాటర్ డివైనర్సు."

" అదేఅదే... అతగాడిని రైలు ఖర్చులుపెట్టి తెచ్చారు. తెల్లటిగడ్డం- చూపుతక్కువ- అతన్ని జాగ్రత్తగా నూతిలోకి దింపాము. అతను తనకర్రతో కొట్టి, ఒక్క ఆరంగుళాల లోపల బ్రహ్మాండమైన జలఉందన్నాడు. రాత్రంతా వాళ్లు దీపాలు పెట్టుకొని పని చేశారు. తెల్లారి చూద్దుమా నూతిలో పదడుగుల నీరు చేరింది. ఆనీరు అమృతంలా ఉంది. ఆనాటినుండి నూయి ఎండనేలేదు- ఎంత ఎండాకాలం లోనయినా నాలుగు నిలువుల నీరుంటుంది."

గోపీకృష్ణ ఆలోచిస్తున్నాడు. కంట్రాక్టరు అప్పలస్వామి అన్నీ పకడ్‌బందీగా చేశాడు. వాటర్ డివైనరు- పల్లెటూరి వారిలో నమ్మకం కలిగించడమే అతనిపని.

"రెండోసారి వాటర్ శాంపిలు టెస్టు చేయించారా?"

"ఓ! ఒకసాంపిలు హైదరాబాదు లోను, రెండోది న్యూఢిల్లీ లోను టెస్టు చేయించి స్వయంగా అప్పలస్వామి గారే రిపోర్టులు తెచ్చారు. ఇవిగో రెండు సర్టిఫికెట్లు."

డాక్టరు గోపీకృష్ణ ఆరెండు సర్టిఫికెట్లలోని వివరాలు నోటు పుస్తకం లోకి ఎక్కించాడు. మొదటి సర్టిఫికెటుకి, వీటికి కొంచెమేనా తేడాలేదు.

"ఆరోజు నుంచీ మరి నీటికి ఇబ్బందిలేదు!"

"అన్నిటికీ సరిపోయే నీరు- తాగడానికి, వంటలకు, పశువులకు, అన్నింటికీ సమృద్ధిగా సరిపోయే నీరు.... మేమందరం కంట్రాక్టరు అప్పలస్వామి గారికి ఎంతో ఋణపడి ఉన్నాం. అతని శిలా విగ్రహ మొకటి లేపాలనుకుంటున్నాం."

ఉన్నట్టుండి పుస్తకం మూసేసి డాక్టరు గోపీకృష్ణ నిలబడ్డాడు.

ఈనూతి లోకి ఎక్కడినీరు వస్తున్నది?

అదేతెలుసుకోవాలి.

అటాచీ పట్టుకొని డాక్టరు గోపీకృష్ణ ఆఫీసు నుండి వీధి లోకి నడిచాడు.

★ ★ ★

డాక్టరు గోపీకృష్ణ డిస్పెన్సరీకి తిరిగి వచ్చేసరికి మధ్యాహ్నం ఒంటిగంటయింది.

పొద్దున్న తాను రెండుసార్లు రామన్నపేట నూతి నుండి నీళ్ళు తెచ్చినట్లు, వాటితోనే వండినట్లు నిర్మలకు తెలియదు. వంట పూర్తయేసరికి తొమ్మిద న్నర అయింది. తన భోజనం కారియరులో పెట్టి తన గదిలో టేబిలు మీద పెట్టుకున్నాడు. ఆమె భాగం అక్కడనే ఉంచాడు. పద్ధతులలో మార్పు తీసుకురాలేదు.

గోపీకృష్ణ ఇంటికొచ్చిన వెంటనే భోజనం చేసి నిద్రపోయాడు.

అతను నిద్రలేచేసరికి సాయంకాలం ఆరుగంట లయింది.






ఆవేళ గురువారం. ఊరిలో సంతకాలు సేకరిస్తున్నారు పెద్దలు. రేపు శుక్రవారం మధ్యాహ్నం గౌరవనీయులైన మంత్రిగారికి టెలిగ్రాము పంపుతారు.

టెలిగ్రాము అందేలోగా... కాదు కాదు... రేపు వాళ్ళు ఇచ్చేలోగా ఈ రహస్యాన్ని ఛేదించాలి ఛేదించడంతో సరిపోదు... కారణమైన దాన్ని సమూలంగా నాశనం చేయాలి.

సాయంకాలం టీ తయారు చేసి డాక్టరు నిర్మలకు పంపించాడు. తరువాత వంట- ఎనిమిదికి ముందు అన్ని పనులు అయిపోయాయి.

నిర్మలతో తన ప్లాను గురించి చెప్పడమా, మానడమా? ఆమె తన కోసం వెతుక్కోదు కదా? తను పక్కనున్నాడని ఆవిడకు నిబ్బరం. అయినా ఆవిడ చాలా ధైర్యవంతురాలు. కార్యం సాధించకుండా చెప్పడంలో ప్రయోజనంలేదు.

రాత్రి ఎనిమిది గంటలకు బాగా చీకటి పడింది. ఊళ్ళో దీపాలు- డిస్పెన్సరీ దగ్గర ఒకటి- కాని, నూతిదగ్గిర చిమ్మచీకటి.

కంట్రాక్టరు సామానుల్లో పెద్ద చొకుతాడు- ఆ చుట్ట భుజానికి తగిలించుకున్నాడు. ఆ సామానులో పిక్ఆక్స్ ఒకటుంది. దానిని భుజం మీద

వేనుకుని, ఒక చేత్తో టార్చి పట్టుకున్నాడు. నూతి గట్టు మీద నిలబడ్డాడు. నిన్నరాత్రి నూతిలోకి నీరు పడుతున్న గొట్టం ఉన్న చోట నిలబడి ఉత్తరాంధ్ర పేపర్ మిల్సు లిమిటెడ్ దిక్కుగా తిరిగాడు. తిన్నగా నడిచాడు. బండిదారి దాటాడు.తరువాత కేబిల్ ట్రెంచి మొదలయింది. దాని పక్కనే కాలిబాట. టార్చి వెలిగించి ఆ బాటంట నడిచాడు.

గోపీకృష్ణ బూట్లు తొడుక్కున్నాడు. ఒకవేళ పామే దేనా కరిస్తే విషం మీద కెక్కకుండా కట్టడానికి టూర్నికెట్ ఒకటి జేబులో పెట్టుకున్నాడు.

కాలిబాట సగం అయేసరికి పేపర్‌మిల్సు దీపా లు దృష్టిసపడ్డాయి.

కాలిబాట మీద నడుస్తూ తిన్నగా ప్రహరీగోడ వెనుక భాగానికి వచ్చాడు.




అప్పుడే టవరునుండి వాచ్‌మన్ డ్యూటీ దిగి వెళ్ళిపోతున్నాడు. అతను సరిగా పావుతక్కువ తొమ్మిదికి దిగుతాడు. తిన్నగా గేటుదగ్గిరనున్న ఆఫీ సుకు పోయి అక్కడ నుంచి ఇంటికి వెళ్తాడు. అతని రిలీవరు సరిగా పదకొండుకు గేటు దగ్గిర ఆఫీసు నుండి బయలుదేరుతాడు. పదకొండున్న రకు టవరు మీద ఉంటాడు. ఈ వివరాలన్నీ టవరు మీద నున్న బోర్డుమీద రాసి ఉన్నాయి. ఈ మార్పులు వచ్చి రెండున్నర సంవత్సరాలయింది, బోర్డు మీదనున్న తేదీనిబట్టి.

గోపీకృష్ణకు అప్పుడే సందేహం వచ్చింది.

ఎవరో ఈ మార్పులు చేయించారు.

ప్రహరీ గోడవెనుక చీకటిగావుంది.

గోపీకృష్ణ ఆ నీడలో ఉన్నాడు. ఎవరికీ సులువు గా కనిపించడు.

వాచ్‌మన్ దిగిపోయిన పదినిమిషాలకు తన తల మీంచి ఎవరో నడిచినట్లయింది. గోపీకృష్ణ మీదకి చూశాడు.

ప్రహరీగోడకు సమీపంలో ఫైనల్ సెడిమెంటేష ను టాంకు, క్లోరినేషను టాంకు, ఏరేషనుటాంకు ఉన్నాయి. వాటికి ప్రహరీగోడకు మధ్యన మూడడు గులు దూరం ఉంది. ఇవన్నీ అతను టవరు మీంచి గమనించాడు.

ఆ మనిషి టాంకు గోడ మీద నడుస్తున్నాడు. ఆ టాంకు సిమెంటుగోడ రెండున్నర అడుగులు వెడ ల్పుంది. టాంకు నుంచి టాంకుకు పోవడానికి మధ్యను చిన్న కర్ర వంతెనలున్నాయి. ఆ మనిషి మరి రెండు టాంకులు దాటి క్లోరినేషను టాంకు దగ్గిర నిలబడిపోయాడు. టాంకు గోడమీదికి వచ్చిన ఒక ఇనుపరాడ్డు. దానిమీద ఒక చక్రం ఫ్లడ్‌లైట్ల వెలుతురులో కనిపిస్తున్నవి. ఆ మనిషి ఆ చక్రాన్ని ఎడమవేపుకు తిప్పుతున్నాడు. తిప్పడం అయిన తరువాత అతను వచ్చిన దారినే వెనక్కు మళ్ళాడు. టాంకు మీదనుండి టాంకుకు దాటి, చివరకు ప్రహరీగోడకు పక్కనున్న ఇంటి వరకు వచ్చాడు. అక్కడ ఒక కర్ర వంతెన ఉంది. అక్కడ ప్రహరీ గోడకు ముళ్ళతీగలేదు. గోడ మీదికెక్కి ఆ మనిషి క్రిందికి దిగిపోయాడు. బహుశా అటేపు నిచ్చెన ఉండొచ్చు.

గోపీకృష్ణ ఆ దారంటే లోపలికి ప్రవేశించాలను కున్నాడు. కాని, ప్రహరీగోడకు వెలుపలనున్న పెంకుటింటిలో ఎంతమందుంటారో? అందరూ కలిసి మీదపడితే తానెంత బలవంతుడయినా లాభంలేదనుకున్నాడు.

ఆ రోజు టవరు మీంచి గోపీకృష్ణ ఒక విషయం గమనించాడు. టాంకులకు ఒక ఫర్లాంగు దూరంలో ఒక పెద్ద మామిడి చెట్టుంది. అది ఆవరణకు లోపలనేఉంది. కాని, దాని కొమ్మొకటి ప్రహరీ గోడను దాటి పైకి వ్యాపించిఉంది. ఎవరూ దాని గురించి శ్రద్ధ పట్టినట్లులేరు.

గోపీకృష్ణ చేతికున్న వాచీలో తొమ్మిదింబావ యింది. లోపలికి ప్రవేశించి చూడవలసిందల్లా పదకొండులోపుగా చూచిపైకి రావాలి. లేని పక్షంలో తాను బోనులోపడ్డ ఎలకలా కొట్లాడవలసి ఉంటుంది.

అంతటా నిశ్శబ్దంగా ఉంది. పిక్కాసు (పిక్ ఆక్స్) కు గట్టిగా తాడు ముడేశాడు. బలమంతా ఉపయోగించి దానిని మామిడి కొమ్మ మీదికి విసిరా డు. అది కొమ్మ మీదనుంచి రెండోవేపు నుంచి క్రిందికి పగజారింది. దానితో తాడు కూడా క్రిందికి వచ్చింది. ఆ తాడు సాయంతో చెట్టు కొమ్మ మీదికి ఎక్కాడు. చెట్టు మీదనుంచి ఆవరణలోకి దిగాడు. చెట్టుకున్న తాడు, పిక్కాసు పట్టుకొని తొందరగా టాంకుల వేపు నడిచాడు. టాంకు గోడలు పదహార డుగుల ఎత్తు. వాటి మీదికి ఎక్కడానికి టవరు




సమీపంలో ఒక ఇనుపనిచ్చెనుంది. అదొకటి, మళ్లా పెంకుటింటి సమీపంలో మరొకటి- ఇవి తప్ప పైకెక్కడానికి మరేవి ఆధారాలులేవు.

ఫ్లడ్‌లైటు వెల్తురు టవరు దగ్గిర మరీ ప్రకాశ వంతంగాఉంది. నేలను పడ్డ చిన్నసూదికూడ ఆ వెల్తురులో స్పష్టంగా కనిపిస్తుంది. గోపీకృష్ణ నాలు గువేపులు మళ్లా చూశాడు. పెంకుటింటి వేపు కూడా చూశాడు. ఎక్కడా జనసంచారంలేదు. మరి ఆలస్యం చేయడానికి వీలులేదు. గబగబ నిచ్చెన పట్టుకొని టాంకు గోడ మీదికి ఎక్కాడు. కుడిచేతి భుజానికి తాటిచుట్ట, దానికి కట్టిన పిక్కాసు ఉన్నాయి. టార్చిలైటు ఫాంట్ హిప్‌పాకెట్‌లో దోపా డు. తొందరగా మీదికొచ్చాడు. మళ్లా నలువేపులా చూశాడు. అంతటా నిశ్శబ్దం. పెంకుటింటి వెనుక భాగంలో లైట్లు వెలుగుతున్నాయి. ఎవరో అక్కడ పనిచేస్తున్నారు.

ఏమిటాపని?

క్లోరినేషను టాంకును చేరడానికి నాలుగు టాంకులను దాటి వెళ్లాలి. గోపీకృష్ణ రెండు టాంకు లు దాటాడు. పెంకుటింటి పక్కనున్న కర్రవంతెన దాటిపోయాడు. మరిరెండు టాంకులు దాటాలి.

పెంకుటింటి మీదనుండి వస్తున్న అంగుళంన్న రపైపు క్లోరినేషను టాంకు వరకు వచ్చి, సరిగ్గా ఇనుప చక్రం దగ్గిరే వంపుతిరిగి తిన్నగా అడుక్కు పోయింది.

ఒక్క క్షణం గోపీకృష్ణ ఇనుప చక్రం నుండి లోపలికి టార్చివేసి చూశాడు. ఏమీ కనిపించలేదు. వంపు తిరిగిన చిన్న పైపు మీద చేయిపడింది. అదిచురుకుమంటున్నది.

సాధారణంగా పెద్దపెద్ద టాంకులను కడగడాని కి, నీటిని పూర్తిగా పైకి తోడడానికి అడుగున డ్రెయిన్‌పైపులు, వాల్వులు ఉంటాయి. ఇక్కడ ఉండే టాంకులన్నిటికి అడుగున డ్రెయిన్ పైపులు న్నాయి. అవన్నీ ఒక పెద్ద పైపుకి వెళ్ళి కలిశాయి. అన్ని టాంకుల నుండి వచ్చిన అడుగునీరు ఆ పెద్ద పైపు నుండి పైకి పోతుంది. అన్ని టాంకులకు అటువంటి వాల్వులున్నాయి. కాని, ఈ క్లోరినేషను టాంకుకు రెండవ వైపు మరో వాల్వుఉంది. దాని డ్రెయిన్ పైపుపైకి కనిపించడంలేదు. మరి యీ వాల్వుదేనికి?

గోపీకృష్ణకు పెంకుటింటి నుండి వస్తున్న వేడి నీటి పైపు రహస్యం కూడా తెలియదు.

ఏం చేయాలి?

గోపీకృష్ణ మరి ఆలోచించలేదు.

తాను తెచ్చినతాడు ఇనుపరాడ్డుకు వేసికట్టాడు. బూట్లు గట్టు మీద విడిచి పెట్టాడు. ఒక అడుగు తక్కువగా టాంకులో నీరుంది. అంటే టాంకులో పదిహేను అడుగుల ఎత్తు వరకు నీరుందన్న మాట. సాయంకాలమే క్లోరినేషనయినట్లుంది.

గోపీకృష్ణ బాడీబిల్డరే కాకుండా మంచి ఈతగా డు. మెడికల్ కాలేజీకి బహుమతులు సంపా దించిన వాడు. నీటిలో ఊపిరి బిగబట్టి పది పదిహేను నిమిషాలు సులువుగా ఉండగలడు. పదిహేనడుగుల లోతున్న నీటిలో అతను దిగి రావడం ఏమంత కష్టం కాదు.

గోపీకృష్ణ చేతికున్న వాచీ, టార్చిలైటు, పర్సు, పెన్ను అన్నీ గట్టు మీద ఉంచి, తాడు పట్టుకొని లోనికి దిగాడు. ఆరడుగుల వరకు దిగేసరికి అతని కాళ్లకి ఇనుప నెట్ తగిలింది. అది నూలున్నర మందంలో ఉన్న ఇనుపచువ్వతో చేసినది. ఎవరో చాలా తెలివిగా ప్రవర్తించారు. అడుగు సంగతి ఎవరికీ తెలియకుండా జాగ్రత్తపడ్డారు. ఏడాదికో, ఆరునెల్లకో టాంకులు క్లీన్ చేసేపని కాంట్రాక్టరు అప్పలస్వామిదే అయిఉంటుంది. అన్నీ కంట్రాక్టు లవల్ల సులభంగా అవుతాయి కదా!

ఆలోచించడానికి వ్యవధి లేదు. అప్పుడే పది దాటి ఉంటుంది. తొందరగా తాడును పట్టుకొని పైకి వచ్చాడు. గట్టుమీద ఉంచిన పిక్కాసు తీసుకుని రెండవసారి లోపలికి దిగాడు. ఆ పిక్కాసుకి ఒక వంక గునపం వలే, రెండవవేపు పారవలె వెడల్పుగా ఉంది. సన్నగా ఉన్న అంచు ఇనుప జాలీలోకి దూర్చి, బలమంతా ఉపయోగించి మెడాయించా డు. ఒకచేతితో తాడు పట్టుకొని, రెండోచేత్తో ఈ పని చేయడం కష్టమయింది.

చాలాకాలంబట్టి నీళ్లో ఉన్న ఆ జాలీ బాగా పింపిరెక్కినట్లుంది. అది చాలచోట్లతెగి, అతని బరువుకి అడుక్కుపోయింది. ఈ ప్రయత్నమయేస రికి ఊపిరిపట్టు సరిపోయింది. మరోసారి మీదికొ చ్చి, ఊపిరితిత్తులనింగా గాలిపీల్చుకున్నాడు. అలసట తీర్చుకున్నాడు. మూడోసారి లోపలికి దిగే టప్పుడు అతనికి మరే ఆటంకం కలగలేదు. అడుగు భాగం వరకు దిగిపోయాడు. అక్కడ రెండంగుళాల పైపుకి వాల్వుంది. దానిలోంచి నీరు పైకి పోతోంది. చెయ్యి పైపు దగ్గిర పెడితే అది లాగుతోంది. వేడిగానున్న చిన్నపైపు చివర భాగం ఈ పైపు ముఖం వరకు వచ్చింది. ఒక్కసారి వేడినీరు, ఆవిరి చిన్నగొట్టంలోంచి వచ్చి, రెండంగు ళాల గొట్టంలోంచి పైకి పోయింది.

ఇది రహస్యం.

కాని ఈ నీరు గోనెలపాడు బావికి పోతున్నట్లు

ఎలా చెప్పడం? బహుశా మరోమంచినీటి టాంకు నుండి రాకూడదా?

ఇంతలో అతనికి ఊపిరి పట్టయిపోతున్నది.

అయితే విరిగి, లోపలికి దారిచ్చిన ఇనుప జాలీ, అతను అడుక్కి వెళ్లగానే, మళ్ళీ మీదికి వచ్చి, అతని దారిని మూసేసింది. అడుగువరకు వెళ్ళిన తాడు ఆ జాలీ కన్నంలో ఇమిడిపోయింది.

గోపీకృష్ణలో ఓ గొప్పసుగుణముంది.

ప్రమాదపరిస్థితులలో అతను కొంచెం కూడా తొట్రుపాటు పడడు.

అసలే ఆరడుగులు పొడవేమో! సులువుగా నేలను పట్టుచూసుకున్నాడు. రెండుచేతులతో తాడు పట్టుకొని మీదికి వచ్చాడు. తలకు జాలీ తగులుతుంటే, బలమంతా ఉపయోగించి దానిని మీది కెత్తాడు. చాలబలమయిన పట్టది. ఒక్కసారి విరిగిన జాలీ మీదికి పోయి అతనికి దారిచ్చింది. ఆ తొందరలో, జాలీతీగలు, విరిగినవి, పింపిరివట్టినవి, అతనిఎడమ భుజంలోకి గుచ్చుకొని ఆరంగుళాల పొడవున పెద్ద గాయాన్ని చేశాయి. నెత్తురొక్కసారి చిమ్మింది. అతను గట్టు చేరిన తరువాత చూస్తే, గోడదగ్గిర నున్న నీరంతా నెత్తుటితో ఎఱ్ఱబడింది.

ఇంకా భుజం మీద నెత్తురు కారుతునే ఉంది. పంట్లాం జేబులోని రుమాలు తడిసిపోయింది. దానిని పిండి, భుజానికి వేసికట్టి, పళ్లతో ఒక కొనపట్టుకొని ముడి బిగించాడు. లోతుగా గాయమైన మధ్య భాగాన్ని రుమాలు మడతకప్పింది. మిగిలిన భాగం గాలికి ఆరి, నెత్తురు చిక్కబడి కారడం ఆగిపోయింది.

గోపీకృష్ణ తడిబట్టలతో పరుగెత్తాడు. తాడు, పిక్కాను, వాచి, టార్చి, జోళ్లు అన్నీ వీలయిన పద్ధతిలో పట్టుకొన్నాడు. ఒక టాంకు నుండి మరో టాంకుకు దాటుతూ, ఇనుప నిచ్చెనదిగి మామిడిచెట్టు చేరేసరికి పావుతక్కువ పదకొండు అయింది.

లోపలికి వచ్చిన పద్ధతిలోనే తిరిగి ప్రహరీగోడను దాటాడు.

ప్రహరీగోడనీడలో బట్టలు పిండుకొని, వాటిని మళ్లా కట్టుకొని, తిరిగి క్లోరినేషను టాంకువేపు, ప్రహరీగోడనీడలో నడిచాడు.

అప్పుడే వాల్వు మూయడం కోసం పెంకుటింటి పక్కను ప్రహరీగోడదాటి, క్లోరినేషను టాంకువైపు పూర్వపు మనిషే వస్తున్నాడు. అతను తొందరగా వచ్చి, వాల్వుచక్రం తిప్పబోతూ, నెత్తుటితో తడిసిన గోడను చూసి బెంబేలు పడటం స్పష్టంగా కనిపించింది గోపీకృష్ణకి. ఆ మనిషి వాల్వు చక్రాన్ని తొందరగా తిప్పి పెంకుటింటి వేపు నడవడం మొదలెట్టాడు.

టాంకు గోడ మీద జాగ్రత్తగా నడవాలి, పరుగెత్తితే ప్రమాదం. జారితే నీట్లో పడతారు. అందుకే, ఆ మనిషికన్న గోపీకృష్ణ వేగంగా పెంకుటింటి వెనుక భాగం చేరుకొని నీడలో నించున్నాడు.

చక్రం తిప్పినవాడు తొందరగా ఇనుప నిచ్చెన దిగుతూ అరుస్తున్నాడు.

"పద్మనాభం! ఎవడో టాంకు మీదికి దిగాడు. నెత్తుటి ప్రవాహం. ఏమయిందో.. తొందరగా తలుపులు మూసేయ్!"

ఆ మనిషి గుమ్మం దగ్గిరికి వచ్చాడో లేదో, గోపీకృష్ణ వెనుకనుంచి అతని తల మీద బలంగా బరువైన స్పోర్ట్సు బూటుతో కొట్టాడు. అక్కడికక్కడే అతను పడిపోయాడు.

లోపల మరొక్కడే ఉన్నాడు.

"నరిసిగా! ఏమిటా కేకలు?" లోపలి నుంచి మరొకరి గొంతుక.

పడిపోయిన నరిసిగాడిని పక్కకీడ్చి, ద్వారం పక్కనే గోపీకృష్ణ నిలబడ్డాడు.

పరుగున వచ్చిన పద్మనాభానికి కూడా నరిసిగాడి గతేపట్టింది. పద్మనాభం కూడా నేలను పడిపోయాడు. అతని చేతులకు ఆరేసి వేళ్లున్నాయి. కుడిచేతికి నాలుగుంగరాలున్నాయి. ముఖంనిండా స్ఫోటకం మచ్చలు- గిరజాల జుత్తు- కౌస్తుభంగారి ఏజంటు.

మరెవ్వరూ లోపలున్నట్లు లేదు.

లోపల చాలా ప్రకాశవంతంగాఉంది.

అదో చిన్న లాబరేటరి-

అందులో పెద్ద పింగాణి అర్రా- అంతా ఎలక్ట్రిసిటీతోనే నడుస్తుంది. దానిలో సర్పగంధ- సర్పెంటినా రవుల్ఫియా వేళ్లు- వాటిని అర్రాలో ఉడకబెడుతున్నారు. ఆ మరిగిన కషాయం పైపు ద్వారా, క్లోరినేటింగ్ టాంకు వాల్వు వరకు పోతుంది. ఉడికిన వేళ్లను వేరే టేబుల్ మీద తడార్చి, గుండ చేసి, మాత్రలుగా [illegible] సీసాలలో నింపుతారు. [illegible] దుకాణంలో [illegible] ముందు [illegible] మందు- వాటి వెనుక కౌస్తుభం పంపినవి. మనుషులనుబట్టి అమ్మకం - ఈ మందు ఉపకారం చేయవచ్చు- స్వల్పం- కాని, అపకారం చేయడానికి దానిలో సత్తువేమీమిగలలేదు. అంతా క్లోరినేషను టాంకు అడుగు గొట్టాంలోంచి పైకి పోయింది.

మాత్రలు నింపుతున్న ఖాళీసీసాలు, లేబిళ్లు ఓ

నాలుగు జేబులో వేసుకున్నాడు.

దెబ్బలుతిన్న వారు కదుల్తున్నారు.

గోపీకృష్ణ తన సామానుతో పరుగు లంకించుకు న్నాడు.

సగం దూరం వచ్చేసరికి వెనుకనుంచి పడుతు న్న పేపరుమిల్లు దీపకాంతులు తగ్గిపోయాయి. టార్చిలైటు వెలిగించాడు. ప్రమాదపరిస్థితి తప్పిన దన్న నిశ్చయానికి వచ్చాడు. అడుగులు మెల్లిగా వేశాడు. కొద్ది దూరంవెళ్ళి టార్చి ఒకసారి కేబిలు ట్రెంచి వేపు వేశాడు.

గోపీకృష్ణ ఒక్కసారి ఆగిపోయాడు.

ట్రెంచి నడుస్తున్న ప్రదేశం నేలతడిగావుంది. పచ్చికదట్టంగా మొలిచింది. ఎక్కడా నీటి జాడలేని ఈ ప్రదేశంలో ఈ పచ్చిక, ఈ నీటి తడిఎక్కడి నుంచొచ్చాయి?

గోపీకృష్ణ భుజం మీదనున్నతాటిచుట్ట, పిక్కాసు నేలను పడేశాడు. వెలుగుతున్న టార్చిని భూమి మీద ఉంచాడు. అతని చేతిలో నున్న వాచీ పన్నెండు గంటలు చూపెడుతోంది.

అతను మరిఆలస్యం చేయలేదు. పిక్కాసు తీసు కొని ఆ చెమ్మ నేలను తవ్వడం మొదలుపెట్టాడు. భూమిపై పడిన మొదటి దెబ్బకి అతని భుజం మీది గాయం అదిరింది. దాని గురించి ఆలోచిస్తే ఎలా?

బాగా నీటితో తడిసిన మన్నేమో, తవ్వడం అంత కష్టమనిపించలేదు. నాలుగడుగుల చదరం గల గోతిని తవ్వడం మొదలు పెట్టాడు. నాలుగడుగు లు లోతు వరకు తవ్వాడు. మట్టిపెల్లలు పైకి విసురుతున్నాడు. ఇంకా ఎంతలోపలికి తవ్వాలో? పైకొచ్చి, దగ్గర నున్న వెదురు పొదకి తాడుకొన ఒకటి కట్టాడు. ఆ తాడు గోతిలో పడేశాడు. తప్పు కుంటూ లోపలికి పోతుంటే మళ్లా పైకి రావడం సమస్యగా పరిణమిస్తుంది.

చుట్టూ కటిక చీకటి- గోతిలో టార్చిలైటు వెల్తు రు... అయిదు... ఆరు... ఏడడుగులు.. ఇంకా మన్ను మెత్తబడి బురదగా అవుతోంది. నీరు ఊరుతోంది. మరొక్క అడుగు లోపలికి..ఖంగుమని పిక్కాసు మరొక లోహపు వస్తువును తగిలిన శబ్దం...

ఆ బురద తొలగిస్తే అక్కడ రెండంగుళాల నీటి గొట్టం- రెండు వైపులు కలిపిన జాయింటు దగ్గర నీరు కారుతోంది.

బలంగా ఆ జాయింటు మీద కొట్టాడు. పిక్కా సుతో- మూడో దెబ్బతో అది విరిగిపోయింది. పైపులో నున్న కొంచెం నీరు పైకొచ్చింది.

పనంతా ఆపేశాడు.

ఆ నీరు బాగా క్లోరిన్‌వాసన వేస్తోంది.

దీనిలో సర్పగంధి కషాయముంది.

డాక్టరు గోపీకృష్ణలో యువరక్తముంది.

ఈ నీరే గోనెలపాడు బావిలో పడుతోంది.

కంట్రాక్టరు అప్పలస్వామిగారు వాటర్ డివైనరు ను హైదరాబాదు నుంచి తెచ్చి తవ్విన జలయిది. ఈ నీరు పేపరుమిల్లు కాలుష్యం నుండి తయార యిన 'పరిశుభ్రమైన జలం'- ఈ నీటిలో డైజెస్టర్లలో వండిన కలప ముక్కలు- హెచ్చు ప్రెషరులో, టెంప రేచరులో సల్ఫేట్ క్లారాలు- హెచ్చుపాళ్లలో సల్ఫర్‌డై యాక్సైడ్- కాస్టిక్‌సోడా- సోడియం సల్ఫైడు- కర్రచే వలిగ్నిన్- దానిలోని రెసిన్- గుజ్జును చేసిన బ్లీ చింగు- సరిగ్గా ఏభై శాతం కర్రగుజ్జు మురుగు కాల్వల్లోకి పోతుంది- ఆ నీరు- రీసైకిలింగ్ ప్రా సెస్‌లో తిరిగి పరిశుభ్రమయి- కుళ్ళిన కర్రగుజ్జు, రసాయనిక పదార్థాల దుర్వాసనలు- ఆర్గానిక్, ఇనా ర్గానిక్ మెటీరియల్సు సమ్మిళితమయి- కొత్త కొత్త పదార్థాలు- లాటినేడ్ ఆటమ్సు- సాచురేటెడ్ హైడ్రో కార్బన్లు- స్టీరాయిడ్సు- హార్మోనులు- సెక్సు హార్మోను లు- సెక్సువల్ ప్రికాసిటీకి మేల్‌హార్మోనులు- ఫిమే ల్‌లిబిడోకుమేల్ హార్మోనులు- కేంద్ర నాడీ మండలం మీద ప్రభావంకల రవుల్ఫియా- సర్పెంటీనా కషాయం- ఈ నీరు పరిశుభ్రమైనదని, తాగడానికి, వంటకు, అన్నిటికీ పనికొచ్చే జలమని, రామన్నపేట నూతి నీళ్ళు పట్టుకెళ్ళి మంచి సర్టిఫికె ట్లు తెచ్చిన మహానుభావుడు అప్పలస్వామి దిగ్రేట్— అతనికి రుణపడిఉన్న గోనెలపాడు మగా ళ్ళు- అతనికో శిలావిగ్రహం లేపనెత్తడానికి తొందర పడే పెద్దలు అతను మోతాదుల్లో అందించిన కాలుష్యం గోనెలపాడు పురుషుల మగతనానికే మోసం తెచ్చి- రంగనాయకివంటి నింఫెట్లను, అల మేలువంటి నింఫోమానియక్‌లను తయారుచేసిన పవిత్ర జలం- ఇంతెందుకు, డాక్టరు నిర్మల వంటి క్రమశిక్షణాపరుల ఆటలుకట్టించి, లిబిడోపెంచి, రంగంలోకి దించిన అద్భుత జలం.

ఈ నీరు అతి స్వచ్ఛమైనదని వక్కాణించే పి.ఆర్.ఓ.మధుసూదన్-

బుర్ర బద్దలుకొట్టుకున్నా నూతిలో నీళ్లు పడవని ముందుగానే తెలుసుకొని, మాటనిలుపుకోడానికి సూడోవాటర్ డివైనరును, కేబిలు కోసం తవ్వించిన ట్రెంచిని, డ్రెయిన్ కోసం పెట్టిన వాల్వును ఉపయో గించి, అందులోకి కౌస్తుభం మందుల లాబరేటరీ నుండి సెర్పెంటిసీ- రవుల్ఫియా కషాయాన్ని మిళి తంచేసి, గోనెలపాడు ప్రజలకు మంచినీటి కరువు




లేకుండా నిరంతరం ప్రవహించే జలను పైపు లోంచి నూతికి తెచ్చిన భగీరథుడు- లాంగ్‌లివ్ అప్పలస్వామి దిగ్రేట్-

అయ్యో అయ్యో!! ఎన్ని కుటుంబాలలో నిప్పులు చెరగి, ఆనందమయ జీవితాలను విధ్వంసం చేసిన నీరు...

ఓ భగవంతుడా!...

కళ్లు తిరిగినట్లయి ఒక క్షణం గోపీకృష్ణ బురదలో కూర్చున్నాడు.

భుజం నుండి నెత్తురు బాగా కారుతోంది.

జేబులోంచి టూర్నికెట్ తీసి పీది భాగంలో కట్టాడు.

పైపులు వేరయాయి.

టాంకు నుండి నీరు తెస్తున్న పైపులో కంకరరాళ్లు కుక్కాడు. ఒక వెదురు బొంగుతో వాటిని లోనికి దట్టించాడు. పైపుకింద పెద్దరాయి పెట్టి, పిక్కాసుతో పైపు చప్టాచేశాడు. టాంకు మీదవాల్వు చక్రం ఎన్నిసార్లు తిరిగినా ఒక చుక్కనీరుకూడా నూతి వేపు వెళ్లదు. డమ్మీ అయిందా పైపు.

దూరం నుండి కోళ్ళు కూస్తున్నాయి.

పని అయిపోయింది.

గోపీకృష్ణ చాలా శ్రమతో తాడుపట్టుకొని గోతి లోంచి పైకి వచ్చాడు.




నిర్మల ఒక్కసారి ఉలిక్కిపడి లేచింది.

గదితలుపు ఎవరో తడుతున్నారు.

ఏదో ఎమర్జన్సీలా!

తొందరగా గదితలుపులు తీసింది నిర్మల.

అలానే నిల్చిపోయింది. తనకళ్ళను తానే నమ్మలేకపోయింది.

గుమ్మంలో గోపీకృష్ణ నిలబడ్డాడు. అతని పంట్లాం, బనీయను, ముఖం, తల - శరీరమంతా బురదతో నిండిపోయింది. అతనికుడిభుజాన తాటి చుట్ట దానిమీద పిక్కాసు - రెండవచేతికి కట్టు - పైనబిగించిన టూర్నికెట్ - నెత్తుటి చారలు.

"గోపీ! ఏమిటీవేషం?"

"అంతాచెప్తాను - ముందు టూర్నికెట్ విప్పి గాయానికి డ్రెస్సింగ్ చేయాలి. డిస్పెన్సరీకిపోదామా"!

"వద్దు! ఇలాబాత్‌రూముకిరా!"

తడిగుడ్డతోఒంటిమీద బురదంతా తుడిచింది. టర్కిష్‌టవలు కట్టుకోడానికిచ్చింది. బురదతో నిండిన బట్టల్ని బాత్‌రూమ్‌లో వడేసింది. వాటితోపాటు తాటిచుట్ట, పిక్కాను.

జాగ్రత్తగా గాయాల్ని డెట్టాలుతో కడిగి, కుట్లువేసింది. తానులేచిన పక్కమీద గోపీకృష్ణను పడుకోబెట్టింది. హార్లిక్స్ తయారుచేసి తీసుకొస్తానని వంటింటివేపు నడిచింది.

"నిర్మలా!"

"ఎందుకుగోపీ!" నిర్మల తిరిగి గదిలోకివచ్చింది.

"ఇంట్లో నీళ్ళతో హార్లిక్స్ కలపొద్దు."

"ఎంచేత?"

"అదంతా చెప్తాను."

"మరెక్కడి నీళ్ళు తెచ్చేది?"

"నా గదిలో టేబుల్‌మీద రెండు పెద్దసీసాలలో నీళ్ళున్నాయి. రామన్నపేట నూతినీరది - ఎలిక్జర్. అనివాటిమీద లేబిళ్ళుంటాయి. ఆ నీటితో హార్లిక్సు తయారుచేయ్!"

"ఈ మిస్టరీ ఏమిటి?"

"అంతా చెప్తానుకదా!"

చిక్కగా హార్లిక్స్ రెండు కప్పులు కలిపి తెచ్చింది నిర్మల.

గోపీకృష్ణ లేచి మంచంమీద కూర్చున్నాడు. నిర్మలకూడా అతని పక్కనే కూర్చుంది.

గోపీకృష్ణ వేడివేడి హార్లిక్స్ కొంచెంకొంచెం సిప్ చేసి నిర్మల ముఖంలోకి చూచాడు. ఫానుగాలికి ఆమె ముంగురులు కదులుతున్నాయి. చాలా నిర్మలంగా ఆమె ముఖం కనిపిస్తోంది. భుజంమీది పైట కొంచెంపక్కకు తొలగింది. తదేకంగా చూశాడు.

"డోంట్ బి సిల్లీ! "అందినిర్మల హార్లిక్స్‌తాగుతూ

గోపీకృష్ణ కొంటెగా ఆమె వక్షాన్నే చూస్తూ మెల్లిమెల్లిగా మిగిలిన హార్లిక్స్ తాగేశాడు. దాంతో బలంవ




చ్చిందో లేక ఆమె శరీరమే మత్తెక్కించిందోగానీ కొంచెం దగ్గరగా వచ్చాడు. ఆమెను తన కుడిచేతి తోనందిటిలోకి తీసుకున్నాడు.

"బి కేర్‌ఫుల్! కుట్లు నొప్పెడతాయి."

అవి పేషంటుకే - డాక్టరుకి నొప్పెట్టవు."

గోపీ కృష్ణ ఆమెను మృదువుగా స్పృశిస్తున్నాడు. ఆ స్పర్శకామె శరీరంమీద పులకలు లేస్తున్నయ్ - మెల్లమెల్లగా ఆ దంతపుబొమ్మమీద నున్న తొడుగులను తొలగిస్తున్నాడు. ఎక్కడా ఆటంకంలేదు.

ఆ అందాలరాశిని అలాగే చూస్తున్నాడు. ఆమె ఏవో మాట్లాడుతున్నది. వాటిలో మకరందం - ఆమె పెదవుల కదలికలో పూలరేకుల పరవళ్ళు - బలంగా తన పెదవులతో వాటిని ఆక్రమించి ఏదో అమృతంకోసం వెదుకుతున్నాడు.

ఏదో సుఖానుభూతి - ఏదో మృదుస్పర్శ - ఎక్కడనో పురుషుని కర్కశత్వం - ఆ చూపులలో కవ్వింపులు-

ఆమె మనసులో ఏవీ ఆలోచనలులేవు. కోపంలేదు. సరసరాల ప్రవహిస్తున్న వెచ్చటి నెత్తురు. పురుష స్పర్శకు పురివిప్పిన కోరిక - హృదయంలో ఆనందతరంగాలు లేచి - శరీరమంతా ఇంద్రియ సుఖానికి ఆయత్తమయి - ఏమి జరుగుతున్నదో తెలియనిస్థితి.

మనను శరీరం - ఉంటేఆత్మ అన్నీ నిర్వచనానికి అతీతమైన మహాసుఖంలో, దేహాలు రెండూవేరనే భావంతొలగిపోయి, వాళ్ళిద్దరూ ఒకటయిపోయారు.

నిర్మలకో శాస్త్రీయమైన కోరికఉండేది.

మొదటిది ఎక్సైట్‌మెంట్‌ఫేజ్ - దీనిలో పల్సురేటు పెరుగుతుంది. బ్లడ్‌ప్రెషర్ హెచ్చుతుంది. నెత్తురుశరీరమంతా ప్రవహిస్తుంది. చర్మం జెంపరేచరు అధికమవుతుంది. వక్షోజాలు, చూచుకాలు పొంగుతవి.- ఊపిరి తొందరతొందరగా తీయడం జరుగుతుంది. శరీరం కలయికకు సన్నద్ధమవుతుంది. కండరాలలో బిగువు ప్రస్ఫుటమవుతుంది.

రెండవది ప్లాటోఫేజ్ - పీఠభూమి వంటిది - ఇదికొద్దికాలమే - ఉద్రిక్తత పొడిగిస్తే ఆర్గజమ్ - అది పదిసెకండ్లుమాత్రమే ఉంటుంది.

ఇవి ఆనందానుభూతియొక్క వివిధదశలు.

ప్రథమ సమాగమంలో ప్రతిదశను ఆమెజ్ఞాపకముంచుకోదలచింది. కాని, అన్నీ ఆమె మహదానందంలో మరచిపోయింది.

కిటికీలోంచి లోపలికి ప్రవేశించినవెల్తురు యువశరీరాల సౌందర్యాన్ని దాచలేకపోయింది.

విశాలమైన గోపీకృష్ణ వక్షంమీద ముఖంపెట్టుకుంది నిర్మల.

"గోపీ! ఇదంతా నిజమా?"

గోపీ నవ్వుతూ ఆమె ముంగురులను పక్కకుతోసి పెదవులను ముద్దుకున్నాడు.

"నిర్మలా! మనిద్దరం మెల్లగా రామన్నపేట నూతి

కి స్నానానికిపోదాం. నేనుసాధించినదంతా నీకు దారిలో చెప్తాను. గోనెలపాడు బావినీళ్ళు మళ్ళీము ట్టుకుంటే ఈ అనుభవమంతా కలకుమల్లే కరిగిపో తుంది.''

''నిజమా?''

ఆమె అతని సందిటిలో ఇమిడిపోయింది.

ఇద్దరులేచి బట్టలువేసుకొని రామన్నపేట నూతి వేపు నడిచారు.

రామన్నపేటలో సింగమ్మనుచూచినప్పుడు తన లోకలిగిన మార్పు దగ్గిరనుండి, వెదురుపొదలమ ధ్య బావికినీరు వస్తున్నవైపు విరక్కొట్టి డమ్మీచేయ డంవరకు ఆమెకు వివరంగా చెప్పాడు.

నిర్మల అంతావిని దారిలోనే గోపీకృష్ణను కావ లించుకొని, ముద్దుపెట్టుకుంది.

''గోపీ! ఏం చెప్పడం? ఈ గొప్పనమస్యవెనుక ఇంత నిర్లక్ష్యముందని కలలోకూడా నేననుకోలేదు.''

ఇద్దరూ స్నానాలు ముగించి, నీళ్ళుపట్టుకొని డిస్పెన్సరీవేపు నడుస్తున్నారు.

''గోపీ! మనమిక్కడికి వచ్చినపని అనుకూలంగా ముగిసింది. మర్యాదగా మనం వెళ్ళిపోవచ్చు.''

''నిర్మలా! కొంచెం పనిమిగిలిపోయింది. గోనెల పాడుబావి కప్పించేవరకు ప్రమాదం దాటిపోదు. గ్రామంలోని పెద్దమనుషులు మనమాటలు నమ్మ రు. తిరిగి కంట్రాక్టరు అప్పలస్వామిని రంగంలోకి తెస్తారు. ఆ మహానుభావుడు...'' చెప్తూ ఆగిపోయా డు గోపీ.

నిర్మల గోపీ ముఖంలోకి చూచింది.

''ఆ మహానుభావుడు హైదరాబాదులో ఉన్నా డు. అక్కడినుండి ఢిల్లీకివెళ్తాడు. నేనే ఆ యేర్పాటు లు చేశాను. చీఫ్ ఇంజినీరు మా పినతండ్రి. ఈ లోగా పనులన్నీ ముగిసిపోవాలి.''

''ఎంత ప్రీ ప్లానింగ్ చేశావు.''

''నీతో చెప్పలేదు. మరేం అనుకోవద్దు.''

''లేదు, లేదు. ఒక్కరి ఆలోచన చాలా మంచిది, ఇటువంటివాటిల్లో- ఇవాళనుండి నా స్పెషలులేడీ పేషంట్లకు పాఠాలు ఆపుచేస్తాను.''

''డాక్టర్ నిర్మలా! నేనుచేసిన ప్రయత్నం పురుషు లలో పోయిన మగతనాన్ని తీసుకొస్తుంది. నీ ప్రయ త్నం వారి దాంపత్య జీవితాలకొక కొత్త ఆనందం సమకూర్చుతుంది. ఈ స్త్రీలు తమ పురుషులను ప్రేమించడమే కాకుండా, పురుషులు మెచ్చేవి ధంగా సుఖాన్ని ఇస్తారు. ఇది చాలా గొప్పవి షయం.''

''త్రీ ఛీర్స్ టు డాక్టర్ గోపీ!''

డాక్టరు నిర్మల గోపీచేతిలోని వాటర్‌కాన్ తనరెండోచే తిలోకి తీసుకొని ముందుకినడిచింది.

★ ★ ★

గోనెలపాడులో ఉదయం ఎనిమిదికే హాహాకారాలు చెలరేగుతున్నాయ్.

ఉన్నట్లుండి బావినీరు లోపలికెళ్ళిపోయింది.

పదిహేనడుగులతాడుతో హాయిగా నీళ్ళు తోడు కునేవాళ్ళు. మూడురోజులకింద ఆతాడు చాల కుండా పోయింది. అప్పుడప్పుడు నీటిమట్టం తగ్గేది. కాని మర్నాటికే యథాప్రకారం నీటిమట్ట ముండేది. ప్రజలు జల మహిమను కొనియాడేవా రు. మరి యీరోజు ఆ జల ఏమయిపోయింది?

రెండోరోజుకి నీళ్ళుబాగా లోపలికిపోయాయి. రెండుతాళ్ళు ముడేస్తే నీరు అందీఅందనట్ల యింది. తోడుకునే వాళ్ళచేతులు ముక్కలవుతు న్నాయి. ఈ నీళ్ళు పోస్తే పశువులు కుడితి ముట్టుకో వడంలేదు. ఏదో కుళ్ళినవాసన, ఎలకచచ్చినకంపు వస్తున్నట్లు అనుమానం. ఎలాగో కక్కుర్తి పడదామ న్నా ఆ నీళ్ళుకూడా అందుకు రాకుండా అడుక్కుపో యాయి.

పంచాయతీ ఆఫీసుముందు ఆడవాళ్ళు మగవా ళ్ళుపోగయ్యారు. వాళ్ళకి జవాబులు చెప్పేందుకు రామునాయుడుగారు, నరసింహారావు పంతులుగా రు శాయశక్తులా ప్రయత్నిస్తున్నారు. నిన్ననే గౌరవ నీయులైన మంత్రిగారికి చాలాపెద్ద టెలిగ్రాము పంపించి, విజయగర్వంతో కులుకుతున్నవారికి, మేఘంలేని ఆకాశంనుండి పిడుగు పడ్డట్టు ఊరి బావి ఇంకి పోతోందన్న వార్తచాలానిరాశ కలి గించింది. వెంటనే చాకలి చంద్రయ్యను రామన్న పేట పంపించారు. కంట్రాక్టరు అప్పలస్వామిగా రితో ఈ సంగతిచెప్పి ఉన్నపళంగా అతన్ని తీసుకు రమ్మని కబురు పంపించారు.

అందరూ వేయికళ్ళతో చంద్రయ్యరాకకోసం ఎదురుచూస్తున్నారు.

కాలం చాలా నెమ్మదిగా సాగుతోంది.

సరిగ్గా పదిగంటలకు చంద్రయ్య తిరిగొచ్చాడు. కంట్రాక్టరు అప్పలస్వామిగారు ఊళ్ళోలేరు. హైద రాబాదుపోయారు. వారంరోజులవరకు తిరిగిరారు.

మరేంచేయడం?

ఈ విపత్తుకి చక్రంవేయగల మొనగాడెవడు?

ఆ గుంపులో కౌస్తుభం ఎక్కడా కనిపించలేదు. పోలీసులతనికోసం వెతుకుతున్నారు. ఆరువేళ్ళ పద్మనాభంతోకలిసి అతను మూడురోజుల క్రిందే




ఎం-ఎయిపాయాడు.

"ఒరే చంద్రిగా! అప్పలస్వామిగారి కుడిభు జంలేడురా...అతనే - ఆ రామిరెడ్డి?"

"నాయుడు బాబుగారూ! ఆరినికూడా కలిసిచెప్పా ను. ఆ రెడ్డిగారు నూనుకుంటానన్నారు. రేపుదయం సరికి నీరుమామూలుగా వస్తుందన్నారు. జలకి అడ్డమొచ్చిందేమోనన్నారు."

అందరూ ఎగిరి గంతేశారు.

వడ్రంగి చిన్నయ్య మాత్రం సద్దుమణిగిన తర్వాత గోపీకృష్ణ దగ్గిరికివెళ్ళి జరిగినదంతా చెప్పాడు.

"చిన్నయ్యా! నీకు విషయమంతా చెప్పాను. రామిరెడ్డి తనమనుమలతో ఈ రాత్రి పైపులైను బాగుచేస్తాడు. మీరుమాత్రం ఊరుకున్నారా, మళ్ళా మీ మొగతనం పోగొట్టేనీరు నూతిలోకి వస్తుంది. ఒక సంగతి మీకందరికీ తెలుసు. కంసాలి కామమ్మ శాపమిచ్చింది కదా! ఈబావి నీళ్ళు తాగినవాళ్ళంతా పుంసకత్వం లేకుండా పోతారని - మరి మీరే ఆలోచించుకోండి."

ఆ రాత్రి వడ్రంగి చిన్నయ్య, మరో పదిమంది, వెదురుపొదల్లో పైపులైను బాగుచేయడానికి ప్రయత్నంచేసిన రామిరెడ్డిని, అతని మనుమ్మలని చితకదన్ని రామునాయుడు ముందు పడేశారు.

ఊళ్ళో వాళ్ళందరూ వెర్రులెత్తి పోతున్నారు.

నాలుగోరోజు ఉదయం ఎవరింట్లోను పొయ్యిలు ముట్టించలేదు.

సరిగ్గా ఎనిమిదిగంటలకి రామన్నపేట నుండి మొదటివాటరుటాంకు మంచినీళ్ళు పట్టుకొచ్చింది. రామన్నపేట పంచాయతీవారికి అటువంటివి మరి మూడు టాంకులున్నాయి. వాటినన్నిటినీ కడిగి, డీసెలు పంపుతో పొలాల్లోని నూతినీరు నింపి పంపించారు.

అన్నీ గోపీకృష్ణ ఊహించినట్లే జరిగాయి.

ఊరి పెద్దలు టెలిగ్రాము ఇవ్వాలని గర్జించారు. రామిరెడ్డిని తన్ని ఊరిమనుమలు తీసుకొచ్చి, అతనిని గౌరవించి పంపించారు. అతడు కంట్రాక్టరు అప్పలస్వామి కుడిభుజం - ఈ అవమానం అప్పలస్వామిదేనని వాళ్ళు భయపడ్డారు.

కాని, ఈ పెద్దమనుమలలో ఒక్కరుకూడా, ఊరి ప్రజలకు ఒక్కచుక్క నీరయినా తెప్పించిన పాపాన పోలేదు. దానిగురించే వాళ్ళు ఆలోచించలేదు.

గోపీకృష్ణ వారి వంతుకూడా చాలాముందుగా ఆలోచించాడు.

మూడురోజులయింద, సాయంకాలం డ్రైవరు నిర్మలతో రామన్నపేట పేరుగాపాలెం జరిగిన సంగతంతా సీతంనాయుడుగారితో చెప్పాడు.

"మా బావమరిది సిరిపురం ఎమ్మెల్లే. వాడికి రేపే ఈసంగతి చెప్తాను.

"చెప్పడంతో సరిపోదు. అతను పబ్లిక్‌వర్క్సు డిపార్టుమెంటు మంత్రిగారినికలిసి, రామన్నపేట నూతులనుండి గోనెలపాడుగ్రామానికి పైపులైను వేసి, నీళ్ళుసప్లయ్ చేయాలని చెప్పాలి. అంతవరకు మీరు మీనాలుగు టాంకర్లతో మంచినీరు గోనెలపాడుకి సరఫరాచేయించాలి."

"అదెంతపని. మంత్రిగారు మా బావకి బాగాతెలుసు. మూడునెలల వ్యవధిలో గోనెలపాడుకి పంపులు తెప్పిస్తాను. అంతవరకు మా వూరిపంచాయతీ టాంకర్లతో నీరు సప్లయ్‌చేస్తాను."

అన్నీ పకడ్బందీగా జరిగిపోయాయి.

గోనెలపాడువారికి గంగాదేవి రామన్నపేటనుండి వస్తోంది.

ఊరిబావి మాటేవాళ్ళు మరచిపోయారు. వాటరుటాంకులు ఇంటి గుమ్మాల్లో నీళ్ళుసరఫరా చేస్తున్నాయి.

గోపీకృష్ణమాత్రం గోనెలపాడుబావి సంగతి మరిచిపోలేదు. వడ్రంగి చిన్నయ్యను పిలిపించాడు.

"చిన్నయ్యా! ఎన్నిమనంచేసినా కంసాలికామమ్మ శాపంమాత్రం తప్పించలేదుకదా!"

"డాక్టరుబాబూ! శాపం శాపమే!"

'అందులో ఓ కిటుకుంది. ఈ వూరిమొగాళ్ళు బావినీరు తాగితే నపుంసకులవాలని శపించింది. నూతిలో ఎలానునీరులేదు. వర్షాలుకురిసి నీరుచేరితే మళ్ళాశాపం అమలులోకి వస్తుంది. అందుకోసం ఈ నూతిని కప్పడం మనకర్తవ్యం. ఇప్పటికి మూడురోజులయి మీరురామన్నపేట నీరుతాగుతున్నారు. అందరూ ఆనందంగా వున్నారు. ఇదే సమయం - తలోరాయివేస్తే నూయిఏమిటి చెరువులు, సముద్రాలుకూడా కప్పొచ్చు."

కిందటిదినంనుండే చిన్నయ్య గౌరమ్మయింటికి వెళ్తున్నాడు.

అయిదోరోజు ఉదయం ఆరయేసరికి ఒకరూ ఒకరూ గోనెలపాడు బావిదగ్గిరికివచ్చి, వరుసలో నిల్చొని, తలమీద మోసుకొచ్చిన పెద్దరాళ్ళని నూతిలో వేయడం మొదలుపెట్టారు. రామునాయుడుగారు, నరసింహారావు పంతులుగారు మొరపెడుతున్నా ఎవరువినలేదు. ఇలా మూడురోజుల్లో గోనెలపాడుబావి పూర్తిగా కప్పడిపోయింది. కొంతమంది

సిమెంటు, ఇసుకతెచ్చి, నూతిపైభాగాన్ని ప్లాస్టరింగ్ చేసి పెద్దదిమ్మగా తయారుచేశారు.

వారంరోజులలో రామన్నపేట నూతినీరు తాగిన ప్రజల్లో గొప్పమార్పు వచ్చింది.

నారాయణశెట్టిగారు ఇప్పుడు ఉయ్యాల మంచంమీద నిద్రపోవడంలేదు.

రామునాయుడుగారు పేకాటకి వెళ్ళడంలేదు.

నరసింహారావు పంతులుగారు పెళ్ళాం కొంగు విడవకుండా తిరుగుతున్నారు.

మరి వెంకట్రావా? అమాంతంగా రంగనాయకిని ఎత్తుకుపోయి తోటలో తనప్రతాపం చూపించాడు.

చిన్నయ్యా మొదలైన వాళ్ళు సరేసరి.

వరహాలు మాత్రం భర్తతో కలిసిన మరునాటి ఉదయం డాక్టరు నిర్మల దగ్గరికివచ్చి తన ఆనందాన్ని తెలియజేసింది. నిర్మల చెప్పిన పాఠాలు చాలా గొప్పవని, ఆనందరావు సంతోషం చెప్పశక్యం కాదని అంది.

ఆరోజు మధ్యాహ్నానికి ఇద్దరు డాక్టర్ల ఉద్యోగాలు పీకేస్తూ మంత్రిగారి నుండి టెలిగ్రామువచ్చింది.

ఆ సాయంకాలం ఊరిలో పెద్దలు, స్త్రీలు - శాపవిముక్తిచెందిన వాళ్ళంతా డిస్పెన్సరీకివచ్చారు.

డాక్టరు గోపీకృష్ణను, డాక్టరు నిర్మలను అభినందించారు.

"మీకు కలిగినపీడ విరగడయినందుకు మేము సంతోషిస్తున్నాము. మేము మీ అందరిదగ్గర శెలవు తీసుకుంటున్నాము. సీతంనాయుడుగారు మాకోసం బండిపంపించారు. ఈ రాత్రి రామన్నపేటలో ఉండి రేపు వెళ్ళిపోతాము. సీతంనాయుడుగారు మనవూరికి చాలాసహాయం చేస్తున్నారు. ఎకరంభూమిలోనున్న రెండునూతులు ఉదారంగా ఇచ్చారు. ఆ నీటిని పంపులద్వారా మనకు అందించడానికి ఏర్పాటులు చేస్తున్నారు. మూడునెలల్లో మీ వీధివాకిళ్ళలో మంచినీటి పంపులు వస్తాయి.

"మీరందరూ గోనెలపాడుబావిని కప్పి కంట్రాక్టరు అప్పలస్వామిగారి శిలా విగ్రహానికి పెడస్టల్ తయారుచేశారు. విగ్రహం ప్రతిష్ఠించినప్పుడుమాత్రం, దానికింద ఇలాచెక్కించండి:

"గోనెలపాడు పురుషులను నపుంసకులుగా చేసిన మహానుభావుడు."

చప్పట్లు కొట్టారందరూ!

(సమాప్తం)

---

(ఇంతవరకు మీరు చదివింది నవల.

దీనికి ఆధారం పత్రికలో వచ్చిన ఈవార్త:

**27-2-1986** - భోపాల్ - రెండు సంవత్సరాల క్రింద ఒక గ్రామంలో గొట్టపుబావొకటి తవ్వారు. ఆ గ్రామంలోకల పురుషులందరూ ఆ నీరు తాగి నపుంసకులయారు.

ఆ నీరు చాలామంది యువకుల జీవితాలను నాశనంచేసింది. చాలాకుటుంబాలు విచ్ఛిన్నమవడానికి సిద్ధంగా ఉన్నాయి.

పబ్లిక్‌హెల్తు మినిష్టరుగారు ఈ ఆరోపణలను ఖండించారు. క్రిందటి సంవత్సరం పదిమంది శిశువులు ఆ గ్రామంలో జన్మించారు. ఈ ఫిర్యాదులన్నీ సత్యదూరమయినవి-అంటూ

నీరు తాగడానికి పనికిరాదని తెలుసుకొని, గొట్టపుబావిని కప్పేశారు.

ఈ నీటిని పరీక్షకోసం నేషనల్ రిసెర్చి ఇనిస్టిట్యూట్ - నాగపూరుకు పంపించారు. ఆ సంస్థవారు ఈ నీరు నపుంసకత్వం కలిగిస్తుందో లేదో చెప్పలేమని తమ అసమర్ధతను వ్యక్తం చేశారు.

తరువాత ఈ విషయం

★ సెంట్రల్ డ్రగ్ ఇన్‌స్టిట్యూట్, కాన్పూరుకి

★ నేషనల్ ఫామిలీ ప్లానింగ్ ఇన్‌స్టిట్యూటు, న్యూఢిల్లీకి తెలియజేశారు.

వారినుండి జవాబులు (అప్పటికి) రాలేదు.

మధ్యప్రదేశ్‌లో మెరేనా జిల్లాలో దంతేటి అన్నగ్రామముంది. ఆ గ్రామంలోగల పురుషులు గడచిన సంవత్సరం తమలో నపుంసకత్వ చిహ్నాలు మొలకెత్తుతున్నట్లు తెలుసుకున్నారు.

తొలిదినాల్లో వాళ్ళీవిషయం ఎవరితోను ప్రస్తావించకుండా మౌనం వహించారు. ఇది వ్యక్తిగత సమస్యగా వారు భావించారు. క్రమంగా ఈ వార్త అంతటా వ్యాపించింది. అప్పుడువాళ్ళోనిజం తెలుసుకున్నారు. గ్రామంలోని పురుషులందరూ ఒక విధమైన వింతవ్యాధితో బాధపడుతున్నారు. కాని, ఆ వ్యాధిగురించి ఎవరితోను చెప్పుకోలేకపోతున్నారు.

ఈ సంఘటన పరిసరాలలో భయాన్ని సృష్టిస్తోంది.

గడచిన సంవత్సరం కొంతమంది శాసనసభ్యులు, రాజ్యసభ సభ్యులు ఆ గ్రామానికి విచ్చేశారు. ముఖ్యమంత్రిగారికి ఒక ఉత్తరంకూడా వ్రాశారు.

**28-2-1986** ఇండియన్ ఎక్స్‌ప్రెస్ దినపత్రిక - మొదటి పేజీలో వచ్చినవార్తకిది సంగ్రహానువాదం.)

# రెండు వ్యవస్థలు – రెండు సమాజాలు





## బల్గేరియా

**ఆ**హ్లాదకరమైన వాతావరణం, సకల సదుపాయాలు కలిగిన భవనాలు, విశాలమైన రోడ్లు, ఎంతదూరం పారజూచినా పచ్చపచ్చగాకనపడే పంటపొలాలు, రమణీయమైన పూలతోటలు, ఓ మాదిరి ఎత్తయిన పర్వతాలు, ఉల్లాసాన్నిచ్చే నల్లసముద్రం, బంగారుఛాయలో మెరిసే బీచ్లు షికార్లు చేయటానికి అన్ని హంగులు కలిగిన చోట్లు, ఎన్నెన్నో ఆకర్షణలు, ఇవన్నీ బల్గేరియాలో ఉన్నాయి. అందుకే ఆ దేశం ఐరోపా ఖండంలో ప్రముఖ టూరిస్టు దేశమై దేశదేశాల ప్రజలనీ ఆకట్టుకొంటున్నది. టూరిజం ఒక పెద్ద పరిశ్రమగా వర్ధిల్లుతూ భారీ మొత్తంలో విదేశీ ద్రవ్యాన్ని ఆర్జిస్తూ బల్గేరియా ఆర్థిక వ్యవస్థలో కీలకపాత్ర వహిస్తున్నది. కేవలం 90 లక్షల జనాభా కలిగిన బల్గేరియాను ఏటా 60 లక్షల మంది యాత్రీకులు సందర్శిస్తున్నారంటే అక్కడ టూరిస్టులకు గల ఆకర్షణలు, సదుపాయాలు ఎలాంటివో ఇట్టే ఎవరైనా ఊహించుకోవచ్చు.

నలభై రెండేళ్ళ క్రితం టర్కీపాలనలో మగ్గుతూ ప్రపంచంలోని పేదదేశాలలో ఒకటిగా ఉండేది బల్గేరియా. రష్యా సైనిక సహాయంతో 1944 లో టర్కీ నుంచి విముక్తి పొందింది. తరువాత అక్కడ ప్రజాప్రభుత్వం ఏర్పడింది. సోషలిస్టు వ్యవస్థకు అంకురార్పణ జరిగింది. క్రమంగా ఆ వ్యవస్థ పటిష్టమవుతూ వచ్చింది. ఫలితంగా బల్గేరియా రూపురేఖలే మారిపోయాయి. ఇప్పుడక్కడ నిరుద్యోగ సమస్యలేదు. పౌర జీవనానికి అన్ని రకాలుగానూ భద్రత ఏర్పడింది. ఉత్పత్తి, పంపిణీ అంతా ప్రభుత్వ రంగంలోనే సాగుతోంది. సామాన్యులను దోచుకునే దళారులు అక్కడలేరు. ప్రజలందరూ క్రమశిక్షణతో కష్టపడి పనిచేస్తారు. విశ్రాంతి సమయాన్ని విలాసంగా గడుపుతారు.

నేటి బాలలే రేపటి పౌరులు. వారికి బంగారు భవిష్యత్తును ఏర్పరచాలంటే చిరుతప్రాయం నుంచే వారిలో మనోవికాసాన్ని ప్రోదిచేయాలి. బాల్యంలోనే వారి అభిరుచులు ఎలా ఉన్నాయో,



అన్ని రంగాల్లోనూ పురుషులతో సమానంగా ఉద్యోగం చేసే స్త్రీలు·

అవిఎలా మలుపు తిరుగుతున్నాయో గమనించాలి అనేది పాలసీగా అందుకు తగిన సాంఘిక వ్యవస్థ బల్గేరియాలో రూపొందింది. సకల సౌకర్యాలు, అన్ని హంగులూ కలిగిన పాఠశాలలు, హాస్టల్ భవనాలు, మానసిక ఉల్లాసానికి తోడ్పడే తోటలు అన్ని గ్రామాలలోనూ ఉన్నాయి. అక్కడ ఉపాధ్యాయులకు తగిన గౌరవం లభిస్తుంది. సగటున ప్రతి పదిమంది విద్యార్థులకు ఒక్క ఉపాధ్యాయుడు ఉంటాడు.

బల్గేరియాలో బాలలు అదృష్టవంతులని చెప్పుకోవచ్చు. కేవలం తల్లిదండ్రులేకాదు ప్రభుత్వం కూడా వారి ఆనందానికి, అభివృద్ధికి అన్ని సదుపాయాలూ కల్పిస్తుంది. తల్లిదండ్రులు స్వయంగా తమ బిడ్డలను పెంచుకోవచ్చు. అందుకిష్టపడనివారు బాలల సంక్షేమ గృహాలలో చేర్పించవచ్చు. ఆ గృహాలలో ఆట పాటలకు అవసరమైన అన్ని రకాల పరికరాలూ ఉంటాయి. బిడ్డను పెంచటానికయ్యే ఖర్చునంతా ప్రభుత్వమే భరిస్తుంది. విద్య, వైద్యం, పుస్తకాలు, దుస్తులు అన్నీ ఉచితం. ఫీజులు లేవు. వారి భవిష్యత్తును తీర్చిదిద్దడానికి ప్రభుత్వం అన్ని జాగ్రత్తలూ తీసుకుంది. అందుకే బల్గేరియా సాంఘిక వ్యవస్థకు బలమైన పునాది ఏర్పడింది.

## మహిళల ఆధిక్యత

బల్గేరియాలో స్త్రీలకు అన్నిరంగాలలోను పురుషులతో సమాన హక్కులున్నాయి. ఒకరిపై ఒకరికి ఆధిక్యతలేదు. ఎవరికైనా చేసేపనినిబట్టి జీతం. డాక్టర్లు, ఇంజినీర్లు, శాస్త్రవేత్తలు, అధ్యాపకులు వంటి ఉన్నతస్థాయి హోదాలలో 40 నుంచి 50 శాతం వరకు స్త్రీలే ఉన్నారు. టూరిజం పరిశ్రమలో స్త్రీలదే పైచేయి. టూరిస్టు గైడ్లు, ఇంటర్‌ప్రెటర్లుగా స్త్రీలే ఎక్కువగా కనపడుతుంటారు. అన్ని రకాల దుకాణాలలోను, హోటళ్ళలోను స్త్రీలే ఎక్కువగా ఉద్యోగాలు చేస్తున్నారు. అసలు వంపిణీ వ్యవస్థ అంతా వారిచేతిమీదుగానే నడుస్తున్నదేమో అనిపిస్తుంది. చాలా చక్కగా మాట్లాడతారు. మనభాష తెలియకపోయినా మనం చెప్పేదేమిటో అర్థంచేసుకోటానికి ప్రయత్నిస్తారు. మనవారి మాదిరి సిగ్గు, బిడియంవంటివి వారిలో కనపడవు.

ప్రభుత్వ పరంగా స్త్రీలకు కొన్ని రాయితీలు

బల్గేరియాలో వ్యవసాయానికి ఆధునిక యంత్రాల వాడకమే ఎక్కువ!

న్నాయి. గర్భిణీ స్త్రీలు ప్రసవసమయానికి ముందు మూడునెలల నుంచి ఒక సంవత్సరంపాటు సెలవు తీసుకోవచ్చు. ఆ సెలవుకాలంలో పూర్తి జీతం లభిస్తుంది. కావాలనుకుంటే ఆ తరువాత మరోరెండేళ్ళు సెలవు తీసుకోవచ్చు. కాని ఆ సెలవు కాలానికి జీతం ఇవ్వరు. సర్వీసు బ్రేకుమాత్రం ఉండదు. తనఉద్యోగానికి, విలాసాలకు బిడ్డలవల్ల ఇబ్బందిఏర్పడుతుందనుకుంటే పుట్టిన సంవత్సరానికే ఆ బిడ్డలను బాలల సంక్షేమ గృహాలలో చేర్పించవచ్చు. అప్పుడప్పుడూ వెళ్ళి చూసుకోవచ్చు. స్త్రీలందరూ ఉద్యోగస్తులేకాబట్టి ఆర్థికంగా పురుషులపై ఆధారపడరు. తమ ఆదాయాన్ని తమ కిష్టమైన రీతిలో ఖర్చుచేసుకుంటారు. విడాకులు తీసుకోవటం కూడా చాలా సులభం. వివాహానికి ముందే స్వేచ్ఛగా పురుషులతో కలసి తిరగవచ్చు. బిడ్డలను కూడా కనవచ్చు. అది అక్కడ తప్పుకాదు. చట్టపరమైన అన్ని రక్షణలూవారికున్నాయి.

## వ్యవసాయం

ఒకప్పుడు మనమాదిగానే ఎటువంటి సదుపాయాలు లేకుండా ఉన్న వ్యవసాయరంగం గత నలభైయ్యేళ్ళలోగణనీయంగా అభివృద్ధి చెందింది. ఇప్పుడు వ్యవసాయమంతా భారీ యంత్రాలతో నిర్వహిస్తున్నారు. ట్రాక్టర్లు, హార్వెస్టర్లు, ప్లాంటింగు, ప్రాసెసింగు మిషన్లు ఎన్నెన్నో భారీ యంత్రాల వినియోగంతో బల్గేరియా వ్యవసాయరంగంలో విప్లవాత్మకమైన మార్పులు వచ్చాయి. తక్కువ మానవ శ్రమతో అత్యధిక యాంత్రికశక్తిని వినియోగించుకొని అభిలషణీయమైన ఉత్పత్తిని సాగిస్తున్నారు. వర్షాలు తక్కువ కాబట్టి మంచుకరగటంవల్ల వచ్చేనీటిని

జాగ్రత్తగా వినియోగించుకొంటున్నారు. విస్తీర్ణా న్నిబట్టి చూస్తే మన రాష్ట్రంలో నగమైనాలేని బల్గేరియాలో సుమారు రెండు వేల నీటి ప్రాజెక్టు లు, ఇరవైవరకూ ఓ మోస్తరు పెద్దప్రాజెక్టులు ఉన్నాయంటే మనకు ఆశ్చర్యం కలుగుతుంది. ఇవిచాలక అవసరమైనచోట్ల మూడువేల అడు గులలోతు వరకు సైతంవెళ్ళి భూగర్భజలాలను పైకితీసుకొస్తున్నారు. వ్యవసాయక్షేత్రాలను చూ స్తుంటే కడుపునిండిపోతుంది. గట్లు తక్కువ. తారు. అకాలవర్షాలు వచ్చి పైర్లుపాడవుతాయనే భయంలేదు. గ్రీన్‌హౌస్‌లు నిర్మించుకొని అవస మైనంత నీటిని ఉష్ణోగ్రతను ఇచ్చి పంటలు పండిస్తున్నారు. ముఖ్యంగా టొమాటాలు, కుకుంబా వంటి కూరగాయలు, ఆకుకూరలు, పూవులు వంటివాటిని ఈ గ్రీన్‌హౌస్‌లలో పండి స్తున్నారు. యాభై అరవై ఎకరాల భూమిని ఒక్కొక్క గ్రీన్‌హౌస్‌గా రూపొందిస్తారు. రెండు న్నర మీటర్ల ఎత్తు వరకు ఇనువస్తంభాలువేసి



ఉత్తర బల్గేరియ లోని సమిష్టి వ్యవసాయక్షేత్రంలో పనిచేస్తున్న స్త్రీలు

కనుచూపు మేరవరకు ఒకే కమతంగా కనపడు తుంది. బల్గేరియా వ్యవసాయరంగం ప్రకృతిని జయించిందేమో అనిపిస్తుంది. వర్షాలకోసం ఎదురు చూడరు. పైపులద్వారా రెండు, మూడు గజాల ఎత్తుకు నీరు తీసుకెళ్తారు. వర్షం పడుతు న్నట్లుగానే ఆపైపులద్వారా పంటపై నీటిని చల్లు

ఆపై డోముఆకారం వచ్చేట్లు ఏర్పాటు చేస్తారు. పాలిథిన్ పట్టాలతో ఆ డోములను కప్పుతారు. అందువల్ల అకాలవర్షాలవల్ల పంటలు దెబ్బ తింటాయన్న భయంలేదు. ఆ గ్రీన్‌హౌస్‌లలో టొమాటా, కుకుంబా వంటి మొక్కలను తాళ్ళతో కట్టిపైకి పాకిస్తారు. తక్కువ విస్తీర్ణంలో ఎక్కువ మొక్కలువేసి అధికఫలసాయంతీస్తారు.

గోధుమ, మొక్కజొన్న, ద్రాక్ష, పొగాకు, పశు

దక్షిణమధ్య బల్గేరియాలోని 'ప్లావ్‌దీవ్'వైను తయారీ ప్రాంతాలకి కేంద్రం.

గ్రాసం, పొద్దుతిరుగుడు పువ్వులు తదితర పంటలు బల్గేరియా వ్యవసాయోత్పత్తులలో అధికస్థానాన్ని ఆక్రమిస్తున్నాయి. ధాన్యం కూడా పండుతుంది.

కాజన్‌లన్‌జిల్లా గులాబీ తోటలకు ప్రసిద్ధి చెందింది. గులాబీల నుంచి నూనె తీసి సెంట్లు తయారుచేసి విదేశాలకు ఎగుమతి చేస్తున్నారు. ఒక కిలో గులాబీ నూనెధర ఒక కిలో బంగారంధరతో సమానమట. ఈ గులాబీతోటలలో మాత్రం యంత్రాలను వాడటంలేదు. స్త్రీలే ఎక్కువగా ఈ తోటల్లో పనిచేస్తూ కనిపిస్తారు.

కేవలం నలభైయేళ్ళలో బల్గేరియా వ్యవసాయరంగం ఇంత అభివృద్ధిని ఎలా సాధించింది? టర్కీ పాలనలో ఉన్నప్పుడు భూములన్నీ టర్కీ భూస్వాముల చేతుల్లో ఉండేవి. పోరాటాలుచేసి టర్కీపాలనను అంతం చేసిన తరువాత టర్కీ భూస్వాములు తమ భూములను బల్గేరియాలోని కొందరు మోతుబరులపరంచేసి వీలైనంతవరకు సొమ్ము చేసుకొని తమదేశానికి పలాయనం చిత్తగించారు. ఆ దశలో బల్గేరియాలో భూస్వామ్య వ్యవస్థ ఏర్పడింది. తరువాత సోషలిస్టు విధానంలో భాగంగాసహకార సంఘాలు రూపొంది ఆ భూములన్నీ ఆ సంఘాలవరమయ్యాయి. ఇప్పుడు ఐదారువేల ఎకరాలకో సహకార సంఘం ఉంది. ఆ సంఘం పాలకవర్గం సమష్టి నిర్ణయాలు చేస్తుంది. వ్యవసాయాధార పరిశ్రమలను కూడా ఆయా సంఘాలే నిర్వహిస్తున్నాయి. అందువల్ల భారీ యాంత్రీకరణ సాధ్యమైంది. కొత్త కొత్త యంత్రాల రూపకల్పన, ఎరువులు, పురుగుమందుల వాడకం వీలైంది. సహకార సంఘంలో వివిధ విభాగాలుంటాయి. క్రమంతప్పకుండా ఆయా విభాగాలు తమ పనులు చేస్తుంటాయి. పంటలపై నిరంతరం శాస్త్రవే




బల్గేరియాలో ఓ సుందరమైన చర్చి

త్తల నిషా ఉంటుంది.

## మాంసం ఉత్పత్తి

బల్గేరియా ప్రజల ప్రధాన ఆహారం మాంసం. ఆవు, పంది, గొర్రె, మేక, కోడి మాంసాలను, చేపలను వారు మూడు పూటలా భుజిస్తారు. పెద్ద పెద్ద ఆవుల ఫారాలుంటాయి. కేవలం మాంసం కోసం పెంచే ఆవులుంటాయి. ఆ ఆవుల నుంచి పాలుపిండరు. ఒక్కొక్క ఆవు 400 కిలోల బరువు వచ్చేవరకు ఫారంలో పెంచుతారు. పాలకోసం ఉపయోగించే ఆవులను మాంసానికి వినియోగించరు. బల్గేరియాలో పాలఉత్పత్తుల వినియోగం కూడా ఎక్కువే. మన వలెనే పాలు, పెరుగు, వెన్న, జున్ను వంటి పదార్థాలను విరివిగానే వాడతారు. చేపల పెంపకం కోసం ప్రత్యేకంగా చెరువులుంటాయి. ఆ చెరువుల్లో శాస్త్రీయ పద్ధతిలో చేపలను పెంచుతారు.

## మధుపానీయాలు

మధ్యాహ్నం, రాత్రి భోజన సమయాలలో వైన్, బీరు, ఒడ్కా, విస్కీవంటి మధుపానీయం ఏదో ఒకటి తప్పనిసరిగా ఉండాలి. వేలాది ఎకరాలలో ద్రాక్షతోటలు పెంచుతున్నారు. వాటిని వైన్ యార్డ్స్ అంటారు. వైన్ తయారీ కుటీరపరిశ్రమ కింద లెక్క. బల్గేరియా తన అవసరాలకుమించి వైన్ తయారు చేస్తున్నది. విదేశాలకు ఎగుమతిచేస్తున్నది. రష్యన్ ఒడ్కా అంటే బల్గేరియా వారికి ఎంతో ప్రీతి. స్త్రీలు, పురుషులు అందరూ మధుపానీయం సేవిస్తారు. అయినా మనదేశంలో మాదిరి తప్పతాగి రోడ్ల మీదపడిపోయే వారుకాని, నానారకాల అల్లరిచేసే వారుకాని ఎక్కడా కనపడరు.

పరిశ్రమలలో పనిచేసే వారికైనా వ్యవసాయ



నల్ల సముద్రపు బీచ్‌లో ఉల్లాసంగా గడుపుతున్న జనం

రంగంలో పనిచేసే వారికైనా ఒకే రకమైన సదుపాయాలుంటాయి. ప్రతిఫ్యాక్టరీలోనూ, ప్రతి వ్యవసాయ క్షేత్రంలోను క్యాంటీన్లు, రిక్రియేషన్ క్లబ్బులు, విశ్రాంతిగదులు ఉంటాయి. భోజనపదార్థాలన్నీ క్యాంటీన్లలో దొరుకుతాయి. భోజనం ఇంట్లో తయారు చేసుకుంటే అయ్యేఖర్చుకంటే క్యాంటీన్‌లో భోజనంచేస్తే అయ్యే ఖర్చు తక్కువ. క్యాంటీన్ నిర్వహణకయ్యే ఖర్చునంతా ఫ్యాక్టరీయే భరిస్తుంది. కేవలం పదార్థాలకయ్యే ఖర్చునే వినియోగదారుల నుంచి వసూలు చేస్తారు. అందువల్ల స్త్రీలు, పురుషులు తాము పనిచేసే చోటఉండే క్యాంటీన్ సదుపాయాలను ఎక్కువగా వినియోగించుకోవటం పరిపాటి.

ప్రతి ఫ్యాక్టరీలోను వీలైనన్ని సదుపాయాలు



గల రిక్రియేషన్ క్లబ్బులుంటాయి. ఆటలు ఆడుకోవచ్చు. సంగీతం విని ఆనందించవచ్చు. డాన్సులు చేసుకోవచ్చు. అసలు ప్రతి డైనింగు హాలులోను మ్యూజిక్, డాన్సింగ్ సదుపాయాలుంటాయి ఫోక్‌డాన్స్‌లు తిలకిస్తూ, సంగీతం ఆలకిస్తూ విలాసంగా భోజనం పూర్తి చేస్తారు. కార్మికులకు నిర్దిష్టమైన పనిగంటలుంటాయి. ఓవర్‌టైమ్ వర్క్‌కూడా ఒక పరిమితికి మించి చేయటానికి వీలులేదు. బల్గేరియాలో వారానికి అయిదు రోజులు పనిదినాలు. రోజుకు ఏడుగంటలు పని. శనివారం ఎక్కువమంది షాపింగ్ దినంగా పరిగణిస్తారు. ఆ రోజు దాదాపు అన్ని దుకాణాలు జనంతో రద్దీగా ఉంటాయి. శని, ఆదివారాలు అన్నిరకాల క్రీడా మైదానాలు జనంతో కళకళలాడుతుంటాయి. సెలవు దినాలను ఎవరూ నిద్రపోతూ గడపరు. వసంత, వేసవి కాలాల్లో అయితే



శాన్‌డాన్‌స్కీలో నీటిచికిత్సకి ( హైడ్రోథెరపీ ) నకల సౌకర్యాలూ గల ఆస్పత్రి

నల్లసముద్రం పొడవునా సన్నీబీచ్‌లలో విలాసంగా గడుపుతారు. ఓపిక ఉన్నంతసేపు సముద్రంలో స్త్రీలు, పురుషులు కలసిఈత కొడతారు. తరువాత ఇసుక తిన్నెపై విలాసంగా పవళించి, సూర్యరశ్మి నుంచివచ్చే వేడిని హాయిగా అనుభవిస్తారు. స్త్రీలు సైతం పురుషులలానే కేవలం అండర్‌వేర్‌తోనే ఆ బీచ్‌లలో కనబడతారు. అది యూరోపియన్ సంస్కృతి. పబ్లిక్‌గానే ముద్దులు పెట్టుకుంటారు. అది ఒక బీచ్‌లలోనే కాదు. పబ్లిక్ పార్కులలో సైతం ఈ శృంగార దృశ్యాలు కనబడుతుంటాయి. అది అక్కడ సర్వసాధారణం. యువతీ, యువకులను ప్రోత్సహించి జనాభాను పెంచుకోటానికి బల్గేరియా ప్రభుత్వం అన్నిరకాల చర్యలు తీసుకుంది. వివిధ రకాల పార్కులను నిర్మించారు. ప్రభుత్వం కట్టే ఇళ్ళలో విశాలమైన గదులను, ఫ్లాట్‌లను కొత్తగా పెళ్ళిఅయిన జంటలకు కేటాయిస్తున్నారు. ఇక నైట్‌క్లబ్బులు, డిస్కో క్లబ్బులు వంటివి యూరోపియన్ సంస్కృతిలో భాగమేనన్న సంగతి అందరికీ తెలిసిందే.

## గృహనిర్మాణం

బల్గేరియాలో గృహనిర్మాణం భారీఎత్తున సాగుతోంది. పురాతన కట్టడాలన్నింటినీ కూల్చివేసి ఆధునిక గృహాలను నిర్మిస్తున్నారు. బల్గేరియా ప్రజలు సొంతఇల్లు కట్టుకోవచ్చు. కొంతమంది కలసి సహకార సంఘంగా ఏర్పడి పలుఅంతస్తుల భవనాలను నిర్మించుకొని ఫ్లాట్లు తీసుకోవచ్చు. ప్రభుత్వమే ఫ్లాట్లు కట్టి విక్రయిస్తుంది. అద్దెకిస్తుంది. అద్దెలు చాలా తక్కువగా ఉంటాయి. పల్లెల్లో సాధారణంగా ఒక్కో కుటుంబానికీ రెండంతస్తుల ఇల్లు ఉంటుంది. రెండులేక మూడు పడక గదులుండటం సర్వ సాధారణం. అన్ని గ్రామాలకు పూర్తిగా కరెంటుఉంది. చలికాలంలో ఇళ్ళు వెచ్చగా ఉండటానికి, పైపుద్వారా మంచినీళ్ళు సరఫరా చేసే విధానంలానే, వేడినిచ్చే స్టీమును సరఫరా చేస్తారు. ప్రతి గ్రామానికి సెంట్రల్ హీటింగ్ ప్లాంటులుంటాయి. రెండంతస్తులైనా, మూడంతస్తులైనా కప్పులుమాత్రం ఒకే తరహాలో కనిపిస్తుంటాయి. బంగాళా పెంకుతోనే, మామూలు పెంకుతోనో ఏటవాలుగా కప్పుతారు. పడిన మంచు కరిగి జారిపోటానికి ఈ ఏటవాలు తలం ఉపకరిస్తుంది. ప్రతిఇంట టి.వి, రేడియో, రిఫ్రిజిరేటర్ వంటి ఆధునిక సామాగ్రి అంతా ఉంటుంది. రకరకాల నగిషీలు అయితే అరుదుకాని సదుపాయాలు మాత్రం తప్పకుండా ఉంటాయి. బల్గేరియా కరెన్సీని 'లేవ్' అంటారు. అధికారికంగా ఒకలేవ్ ఒక అమెరికన్ డాలరు విలువకు సమానం.

—ఎ. ప్రభాకర్

# అమెరికన్ సమాజం

దూరపు కొండలు నునుపు అనేది నిజమే ననిపిస్తుంది, కొన్ని సందర్భాల్లోనయినా. ఆయుధాల ఉత్పత్తిలో, వర్ధమాన దేశాలమీద ఆధిపత్యంలో, అంతర్జాతీయంగా రాజకీయవలుకుబడిలో అగ్రగామిగా ఉన్న అమెరికాలో పరిస్థితి- బయట పల్లకీ మోత ఇంట్లో ఈగలమోత అన్నట్లుగా ఉందీఈనాడు. నానాటికీ తీసికట్టు అన్నట్లు అమెరికా సంస్కృతి రోజురోజుకీ అంతరించిపోతోంది. ముఖ్యంగా యువతరంలో పొడచూపుతున్న పెడధోరణులు ఆ దేశంలోనే గాక, ప్రపంచంలోని సామాజిక శాస్త్రవేత్తలను సైతం కల వరపరుస్తోంది.

అమెరికా ఒక సంపన్న దేశం కావడంవల్ల ఆ దేశసమాజంలో వచ్చే మార్పులు సహజంగా వర్ధమాన దేశాలపై ప్రభావం చూపుతాయి. ఆదర్శంగా ఉండవలసిన అమెరికన్ సమాజం ఆరాచకం, అవినీతి, అకృత్యాలతో 'విలసిల్ల' డం శోచనీయంగా వారు పేర్కొంటున్నారు. అనేక దేశాలపై దాడిచేసి వాటిని తన గుప్పిట్లోకి తెచ్చుకోవటానికి ప్రయత్నించే అమెరికా, తన దేశంలోని 'సంఘవ్యతిరేక శక్తులపైనా, కుసంస్కృతిపైన దాడి చేయడంలో విఫలవవుతోంది. ఇవాళ అమెరికా సంస్కృతి సినిమా హీరో సిల్వెస్టర్ స్టాలెన్ సృష్టించిన 'రాంబో' పాత్రతరహాలో పయనిస్తోంది. వ్యక్తిగత హింసావాదం, తీవ్రవాద చర్యలు, తాత్కాలిక ఆవేశాలతో యువత రెచ్చిపోతోంది.

యువత ఇలా పనీపాటూ లేకుండా, అరాచకంలోమునిగి కొట్టు మిట్టాడ్డానికి ముఖ్య కారణాల్లో నిరుద్యోగ సమస్య కూడా ఒకటని భావిస్తున్నారు. వేలాది మంది యువకులకు నేటి అమెరికాలో ఉద్యోగాల్లేవు. చదువు ముగిసిన తరువాత వారి పని ఉద్యోగాలకోసం తిరగటం, లేకుంటే అధికార్లను లొంగదీసుకోవటం, కిడ్నాప్‌లు, చోరీ చేయటంగా మారి అదే ఓ నిత్యకార్యక్రమమైంది. అమెరికా సమాజాన్ని 'జబ్బు పడిన సమాజం' గా అభివర్ణిస్తున్నారీనాడు. దీనికి ముఖ్యకారణం ఆ దేశ స్వార్థపర శక్తులు యువతరాన్ని వక్కదార్లు పట్టించడమే. విద్యను మధ్యలోనే వదిలివేసే వారి సంఖ్య పెరిగి విద్యకు తగిన ఉద్యోగావకాశాలు క్రమంగా తగ్గుతుండటంతో యువకుల్లో భవిష్యత్తుపై అసంతృప్తి ఏర్పడుతోంది. ఈ అసంతృప్తి సమాజవ్యతిరేక చర్యలకు దారితీస్తోంది. యువకుల్లో ఎక్కువ భాగం మత్తు పదార్థాలకు దానులై నేరస్థుల జాబితాలో కలిసిపోతున్నారు.

నిరుద్యోగుల్లో 25 సంవత్సరాలలోపు యువకులే 45 శాతం వరకు ఉన్నారు. కొంతమంది గత్యంతరంలేక మిలటరీలో చేరుతున్నారు. అమెరికా ప్రభుత్వం 1985-86 బడ్జెట్‌లో ఉద్యోగ శిక్షణా కార్యక్రమాలకు యిదివరలో కేటాయించిన డబ్బుపై కోత విధించింది. ఆ మిగిల్చిన డబ్బును 18 శాతం ఎఫ్ -14 నావికా జెట్ విమానాలు కొనడానికి పెంటగన్ ఖాతాలో చేర్చింది.

అమెరికాలో తీవ్ర నేరాలు సగానికిపైగా 17 సంవత్సరాలలోపు యువకులే చేస్తున్నట్లు ఒక సర్వే పేర్కొంది. ప్రతి 9 మందిలో ఒకరు 18 సంవత్సరాలొచ్చేసరికి కనీసం ఒక్కసారైనా ఏదో ఒక నేరంపై కోర్టుకు హాజరవుతున్నారట! 1970 దశకంలో మారిజోనా, కొకెన్ లాంటి మత్తు పదార్థాలు సేవించే 12-17 సంవత్సరాల మధ్య యువకులు ఎక్కువయ్యారు. ఉన్నత విద్యను మధ్యలోనే మానివేసేవారు 30 శాతం మంది ఉన్నారు. చదివే రోజుల్లో కూడా పరీక్షల్లో అడ్డదార్లు తొక్కటం పరిపాటి అయింది. లాస్ ఏంజిల్స్ పట్టణంలో ఒక కంపెనీ పరీక్షలు రాసి పెట్టేందుకుగాను 50 మంది నిపుణులైన రాతగాళ్లను నియమించింది. అదేవృత్తిగాగల వీరు అన్ని రకాల సబ్జెక్టులు రాసిపెడతారు.

ఇటీవలి కాలంలో యువతీ యువకుల్లో మరో ధోరణి ప్రబలమైంది. చదువుకునే రోజుల్లోనే పెళ్లి కాకుండా కలిసి కాపురం చేయడం, పర్యవసానంగా గర్భస్రావాలు పెరిగి పోవటం జరుగుతోంది. అసలు సంప్రదాయకంగా వివాహాలు

చేసుకునే విధానం అంతరించి పోతున్నట్లే ఉంది. ప్రస్తుతం వివాహమై ఒంటరిగా కాపురం చేస్తున్న మహిళల సంఖ్య 15 శాతం అని తెలుస్తోంది. ప్రతి రెండు వివాహాలలో ఒక వివాహం విడాకులకు దారితీస్తున్నట్లు " టైమ్ " పత్రిక తెలియజేసింది.

ఇదిలావుంటుండగా లేతవయసులోనే గర్భధారణ చేయటం అమెరికాలో ఒక సాధారణ విషయంగా మారింది. ఏడాదికి లక్షమందికన్నా ఎక్కువే యుక్తవయస్సు వచ్చిన బాలికలు గర్భం ధరిస్తున్నారు. వీరిలో ప్రతీ అయిదుగురిలో నలుగురు అవివాహితలే! ఇదే గనుక ఇలాగే కొనసాగితే, అమెరికాలోని పద్నాలుగేళ్ళ బాలికలు ఇరవైఏళ్ళు వచ్చేలోపల కనీసం ఒక సారైనా గర్భధారణ చేస్తారని పరిశీలకులు ఆందోళన చెందుతున్నారు. యుక్తవయస్సులోనే గర్భధారణ చేయటం తీవ్రమైన జాతీయ సమస్యగా 85 శాతం మంది పెద్దలు భావిస్తున్నారు. ' టీనేజ్ ప్రెగ్నెన్సీ ' ఒక ఫ్యాషన్‌గా మారినట్లు కొందరు వ్యాఖ్యాతలు ఛలోక్తి విసరగా, నైతిక విలువలు దిగజారిపోవటానికిది పరాకాష్ఠ అని మరికొందరు బాధపడుతున్నారు.

అందుకే కాబోలు 1984 అధ్యక్ష ఎన్నికల్లో గర్భస్రావాలసమస్య అన్నిటికంటె ప్రధానమైంది గా ముందుకొచ్చింది.

అతి చిన్న సమస్యలపై కూడా సహనం కోల్పోయి, విడాకులిచ్చుకునే సంప్రదాయం యువకుల్లో వచ్చింది. దీనివలన ఒంటరి కాపురాలు ఎక్కువయ్యాయి. ఇప్పుడు అమెరికాలో వెయ్యికి 110 మంది విడాకులు తీసుకుంటున్నట్లు ఒక సర్వే తెలియజేస్తోంది. ఇందువల్లే యువతీ యువకులు ఆనాడు హిప్పీలుగా తయారయితే, నేడు రజనీష్ లాంటి " దేవుడి మనుషుల " వెంట మోక్షం కోసం పరుగిడుతున్నారు.

అమెరికాలోని భారతీయులకు, ఇతర ఆసియన్‌లకు యింకా ఈ సంస్కృతి సోకలేదనే చెప్పాలి. ఇది ఇలావున్నప్పటికీ కొంతమందికి జాతీయ, అంతర్జాతీయ విషయాలపై ప్రతిస్పందన లేకపోలేదు. దక్షిణాఫ్రికాపట్ల అమెరికా వైఖరిపైనా, లిబియాపై దాడిపైనా నిరసన వ్యక్తం చేసేవారూ ఉన్నారు.

## టి.వి. కల్చర్

అమెరికాలో దూరదర్శన్ ప్రసారాల ప్రభావం యువతపై చాలా ఎక్కువగా ఉంది. అమెరికాలో సగటున మనిషి రోజుకు 6.6½ గంటల పాటు దూరదర్శన్ ప్రసారాలు చూస్తున్నాడు. టి.వి.లో వచ్చే సమాచారం వార్తాపత్రికలు అందజేసే వివరాలకన్న ఎంతో ముఖ్యమైనదిగా అమెరికా ప్రజలు భావిస్తున్నారు. అనేక వాణిజ్యసంస్థలు ఆకర్షణీయమైన దృశ్యాలతో టి.వి.లో ప్రకటనలు యిస్తాయి. ప్రస్తుతం దాదాపు వంద పెద్ద పెద్ద కంపెనీలు టి.వి.లో ప్రకటనలు యిస్తున్నాయి. ఈ కంపెనీలు అందమైన అమ్మాయిల అర్ధనగ్న, అశ్లీలదృశ్యాలతో, ప్రకటనలు జారీ చేయటంతో- వీటిని చూడటానికే యువతీయువకులు ఎగబడుతున్నారు. అనేక సాధారణ కార్యక్రమాల్లో హింసాకృత్యాలు మితిమీరిఉంటటంతో చిన్న పిల్లలు సైతం టి.వి.లకు అతుక్కుపోతున్నారు. సగటున ఒక అమెరికా బాలుడు అతడు 18 సంవత్సరాలు వయస్సు వచ్చేనాటికి 18 వేల హత్యలు టి.విల్లో చూస్తున్నట్లు అమెరికా మెడికల్ అసోసియేషన్ తెలియజేసింది.

అమెరికాలో పిల్లల మనస్తత్వం ఎలా ఉందో తెలియజేయడానికి చిన్న ఉదాహరణ. ఒక తల్లి నాలుగేళ్ళ బాలుడితో అంటుంది. " మీ తాతయ్యా చచ్చిపోయాడురా! " అని. వెంటనే ఆ పిల్లాడు " తాతయ్యను ఎవరు చంపారు? " అంటాడు.

## మత్తుమందుల జోరు

అమెరికా సమాజాన్ని పట్టి పీడిస్తున్న మరో వ్యాధి ఆల్కహాల్ తదితర మత్తు పానీయాలు. అనేకమంది స్కూలు పిల్లలు కూడా ధూమపానానికి విపరీతంగా అలవాటు పడుతున్నారు. ఘోరమైన ఎల్.ఎస్.డి. డి.ఎమ్.టి. హిరాయిన్, కొకాయిన్, మార్ఫిన్ వంటి మత్తు మందులకు యువతీ యువకులు బానిసలైపోతున్నారు. తల్లి తండ్రులు ఇది గమనిస్తూనే నిస్సహాయంగా ఉండిపోతున్నారు. అత్యధిక సంఖ్యలో యువత తాగుబోతులుగా రానున్న సంవత్సరాలలో మారుతారనే ఆందోళన కూడా వారు చెందుతున్నారు. ఈ మత్తు పదార్థాల బెడద కేవలం కొన్ని నగరాలకే పరిమితం కాకుండా యావత్ దేశానికీ పాకింది.

' కొకాయిన్ ' అనే మత్తు పదార్థానికి సంబంధించిన ' క్రాక్ ' నేడు యాభైలక్షలమంది ప్రజలపై చాలా చురుగ్గా తన ప్రభావంచూపు



మాదక ద్రవ్యాల మత్తులో ఓ టీనేజర్

తోంది. క్షీణిస్తున్న ఆర్థిక వ్యవస్థ, పెరుగుతున్న నిరుద్యోగం ఇవన్నీ కూడా అమెరికా యువత ఆశయాల్ని ఆదర్శాలని మరిచి, వ్యసనాలకు, నేరాలకు పాల్పడేలా చేస్తోందని విదితమవు తోంది.

## మితిమీరుతున్న నేరాలు

నేరాల సంఖ్య కూడా నానాటికీ పెరుగుతూనే ఉంది. నేరాలకు పాల్పడ్డం కూడా ఎక్కువమంది యువకులవల్లే జరుగుతోంది. అమెరికాలో జరిగే తీవ్ర నేరాలు సగానికి పైగా 17 సంవత్సరాల

దారుణంగా **16** మందిని హత్యచేసిన యువకుడు

లోపు యువకులే చేస్తున్నారని ఒక సర్వేలో తేలింది. ప్రతి 9 మందిలో ఒకరు 18 సంవత్సరాలు వచ్చేసరికి కనీసం ఒక్కసారైనా ఏదో ఒక నేరంపై కోర్టుకు హాజరవుతున్నారట! ఆక్కడ యువకులు కత్తులతో కసరత్తులు చేస్తున్నారు.

ప్రస్తుతం ఇంటికో పిస్టల్ ఉందనితెలుస్తోంది. డిటెక్టివ్ కథలున్న పుస్తకాలు, హింసతో నిండిన



యువతరంలో క్రేజ్ పుట్టిస్తున్న పాప్‌సింగర్స్

గర్ల్‌ఫ్రెండ్ కేరీలీతో ప్లేబాయ్ఎడిటర్ హ్యూహెఫ్నర్

సినిమాలు నేటి యువత కార్యకలాపాలుగా మారాయి. యువకుల్లో, ప్రేక్షకుల్లో ఉన్న బలహీనతను ఆసరాగా చేసుకుని నిర్మాతలు నాసిరకం సినిమాలు తీస్తున్నారు. సామాజిక అభ్యుదయ పంథాలో నడిచే సినిమాలు అతితక్కువ. సెక్సు, హింస కథావస్తువులుగా ఉన్న సినిమాలే ఎక్కువ. ఇటీవల దెయ్యాల సినిమాలు బాగా డబ్బు సంపాదించి పెట్టాయి. ' ది ఎగ్జార్సిస్టు ' అనే సినిమా ఈ తరహాదే. ఈ సినిమాలో సాంకేతిక విలువలు తప్ప, నటనా కౌశల్యం ఏమాత్రం గోచరించదు. నేరాలు చూపే సినిమాలకు గిరాకీ ఎంతో పెరిగింది. గాడ్‌ఫాదర్, రాంబో, ప్రొటెక్టర్ వంటి చిత్రాలు ఆ కోవకు చెందినవే. ఆద్యంతం ఉద్వేగంతో సాగే ఇటీవలి ' ఫస్ట్‌బ్లడ్ ' చిత్రం గురించి వేరే చెప్పనక్కర్లేదు.

## సెక్స్ పిచ్చి

టి.వి.లో సెక్స్ దృశ్యాల బెడద చెప్పనవసరం లేదు. ఏడాదికి అమెరికా ప్రేక్షకుడు దాదాపు 9 వేల, ఆడ మగ సంపర్కం చేసుకుంటున్న దృశ్యాలను తిలకిస్తున్నట్లు '' టైం '' పత్రిక పేర్కొంది. దీన్ని బట్టి చూస్తే సెక్స్ మనుషుల జీవితాల్లో ఎంతగా అల్లుకు పోయిందో విదితమవుతోంది. నగ్నంగా ఉన్న ఒక భార్య తన భర్త చొక్కాను విప్పతీస్తుంది. ఈ దృశ్యం సాధారణంగా తల్లి తండ్రులే చూసి సెక్స్ పరంగా రెచ్చి పోతుండగా ఇక యువకుల సంగతి చెప్పేదేముంది!?

రాక్ మ్యూజిక్, పాప్‌సాంగ్స్ యువతరాన్ని ఉద్రూతలూగిస్తున్నాయి. అర్ధనగ్న నృత్యాలతో ఆధునిక వాయిద్యాలతో సాగుతున్న రాక్ మ్యూజిక్ యువతను విలాసాలు, వ్యసనాల పాల్జేసి నిర్వీర్యులను చేస్తోంది. క్లబ్‌లు, బార్‌లు యువతకు సొంత ఇళ్లుగా మారాయన్నా అతిశయోక్తి కాదేమో!

## పత్రికలు

ఇక పత్రికల సంగతి చూస్తే అవీ అంతే. కొన్ని పత్రికలు మినహాయిస్తే చాలా పత్రికలు సెక్స్ పత్రికలే. ప్లేబాయ్, ప్లేగర్ల్, పెంట్‌హౌస్ లాంటి పత్రికలు నగ్న లైంగిక చిత్రాలు, అశ్లీల సాహిత్యంతో నిండి ఉంటాయి. ఒక దశలో ప్లేబాయ్ పత్రిక 70 లక్షల కాపీలు అమ్ముడుపోయిందంటే సెక్స్ పిచ్చి ఎంతగా ముదిరిందో అర్థమవుతుంది. నగ్నలైంగిక దృశ్యాలతో ముద్రించే పత్రికల సర్క్యులేషన్ రెండు కోట్ల వరకు ఉందిట. వాటిపై ప్రచురణకర్తలకు కొన్ని కోట్ల






నగ్నలైంగిక చిత్రాలతో నిండివుండే పత్రికలు

డాలర్లు లాభం వస్తోంది. నగ్నలైంగిక చలనచిత్రాల పైన కూడా లాభాలు కోట్లలో ఉన్నాయి. అమెరికా సమాజం దిగజారి పోవడానికి కారణమేమిటి? ప్రస్తుతం ఇది సామాజిక శాస్త్రవేత్తలను కలవరపరుస్తున్న సమస్య. పట్టణవాసుల జీవితాలు రోజురోజుకూ భీతావహంగా తయారవుతున్నాయి. కిడ్నాప్‌లు, యిళ్ల దోపిడీలు ముమ్మరమవుతున్నాయి. ఇళ్లదోపిడీలనుంచి కాపాడుకోవడానికి దాదాపు ప్రతి యింటిలోనూ ఎమర్జన్సీ అలారం ఏర్పాటు చేసుకున్నారుట. సాంస్కృతికపరంగా, ఆర్థికపరంగా, రాజకీయపరంగా అనేక క్లిష్ట సమస్యలను అమెరికా నేడు ఎదుర్కొంటోంది. ఆకలి తీర్చటం కన్నా ఆయుధాల ఉత్పత్తే ప్రధానధ్యేయంగా పెట్టుకున్న అమెరికా-

"మాకు పనులు చూపెట్టండి, ఉద్యోగాలివ్వండి!" అంటున్న యువతకు ప్రజలకు సమాధానం చెప్పలేకపోతోంది. ఆయుధాల ఉత్పత్తిపై పెడుతున్న ఖర్చులో 25 శాతంనైనా సమాజాభ్యుదయానికి వినియోగిస్తే ప్రస్తుత పరిస్థితులు ఎదురవ్వవు. ప్రపంచశాంతి, దారిద్ర్య నిర్మూలన, నిరుద్యోగ సమస్య నివారణ తదితర క్లిష్టమైన సమస్యలన్నిటికన్నా లాభాపేక్ష, ప్రపంచాధిపత్యం తదితరమైనవే అమెరికా ప్రభుత్వానికి ఎక్కువగా అనిపిస్తోంది. అవినీతి ప్రభావం కూడా అమెరికాసమాజంలో అడుగడుగునా అల్లుకుంటోంది. లంచాల బెడద రక్షణశాఖను పీల్చి పిప్పిచేస్తోంది. అమెరికాలోని బడా వ్యాపారులు కొన్ని కోట్ల రూపాయలను స్వప్రయోజనాల కోసం లంచాలుగా ఇస్తారుట. రీగన్ ప్రభుత్వంలోని ఉన్నతాధికారులపైనే అనేక ఆరోపణలు వినవస్తున్నాయి. పాలకులే దుష్ప్రవర్తనకు నెలవైతే ఇక ప్రజలగతి ఎలాఉంటుంది? దోచుకోవడం, ఏ ఆశయాలు, ఆదర్శాలు లేకుండా సమాజమనుగడకన్నా వ్యక్తి మనుగడే ముఖ్యమనుకునే వ్యవస్థ పతనంవైపే దారితీస్తుంది. ప్రపంచంలో అగ్రరాజ్యమని ఎలుగెత్తి చాటబడే అమెరికాలో రాజకీయంగా, ఆర్థికంగా, సాంస్కృతికంగా పతనావస్థ రాజకీయ, సామాజికవేత్తలను తీవ్రంగా కలవరపరుస్తోంది.

—డి. కృష్ణబాబు

# చతుర ప్రత్యేక ఫీచర్

జీవితంలో ఏదైనా సాధించేందుకు మనస్థైర్యం కావాలి. అది పెంచుకొనేందుకు ముందుగా ఆత్మవిశ్వాసం అవసరం. ఆత్మవిశ్వాసం మన అర్హతలమీద, శక్తిసామర్థ్యాలమీద మనకుండే నమ్మకాన్ని బట్టి ఉంటుంది. అందుకే ముందుగా ఆత్మశోధన అవసరం.. మనకు ఉన్నది ఏమిటో మనకు తెలిసినపుడు మనకు కావలసినదానికి మనం ప్రయత్నించవచ్చు. ఆత్మసాక్షి అన్నిటికందే గొప్ప న్యాయనిర్ణేత. అందుకే మనమీద ఇతరులకు ఉండే అభిప్రాయాలగురించి పట్టించుకోక మన అభిరుచులనుబట్టి ఆ కళలో అభినివేశం పొందగల్గినపుడు గమ్యం చేసుకోవటానికి ఓ మార్గం ఏర్పడుతుంది.

## మీలోని శక్తి

జీవితంలో ఉన్నతి సాధించుకొనేందుకు ప్రతిభను ఋజువుచేయగలగాలి. ప్రతిభాసుమానికి గుర్తింపు పరిమళం లాటిది. మనిషిలోవుండే శక్తిని మరుగు పరచక మెరుగుపెట్టినపుడే అది అందరికీ తెలుస్తుంది. ప్రజ్ఞాపాటవాలు గుర్తింపునకు నోచుకున్నపుడు మనిషి తన ఉన్నతి కోసంచేసే ప్రయత్నాలలో ఓ మెట్టు అధిగమించినట్లే! ప్రపంచ ప్రఖ్యాత రచయిత జార్జిబెర్నార్డ్‌షాకు గుర్తింపు లభించకముందు, డుబ్లిన్‌లో ఓ చిన్న గుమాస్తా జీవితం గడిపేవాడు. ఆయనే గాదు అనేకమంది కూడా అలాగే మరుగునపడే ఎంతోకాలం గడిపారు.

ఎంతటి మేధావంతులైనా కొందరు వాగ్వివాదాల్లో ఒక్కోసారి బలహీనమైన వాదనలుకూడా చేస్తారు. ఆ సమయంలో వారి మేధాశక్తి ఎందుకూ పనికిరాకుండా పోతుంది. చర్చాసమయాల్లో మాటకారితనం ముఖ్యం. మనం చేసిన వ్యాఖ్యలకు ఇతరులు బదులు చెప్పలేని విధంగా మన వాదన కొనసాగాలి. అప్పుడే అందరూ తప్పనిసరిగా మన వాదాన్ని బలపరుస్తారు. మన విశ్వాసానికి బలం చేకూర్చుతారు. మాట్లాడటం ఓ పెద్ద కళ. దానికి ముందుగా పరిశీలన ముఖ్యం. అవతలి వ్యక్తిని అర్థం చేసుకోగల నైపుణ్యం ఉంటే ఎంతటి క్లిష్టపరిస్థితి కూడా మనకనుగుణంగా మార్చుకోవచ్చు. జీవితంలో ఉన్నతస్థాయిని చేరాలంటే ఈ కళ ఎంతగానో అవసరం! మన మాటలతీరు మనల్ని గురించి గొప్పగా అంచనా వేయగలిగేట్లుగా వుండాలి. దీనికి హుందాతనం తోడైనపుడు మనపై అవతలి వ్యక్తికి గౌరవం ఏర్పడుతుంది. సంఘంలో స్థాయి పెరుగుతుంది.

కీర్తిప్రతిష్టలు మనిషిని మరింత ఎత్తుకు తీసుకువెళతాయి. నిజమే. కానీ వాటిని పొందటం అంత సులభంకాదు. మన తెలివితేటలు అపారం కావచ్చు. కానీ ప్రపంచం పట్టించుకోదు. మనం వాటిని నిరూపించి విజయాల్ని సాధించగలిగినపుడు లోకం మనల్ని కీర్తిరథంలో కూర్చోబెడుతుంది. మనం ఎన్నుకున్న రంగంలో మన గొప్పతనాన్ని రుజువు చేయాలి. లోకం మననుంచి ఆశించేదాని

కన్నా రెండింతలు సాధించగలగాలి.

మానవుని మెదడు ఓ పెద్ద కంప్యూటర్. దానిని వీలయినంత బాగా వాడుకోవటంలోనే అతని మనోవికాసం ఆధారపడి వుంటుంది. అనవసరమయిన విషయాలతో బుర్ర పాడు చేసుకోకుండా, విచక్షణా జ్ఞానాన్ని పెంపొందించుకోవాలి. సమస్యలను గుర్తుతెచ్చుకుని బాధపడటం కంటే పరిష్కారమార్గాన్ని యోచించటం మంచిది. ముఖ్య విషయాలను నోట్ చేసుకోవటానికి అలవాటుపడాలి. మన టాలెంట్స్‌ను పూర్తిగా వినియోగించుకోగలగాలి. వీటిని ఆచరించగలిగితే జీవితంలో ఎదురయ్యే సమస్యల గురించి క్షోభిస్తూ కూర్చోనే అవసరమే ఉండదు.

కొంతమంది వుద్యోగంలో చేరిన కొన్నాళ్ళకే చురుకుగా పనిచేసి ప్రమోషన్‌లు పొందుతారు. కొంతమంది అలా వెళ్ళలేకపోవటానికి కారణం వారు తమ శక్తిసామర్థ్యాలను పూర్తిగా వినియోగించకపోవటమే! దీనికి నిస్పృహ కొంత కారణం. అలాంటి సమయాలలో ఒకే వృత్తిలో కొనసాగుతూ తన సామర్థ్యాన్ని రుజువుచేసుకొని అధికారుల మెప్పు పొందేందుకు పట్టుదలగా కృషిచేయాలి. అది సాధ్యంకానపుడు ఆ వృత్తిని వదిలి అభిరుచులకు తగిన వృత్తిని చేపట్టాలి. మొదట్లో కష్టంగా అనిపించినా, అభిరుచి పట్ల ఆసక్తి వాళ్ళను తొందరలోనే పైమెట్టుకు చేర్చుతుంది.

మనిషికి తనకు లేనివాటిపై ఆలోచన ఎక్కువ. అలాంటి బలహీనత ఎంత తెలివిగలవాడినైనా ఓటమికిగురిచేస్తుంది. 'నాకు వయసు మించిపోయిందిగానీ ... లేకపోతేనా....', 'నేను చెప్పినమాట ఎవరైనా వింటే' ఇత్యాది భావాలు మనిషికి నిరాశే మిగుల్చుతాయి. అలాటివాటిని వదిలి ధైర్యంగా ప్రయత్నాల్ని ప్రారంభించగలగాలి. ఓటమి తప్పదనే మాట ఎంత సత్యమో విజయం తథ్యమనే మాట కూడా అంతే సత్యమని గుర్తుంచుకోవాలి. ప్రయత్నాలు ప్రారంభించేముందు అభిరుచికి తగ్గ అర్హతలు ఉన్నాయో లేదో పరీక్షించుకొని, ఆ రంగాన్ని గురించి మరింత లోతుగా తెలుసుకుని వుండటం మంచిది. గమ్యానికి వీలైన దారులేవో నిర్ణయించుకోవాలి. తన ప్రయత్నంలో సహాయపడేవారినిలెక్కించుకోవాలి తనకు సాయపడేవారితో పని చేయించగల సమర్థతను పొందాలి. చిన్న చిన్న విషయాలకుఆనాలోచితంగా ప్రవర్తిస్తే వారి సహాయాన్ని పోగొట్టుకునే ప్రమాదం ఉంటుంది.

అంటే తన అనుచరులను కంట్రోలు చేయగలిగే నాయక లక్షణాలను కల్గి వుండాలి. ఉన్నత స్థితిని పొందేందుకు ఇది మరొక ముఖ్యలక్షణం. దీనికి స్థిర నిశ్చయం, విచక్షణా జ్ఞానం తోడ్పడతాయి. అనుచరులనుండి పనిని రాబట్టుకోగల చతురత ఉండాలి. తన కిందివారి మనస్తత్వాలను గుర్తించి వారికి తగిన బాధ్యత అప్పగించాలి.

విజయమార్గంలో ఒకమెట్టు సాధించిన తరువాత మనిషి స్థానం అక్కడే ఆగిపోదు. క్రమంగా పెరుగుతుంది. అప్పుడే అతని వ్యక్తిత్వానికి పరీక్ష మొదలవుతుంది. ఒక స్థానం సాధించటం కన్నా దాన్ని నిలబెట్టుకోవటమే చాలా కష్టం. ఒక స్థాయికి చేరుకున్న తరువాత మరో ఉన్నత స్థాయిని గమ్యంగా మార్చుకోవాలి. లేకపోతే మనిషిలో అలసత్వం, నిర్లక్ష్యం పెరుగుతాయి. మనిషి మరల

పూర్తిస్థితికి జారిపోయే ప్రమాదముంది. అందుకే ఆస్థాయిసంది సరియైనప్లానింగ్ ప్రణాళిక, సమర్థత అవసరం.

నిరంతర శ్రమ చేస్తే విజయం తథ్యం అనుకోవటం తప్పు. నిరంతర శ్రమ విజయానికి మొదటి శత్రువు. శ్రమకు చెప్పింటే సమయానికి సమంగా విశ్రాంతికి కూడా సమయం కేటాయించాలి.

లోకజ్ఞానం మనిషికి చదువుతో వచ్చేదికాదా వస్తే అది ఉద్యోగం. మనమున్న తెలివితేటలతో లోకాన్ని అర్థం చేసుకోగలగటమే లోకజ్ఞానం. ఇది అనుభవంతో వృద్ధి చెందుతుంది. లోకజ్ఞానం మనిషిలోని మేధస్సుకు పదును పెడుతుంది. అది వ్యక్తిత్వానికో ఆభరణంలాంటిది.

ఇన్ని గుణాలతో ప్రయత్నం మొదలయిన తర్వాత ఎప్పటికప్పుడు ప్రయత్నంలోని అభివృద్ధిని లెక్కవేసుకుని మరింత కార్యదీక్షతో ముందుకు సాగాలి. అభివృద్ధిని అంచనా వేసేందుకు కొన్ని పరిధులు వున్నాయి. వాటిని ప్రతి నెలా యోచించి చూసుకోవాలి.

ఈ నెలకు కేటాయించిన పనిని సకాలంలో సక్రమంగా నిర్వహించగలిగారా?

కిందటి నెలకన్నా ఈ నెల పని వేగం ఏమన్నా పెరిగిందా?

ఈ నెలలో ఎన్ని రోజులువ్యర్థంగా గడిచాయి?

ఏదైనా పనిని ఐకాయిపెట్టారా? పెడితే అందుకు కారణాలు?

ఆ కారణాలు ఎంతవరకు సహేతుకం?

మిగిలినవారికి సంతృప్తి కల్గించే విధంగా మీ ప్రవర్తన ఉన్నదా?

సహాయకులకు తగిన సహకారాన్ని అందించారా ? మీ టాలెంట్స్ ఈ కాలంలో ఏమైనా పెరిగాయా?

పనికిరాని పనులతో కాలం గడిపారా? అలా అయితే ఇకపై వాటిని వదులుకోవటం ఎలా?

కార్యక్రమ సరళిలో ఏవేని తప్పులు దొర్లాయా?

ఎవరినైనా ముఖాముఖీ కలిసేందుకు భయపడ్డారా? అయితే ఏం చేయాలని?

మీ రంగంలో మిమ్మల్ని మించిన వారెవరైనా ఉన్నారా? ఉంటే వారిని మించేందుకు ఏమి చేయాలనుకుంటున్నారు?

మీ ఆత్మవిశ్వాసం పెరుగుతోందా? ఎవరివల్ల మీ ఆత్మవిశ్వాసానికి దెబ్బ తగులోంది? ఏయే సమయంలో అది ద్యోతకమవుతోంది?

మీ శక్తిసామర్థ్యాలన్నీ మీ ఆశయ సాధనలోనే ఉపయోగిస్తున్నారా?

ఈసారి మీరు నేర్చుకొన్న కొత్త విషయాలేంటి?

మీలో ఉన్న లోపాలేంటి? వాటిని నిర్మూలించటం ఎలా?

మీ స్నేహితులవల్ల మీ టైమ్ వృధా అవుతోందా?

మీ స్నేహితులు మీకన్నా తెలివైన వారా? కాదా?

ఎవరివల్ల మీలో చెడు స్వభావం తలెత్తుతోంది? వారిని వదులుకోవటం ఎలా?

ప్రతిరోజూ ఎంత సమయాన్ని ఆశయ సాధనలో వినియోగిస్తున్నారు? మిగిలిన వాటికెంత సేపు?

వీటికి జవాబులు ఓ డైరీలో ప్రతి నెలా రాసుకుని నెలనెలా పోల్చి చూసుకుంటూంటే గమ్యంఎంత దగ్గరలో వుందో స్పష్టంగా తెలిసిపోతుంది.

—కస్తూరి. రాజశేఖర్

1987 ఫిబ్రవరి

# చతుర

## జన్మదిన సంచిక

తెలుగు పత్రికా రంగానికి గర్వకారణమైన, అసంఖ్యాక పాఠకుల అభిమాన విపుల, చతుర మాసపత్రికలు 1987 ఫిబ్రవరి సంచికతో తొమ్మిదేళ్ళ సుదీర్ఘ సాహితీ సేవ పూర్తి చేసుకుని పదవఏట అడుగు పెడుతున్నాయి.

1986 మేలో 100వ సంచికలు వెలువడిన సందర్భంగా భారతీయ భాషా పత్రికా చరిత్రలోనే అపురూపమైన రీతిలో లక్షరూపాయల బహుమతులతో ప్రకటించిన కథలు, నవలల పోటీలో నెగ్గిన రచనల ప్రచురణ ఈ సంచికలతోనే ఆరంభ మవనున్నది.

రు : 10,000/- బహుమతి పొందిన తెలుగు నవలను 'చతుర' పాఠకులు ఈసంచిక లోనే చదువనున్నారు. ప్రథమ బహుమతులు పొందిన తెలుగు, తెలుగేతర భాషా విశిష్ట కథానికలతో విపుల సాహితీ జనమనోభి రామంగా వెలువడనున్నది. అనేక ఇతర ప్రత్యేకతలతో సర్వాంగ సుందరంగా వెలువడనున్న ఈ జన్మదిన సంచికల ధరమాత్రం మామూలే!



# మీరేమంటారు?

ఈనెల 'చతుర' ముద్రణలో ఉపయోగించిన క్రొత్త రకం టైపులోని వైవిధ్యాన్ని మీరు గుర్తించే ఉంటారు. అత్యంతాధునికమైన ఫొటో టైప్ సెట్టింగ్‌ను ఈ సంచికలో ప్రయోగాత్మకంగా ప్రవేశపెట్టటం ఈ మార్పుకు కారణం. ''చతుర ప్రపంచం'' ''చతుర కతలు'' ''మీలోని శక్తి'' ఫీచర్‌తప్ప మిగిలిందంతా ఫొటో కంపోజ్‌లో చేసినదే.

ఈ సందర్భంగా పాఠకులు గుర్తించవలసిన ఒక ముఖ్య విషయం ఏమంటే, ''చతుర'' మీకు ప్రతి నెలా 100 పేజీల ఒక సమగ్ర నవలను అందిస్తోంది. ఆ 100 పేజీల నవలనే ఈ నూతన విధానంవలన 70 పేజీలలోనే అందించగలిగాం. అందువలన అదనంగా మరికొన్ని ఫీచర్లను కూడా అందించే అవకాశం లభించింది సంచికలో.

ఈటైపు, ఈ పద్ధతి మీకెలా ఉంది? ''చతుర''కు ఈ విధానంవలన లభించిన అవకాశంతో ఇంకా పెద్ద నవల రావాలని కోరుకుంటున్నారా? లేక ఇపుడున్న సైజు నవలల్నే ప్రచురిస్తూ, అదనంగా మరిన్ని ఫీచర్లు ప్రచురిస్తే బాగుంటుందనుకుంటున్నారా?

మీ అభిప్రాయాలను తెలుపుతూ సవివరంగా రాయండి.

**చతుర**

ఈనాడు కాంపౌండ్, హైదరాబాద్-500482



# సలహాల రియాక్షన్

"నీ భర్తను పొరపాటునైనా వంటింట్లో అడుగు పెట్టనివ్వద్దు" అంది సూర్యకళ.

"అదేం?" ఆశ్చర్యపోయింది నాగమణి. ఆమె ఇంకా భర్త దగ్గర ఉమెన్స్‌లిబ్ గురించి ఉపన్యాసం దంచి, వంటలో అతని సహాయం తీసుకుందామనే ఆలోచనలోవుంది.

"నువ్వు ఏం కూరచేస్తున్నదీ నీ భర్తకు తెలియకూడదు"

"ఎందుకలా?"

"భర్తలు సాధారణంగా భార్యల వంటను వేలెత్తి చూపేది కూర విషయంలోనే. అందువల్ల కూర మాడినా, సరిగ్గా వుడకక అధ్వాన్నంగా తయారైనా, దాన్ని పక్కింటివాళ్ళిచ్చిన కూరని చెప్పి భర్తతో తినిపించాలి. 'పొరుగింటి పుల్లకూర రుచి అనే సామెత ప్రకారం, అది ఎలా వున్నా పక్కింటివాళ్ళదని చెబితే చాలు- అతను లొట్టలేసుకుంటూ తింటాడు. కూరతోపాటు, ఇంట్లో ఊరగాయేదో వడ్డించి, వాళ్ళు కూర ఇవ్వటంవల్ల ఇంట్లో కూర చేయటం మానేశానంటే అతను నీ పొదుపుని తలుచుకుని మరింత సంతోషిస్తాడు"

"ఇంకా?"

"సినిమాలకీ, ఇతర ప్రోగ్రాములకీ వెళ్ళాల్సినప్పుడు ముస్తాబుతో వీలైనంత ఆలస్యం చేయాలి. వెంటనే తయారై పోయావనుకో, సిటీ బస్సులో వేసుకెళ్తాడు. ఆ తొక్కిడిలో నిలబడి, ఆపసోపాలుపడి థియేటరుకి చేరుకునేసరికి ఉత్సాహమంతా నీరుగారి ఎంజాయ్‌మెంటు నేదే లేకుండాపోతుంది. కనుక లేట్ చేస్తే అతను విధిలేక ఆటో పిలుస్తాడు. అందులో విలాసంగా కూర్చుని వెళ్ళొచ్చు"

"నిజమే సుమీ!"

"అతనికి సిగరెట్లు, కిళ్ళీలాంటి చిన్న చిన్న దురలవాట్లుంటే నువ్వు పట్టించుకుని, వాటిని మానుకోమని గొడవ చెయ్యొద్దు. ఎందుకంటే, నువ్వేమన్నా డబ్బులు దుబారా చేసినప్పుడు అతను దెప్పితే, నువ్వు ఎదురుచెప్పటానికి అతనికి అలాంటి అలవాట్లేవో కొన్ని వుండాలి"

"సరే"

"నా ఈ సలహాలు మచ్చుకి కొన్ని మాత్రమే! వీటికి నీ తెలివితేటలుజోడించి కొత్త సంసారాన్ని దిద్దుకొని భర్తను కొంగున కట్టుకో" అంటూ కొత్త పెళ్ళి కూతురు నాగమణికి క్లాసు తీసుకోవటం ముగించింది-వైవాహిక జీవితంలో ఆమె కంటే మూడేళ్ళు సీనియరైన సూర్యకళ.

కొన్నాళ్ళ తర్వాత-

"ఎలావుంది కొత్త కాపురం?" అడిగింది సూర్యకళ.

"ఏం చెప్పమంటావక్కా!" ఆమె పరామర్శకి ఒక్కసారే **బావురుమంది**




# కతలు



నాగమణి.

కాసేపటికి, సూర్యకళ ఓదార్పు పూర్తయ్యాక నాగమణి ఇలావాపోయింది-

“నువు చెప్పినట్టే కూర మాడినా, రుచిలో తేడా వచ్చినా పక్కింటివాళ్ళ మీదకి నెట్టసాగాను. దాసికి ఆయన

'వాళ్ళూ వీళ్ళూ ఇచ్చిన కూరలతో కాల క్షేపం చేసేద్దామనుకుంటున్నావా? ఒక్క కూర వండిపెట్టటానికి కూడా నీకెంత బద్ధకం?' అని నన్ను తిట్టిపోసి, పొరు గిళ్ళనుంచి అలా కూరలూ నారలూ ఏమీ తీసుకోవద్దని ఆజ్ఞ జారీ చేశారు.

"సినిమాలకి వెళ్ళేటపుడు ముస్తాబు గురించి లేట్ చేస్తున్నానని చివాట్లుపెట్టి పౌడర్లు, కోల్డ్ క్రీముల్లాంటి కాస్మెటిక్స్ కొనటం మానేశారు.

"పెళ్ళయిందికదా, ఇక పొదుపుగా వుండకపోతే బాగోదంటూ సిగరెట్లు తనం తట తనే మానేశారు...ఇక నాకేది దారి నువ్వే చెప్పు"

తను భర్తపై ప్రయోగించి విజయ వంతంగా అమలుపరిచిన సూత్రాలు నాగమణి విషయంలో ఎందుకు వికటించాయో గ్రహించలేకపోయిన సూర్యకళకి ఆమెకేం చెప్పాలో వెంటనే తట్టలేదు!

—జాకీ

# కిటుకు

డాక్టర్ ఆనందరావ్ క్లినిక్‌లో పనిచేసేందుకు కాంపౌండర్‌గా జాయిన యాడు రాజారావు, ఆరోజే.

రోగులకు డాక్టర్‌గారి హస్తవాసి మంచిదని గట్టి నమ్మకం. అందుకే దూర ప్రాంతాలనుంచి కూడా పేషెంట్స్ వస్తున్నారు అతడి దగ్గరకు. క్లినిక్ సదా కిటకిటలాడుతోంది రోగులతో.

క్లినిక్ తెరిచేది తొమ్మిదికయినా ఎనిమిది గంటలనుంచే పేషెంట్స్ రాసాగారు. వచ్చిన వాళ్ళందరికీ నంబర్ వేసున్న టోకెన్స్ ఇవ్వసాగాడు రాజారావు. టోకెన్‌నెంబరు పిలిచినపుడే ఆరోగి డాక్టర్‌గారి కన్సల్టింగ్ రూంలోకి వెళ్లాలి. అంతవరకూ ఓపికగా కూర్చోవాల్సిందే.

సరిగ్గా తొమ్మిది గంటలకు డాక్టర్ గారు క్లినిక్‌లో అడుగుపెట్టారు. కన్సల్టింగ్ రూంలోకి వెళ్ళిన ఐదునిముషాల తరువాత బజర్ మోగించారు. లోని కొచ్చిన రాజారావుతో "పేషెంట్స్‌ని పంపించు!" అని చెప్పారు.

"ఓ.కె. సార్!" అని చెప్పి మొదటి పేషెంట్‌ని పిలిచాడు కాంపౌండర్ రాజారావు.

లోనికొచ్చిన పేషెంట్ "నమస్కారం డాక్టర్‌గారూ! వారంనుండీ ఒకటే తలపోటు! ఎన్ని టాబ్లెట్స్ మింగినా ఫలితంలేదు!!" అన్నాడు తన బాధ వివరిస్తూ.

"అలాగా! ఇంతకూ మీ హాబీలేమిటి" అడిగాడు ఆనందరావ్.

చెప్పాడు పేషెంట్.

ఆ తర్వాత నిన్న, మొన్న, అంతకు ముందు రోజు అతడు ఏమేం చేశాడో, ఏమేం తిన్నాడో అడిగి తెలుసుకొన్నాడు ఆనందరావు. ఆ తరువాత ప్రిస్క్రిప్షన్ రాసిచ్చాడు.

రెండో పేషెంట్ వచ్చాడు. "డాక్టర్ గారూ! నాలుగు రోజుల్నుంచీ ఎడమ చేయి చచ్చుబడిపోయినట్లుంటోంది" అంటూ.

"మీ హాబీలేమిటి?" అడిగాడు ఆనందరావు. చెప్పాడు పేషెంట్.

నిన్న, మొన్న, అంతకుముందురోజు కూడా అతడేమేంచేశాడో, తిన్నాడో వివరాలురాబట్టాడు డాక్టర్.

అతరువాత ప్రిస్కిప్షన్ రాసిచ్చాడు.

ఛాతీ నెప్పితో వచ్చిన మూడో పేషెంట్, కాలు విరగ్గొట్టుకొచ్చిన నాలుగో పేషెంట్, ఉబ్బసంతో వచ్చిన ఐదో పేషెంట్‌లను కూడా డాక్టర్ అదే విధంగా వారి, వారి హాబీలేమిటో ఏమేం చేశారో, ఏమేం తిన్నారో విచారించాక గానీ ప్రిస్కిప్షన్‌లు రాసివ్వలేదు.

ఆఖరి పేషెంట్‌ను కూడా పంపించాక ఉండబట్టలేక అడిగేశాడు రాజారావు.

"సార్! మీరు ప్రిస్కిప్షన్ రాసివ్వడానికి ముందు ఆయా రోగుల హాబీలు ఏమిటో తెలుసుకోవడం అంతముఖ్యమా" అంటూ.

డాక్టర్‌గారు కాస్త అనుమానంగా చూశారు.

"ఇది నా వృత్తిసీక్రెట్. నువ్వు

నమ్మకమయిన వాడిలా కనిపిస్తున్నావు కనుక చెబుతున్నాను. మళ్ళీ ఎవరిదగ్గిరా అనకు.ఆపేషెంట్స్ హాబీలను బట్టి వాళ్ళ ఆర్థిక స్తోమత అంచనా వేసుకొంటాను. అలాగే ఎక్కడికెళ్లారు, ఏంతిన్నారు అనేదాన్ని బట్టి ఆరోగ్యం సంగతి... వీటన్నింటిబట్టి ఆ తర్వాత వాళ్ళ వాళ్ళ దగ్గర్నుంచి ఎంత ఫీజు లాగవచ్చో నిర్ధారించుకొంటాను" నవ్వుతూ చెప్పారు డాక్టర్ ఆనందరావుగారు.

—కె. హరిబాబు

# పోటీ

నటవిరాట్ దాసుగారు తెలుగుతెరమీదకు తారాజువ్వలా దూసుకొచ్చారు. నటించిన చిత్రాలన్నీ వరుసగా బాక్సాఫీస్ దగ్గర ఘనవిజయం సాధించాయి. దాంతో అప్పటికే ఫీల్డులో అగ్రస్థానంలోఉన్న ప్రముఖ హీరోల పక్కన స్థానం సంపాదించడానికి ఎంతోకాలం పట్టలేదతనికి. ఊరూరా అభిమాన సంఘాలు కూడా వెలిశాయి.

అనతికాలంలోనే స్వంత బానర్‌కింద చిత్రాలు నిర్మించసాగాడు దాసు. అదృష్టవశాత్తూ అవికూడా అఖండ విజయం సాధించాయి.

గర్వం తొంగిచూసింది దాసులో. కొత్త కొత్త ప్రయోగాలు చేయసాగాడు చిత్రాలద్వారా. అనేకమంది కొత్త టెక్నీషియన్లను తెలుగుతెరకు పరిచయం చేశాడు.

కాలగర్భంలో పదేళ్లు గడిచాయి. అప్పటికి ఏక్షన్ హీరోల యుగం ఆరంభమయింది. ప్రజలు వాళ్ళకు బ్రహ్మరథం పట్టసాగారు.

దాస్ నటించిన చిత్రాలు వరుసగా పరాజయం పొందసాగాయి. దాంతో అప్పటివరకూ అతనితో చిత్రాలు నిర్మిస్తూ వచ్చిన ప్రముఖ సంస్థలన్నీ కొత్త హీరోల వైపు మొగ్గు చూపసాగారు.

దాసుకు ఏం చేయాలో తోచలేదు.

తిరిగి పూర్వపు వైభవం సంపాదించడం ఎలా? అని రాత్రింబవళ్లు తెగ మథనపడిపోనారంభించాడు. ఆ సమయంలో కథ, మాటలు, పాటలు, ఎడిటింగ్, కెమేరా, దర్శకత్వం అన్నీ నువ్వే వహిస్తూ ఓ భారీ చిత్రం నిర్మిస్తే అదో కొత్త ప్రయోగంగా కనిపించి తగ్గిన పలుకుబడినీ లాభాల్నీ తిరిగి సాధించవచ్చు అని అతడి సలహాదారు సెలవిచ్చాడు.

నిజమేననిపించింది దాస్‌కు.

వెంటనే భారీతారాగణంతో ఓ భారీ తెలుగు చిత్రాన్ని నిర్మించి ప్రేక్షకులమీదికి వదిలాడు.

మొదటివారం అంతంతమాత్రంగా ఆడిందాచిత్రం. రెండోవారం పూర్తిగా రష్ తగ్గిపోయింది. ఆశ్చర్యంకరంగా మూడోవారం నుంచి పుంజుకుని వంద రోజులవరకూ హౌస్‌ఫుల్ కలెక్షన్లతో ఆడిందాచిత్రం!

ఆ చిత్ర విజయాన్ని పురస్కరించుకొని దాస్‌ను ఇంటర్వ్యూ చేయడానికొచ్చాడో విలేఖరి.

"మొదటి రెండు వారాల్లోనూ ప్రేక్షకుల్ని ఆకర్షించడంలో విఫలమయిన మీ చిత్రం వందరోజుల వరకూ ఘనంగా ఆడింది. ఇదెలా సాధ్యమయిందో చెప్పగలరా?" అనడిగాడు విలేఖరి.

"ఆ విషయం నేనెలా చెబుతాను?"

చిద్విలాసంగా అన్నాడు దాస్.

ఈ విషయం గోప్యంగా ఉంచుతానని ప్రామిస్ చేస్తూ కాళ్ళా వేళ్ళా బడిన తప వాత దాస్ నెమ్మదిగా చెప్పాడిలా!

"మా చిత్రంలో ఉన్న కథను సవివరంగా రాయగలిగినవారికి పది లక్షలు బహుమతిగా ఇస్తామని ప్రకటించాం. దాంతో ప్రేక్షకులు ఆ బహుమతి గెలుచుకొందామన్న ఆశతో ఒకటికి పదిసార్లు విరగబడి చూశారు. కానీ దురదృష్ట వశాత్తూ ఎవరూకూడా మా చిత్ర కథను వివరించలేకపోయారు!" అన్నాడు దాస్ చిద్విలాసంగా.

-శ్రావ్య

# 'ఆశల శిఖరాలు' నవలపై చతుర సమీక్షలు

సెప్టెంబరు 'చతుర' నవల 'ఆశల శిఖరాలు'పై పాఠకుల నుంచి మాకు అందిన 'చతుర సమీక్ష'లలో ఉత్తమంగా వున్న మూడింటిని ఈ సంచికలో ప్రచురిస్తున్నాము. ఈ శీర్షికలో ఉత్సాహంగా పాల్గొన్న పాఠకులందరికీ మా కృతజ్ఞతలు! బహుమతులు పొందిన ముగ్గురికీ మా అభినందనలు!

## ముగింపు బాగుంది

(ప్రథమ బహుమతి రు. 100/- పొందిన సమీక్ష)

**1986** సెప్టెంబరు 'చతుర' నవల 'ఆశలశిఖరాలు'చాలాసామాన్యంగావుంది. నవలలో చెప్పుకోదగ్గ వెరైటీ లేదు. టెంపో అంతగాలేదు. ప్రారంభంలో రజనీకాంత్ జ్ఞాపకాలలో అనామికను ప్రవేశపెట్టి, అనామికను అర్థాంతరంగా త్రుంచేసి, ఆ వెంటనే మరో పాత్ర సునీతను వేశ్యా గృహంలో హీరో రజనీకి తారసిల్లజేయడం, అక్కడ నుండి ఆమె కథను ఫ్లాష్‌బాక్‌లో చెప్పడం సినిమాటిక్‌గా ఉంది తప్ప ఒరిజినాలిటీ ఎక్కడా లేదు. నవలలో దుర్గమ్మ, సుందరి పాత్రలలో కొంత విలనీని, అమృతవల్లి పాత్రలో సెంటిమెంట్‌ను చొప్పించి హీరో తండ్రి పాత్ర మీద సానుభూతి కలిగేటట్లు చేశారు. నవల మధ్యలో హీరో తెలుగు సినిమాలోలాగా కాస్ట్లీగా ఉండటంకోసం మిలియనీర్ మామయ్యను సృష్టించారు. అయినా ఫర్వాలేదుగానీ పాఠకుల హృదయంలో పాత్రలను నాటుకొనేట్టు మాత్రం చేయలేకపోయారు. కేవలం ఓ నవలగానే మిగిల్చారు.

సునీత ఫ్లాష్‌బాక్‌లో; రజనీకి, ఆమెకు వివాహ విషయమై సునీత తండ్రి రజనీ పిన్నితో మాట్లాడినట్లూ, వరకట్న విషయమై అతనితో చెప్పిన విషయాలు, వెంటనే ఎంతో గాఢంగా ప్రేమించుకున్న రజనీకి తెలియజేయకుండా, కనీసం అతనితో కలవకుండాచేయడం, ముసలి తల్లిదండ్రులచేత డబ్బు సంపాదన చేయించడం, హీరోయిన్‌చేత డాన్సులు చేయించడం వగైరాలవల్ల డబ్బు సంపాదించి పెట్టడం ఒరిజినాలిటీకి చాలా దూరంగా ఉండటమే కాకుండా ఎబ్బెట్టుగా ఉంది. నవలకు 'ఆశలశిఖరాలు' అని కాకుండా 'ఓ సునీతకథ' లాంటిపేరు మరేదైనా పెడితే బాగుండేదేమో!

మమత పాత్ర సృష్టి ఓసాధారణ స్త్రీ పాత్రలా ఉంది; నూతనత్వం లేదు. ఈ నవలలో చెప్పుకోతగ్గది ముగింపు. సామాన్య పాఠకుడు ఊహించనిరీతిలో రచయిత ముగింపు పాఠకుల ఊహలకు వదలివేయటం మాత్రం చాలా బాగుంది.

–గ్రంధి వెంకటరాజు,
గర్భాం–522 102

# అపార్థాల మయం

(ద్వితీయ బహుమతి రు. 75/- పొందిన సమీక్ష)

"నన్ను అర్థం చేసుకోలేకపోయినా ఫర్వాలేదుగానీ, అపార్థం చేసుకుంటేనే ఇబ్బంది" అన్నాడో పెద్దమనిషి.

పైవాక్యాలు అక్షర సత్యాలు. మనం నివసిస్తున్న సమాజంలో మనల్ని సక్రమంగా అర్థం చేసుకునేవారికన్నా, అపార్థం చేసుకునేవారే అధికం. 'ఆశల శిఖరాలు' నవలలో మనకు గోచరించే పాత్రలన్నీ ఒకర్నొకరు అర్థం చేసుకోవడానికి బదులుగా అపార్థం చేసుకొని అభాసుపాలై జీవితాలను దుఃఖ భాజనం చేసుకుంటాయి! రజనీకాంత్ సునీతనూ, సునీత రజనీకాంత్‌నూ, మమత డాక్టర్ పద్మినినీ, రజనీకాంత్‌నూ; అపార్థం చేసుకొని కడగండ్లను కోరి తెచ్చుకుంటారు.

మనిషి ఆశాజీవి. ఆశలు అత్యాశలుగా పరిణమించినపుడు అవి ఎండమావుల్లా రూపొంది ఆశాజీవిని అభాసుపాలు చేస్తాయి. తానూహించినదొకటైతే తారసిల్లేది మరొకటవుతుంది. ఏకొద్దిమంది జీవితాలో వడ్డించిన విస్తరిలా వుంటాయి. జీవిత గమనంలో కాలం వడ్డించే ఎదురు దెబ్బలకు తట్టుకోలేక హతాశులై పక్కదారులు తొక్కి చెడిపోవడం కద్దు.

రజనీకాంత్ జీవితం అలాంటి వొడిదుడుకులతోనే నడిచింది. అతడు పుట్టి పెరిగింది కడగండ్లలోనే! ఉన్నత విద్యనభ్యసించడానికి నానాయాతనలపాలై కన్నతండ్రి అంటూ ఒకడున్నా లేనివాడే అయ్యాడు. ఎట్టకేలకు వైద్యవిద్యనభ్యసించడంలో కృతకృత్యుడైనప్పుడు మేనమామ రజని జీవితంలో లాటరీలతలా తారసిల్లాడు. ఏమీ లేనివాడు ఒక శుభోదయాన అన్నీ ఉన్నవాడై పోయి స్నేహితుల సహవాసంతో విలాస జీవితాన్ని రుచి చూస్తాడు. అయినా జీవిత శిఖరాలనధిరోహించలేక మానసిక వ్యధకు గురియై తాగుడుకూ, వ్యభిచారానికీ బానిస అవుతాడు. ప్రేమించినదొకరిని, పెళ్ళిచేసుకున్నది మరొకరిని.

రజని పిన్ని సుందరమ్మ మొదట్లో ఎత్తులు జిత్తులతో భర్తను కొంగున కట్టుకొని, రజనీకాంత్‌ను ఈసడించుకుంటుంది. అతనికి మేనమామవల్ల డబ్బు దస్కా లభించాక ప్లేటు ఫిరాయిస్తుంది. సమయం చూసి రజనీ భార్య మమతను తప్పుదారి పట్టిస్తుంది. మమత కూడా సుందరమ్మ మాటలను విశ్వసించి,డబ్బుకు ప్రాధాన్యత నిచ్చి, భర్త ఆశయాలనుకాలరాచి, అతన్ని అనరానిమాటలతో దూరంచేసుకుంటుంది. డాక్టర్ పద్మినితో భర్తకు సరాగాల నంటగట్టి ఆవిడను ఆస్పత్రినుండి వెడలగొడుతుంది.

రజనీకాంత్‌ను మనసారా ప్రేమించిన సునీత, కోరిన వరకట్నాన్ని రజని తల్లిదండ్రులకు సమర్పించాలన్న సంకల్పంతో భరతనాట్యం అభ్యసించి, పెద్ద హోటల్‌లో కాబరే డాన్సులకు అంగీకరించి నృత్యం చేస్తున్నపుడు రజనీ కంటబడుతుంది. ఈ ఘట్టం హృదయాల్ని కదిలించేలా వుంది.

మొత్తంమీద నవలలోని పాత్రలన్నీ 'ఆశల శిఖరాల' నధిరోహించడానికి నానాయాతనలనుభవిస్తాయి. ఆశల శిఖరాలు అందని శిఖరాలుగా రూపొందడం ఈనాటి సమాజంలో సహజమే.

—యం. నిర్మలాదేవి
ఊటూరు

# సినిమా కథలా వుంది

(తృతీయ బహుమతి రు. 50/- పొందిన సమీక్ష)

**చతుర** వలె ఉత్తమ నవలలు అందించే పత్రిక మరొకటి లేదు. ప్రతి నెలా వాటిని ఆసక్తిగా చదివేవాళ్లలో నేనొకడిని. కాని ఈ నెల 'అచల శిఖరాలు' నవల అందుకు భిన్నంగా వుంది. కొందరు నవలల్ని రాసేటప్పుడు 'సినిమా మసాలా' దృష్టితో తమ కథలను అల్లుకొంటారు. అట్లా అల్లిన కథలా ఉందిది. రజని పాత్రచుట్టూ అల్లిన కథ, తారసిల్లిన పాత్రలు అన్నీ అలాగే ఉన్నాయి.

లక్షాధికారి 'మామయ్య' మధ్యలో వస్తాడు. పడవంత కారు, లంకంత ఇల్లు, ఊరిలో అడుగులకుమడుగులొత్తే జనం. కనీసం 20 సంవత్సరాలుగా, చెల్లెలిపై అభిమానంవున్నా చెల్లెలి విషయం తెలుసుకోకనే గడిపేస్తాడు. పైగా సినిమాల్లో వలెనే అతనికో అందమైన కూతురు కూడా!

రజని తండ్రి ఖచ్చితంగా పెళ్ళానికి భయపడే మనిషి. అట్లాంటి మనిషి "ఏంటే బోడిపెత్తనాలు చేస్తున్నావు..." అనే డైలాగును వాడేస్తాడు. పెళ్ళానికి భయపడి కన్నతల్లిని, కుమారుని వదలివేసిన మనిషి ఉపయోగించే డైలాగు కాదది.

రజని పినతల్లి సుందరి. ఈమె ఓ ఆడవిలన్. ఎంత బాధ అయినా అందరూ ఆమె చెప్పినట్టే నడచుకొంటారు. రజని పినతల్లిని పల్లెత్తు మాట అనలేదు. కథలో ముఖ్య నిర్ణయాలను ఈమె ఎవరికీ తెలియకుండా తీసుకొంటుంది. రజనీని వాళ్ళ మామయ్య కలిసిన తర్వాత సుందరి పాత్ర లేకపోయినా కథ అదేవిధంగా జరిగివుండేది.

సునీత మొదటినుండి వాంప్ హీరోయినే. రచయిత ఆమెను వర్షంలో తడిపేసి ఆమె అవయవాల్ని హీరోకీ, మనకూ చూపాడు. ఇది కథకు సంబంధంలేని సినిమా సన్నివేశం. రజని స్నేహితుల వల్ల 'మందు' రుచి తెలుసుకొన్నాడు. ఏ స్త్రీ అయినా ఒకటే అని కాబరే డాన్సర్‌ని ఆశపడ్డాడు. ఆ తరువాత భార్యతో ఆనందంగా కాపురం చేశాడు. భార్య అనుకూలంగావుంటే తాగుబోతు తిరుగుబోతు కాడు. సునీత పాత్ర వ్యభిచార గృహంలో కాక తన నర్సింగ్ హోమ్‌లోని బెడ్‌పైనే తారసిల్లాలి. సునీత రజనీ తనకోసం వ్యభిచార గృహాలు వెతుక్కుంటూ వస్తాడని ఎదురుచూసినట్లున్నది. 'ఆ అర్థంలేని' కారణాన్ని చెప్పేందుకు చేసిన ప్రయత్నమే లేదు.

నర్సింగ్‌హోమ్ కట్టడానికి రజని పడేపాట్లు అర్థంలేనివి. నర్సింగ్‌హోమ్ నిర్మాణం భుజంగరావు నిర్ణయమేకాని రజనీదికాదు. దానిపై పెట్టుబడి భుజంగరావు చూస్తాడుగాని, రజనికాదు. నర్సింగ్ హోమ్ నిర్మాణ బాధ్యత అంతా రజనీ జీవితాశయమన్నట్టు, అతనిపై పెట్టేసి సినీ హీరో బాధలుపడినట్లుగా పడనిచ్చి ఆఖరికి భుజంగరావును నర్సింగ్‌హోమ్ ప్రారంభోత్సవం రోజునే చంపేశారు. భుజంగరావు చనిపోకపోయినా కథకు ఇబ్బందిలేదు.

నవలలో స్పందన కలిగించే పాత్రలు లేకపోవటం ఓ పెద్ద వెలితి.

—ఎ. సుబ్రహ్మణ్యాం

తడుకు, చిత్తూరుజిల్లా.




ఈ శీర్షికద్వారా ప్రతి నెలా చతురలో వెలువడే నవలను సమీక్షించే అవకాశాన్ని పాఠకులకు కల్పిస్తోంది 'చతుర' "చతుర సమీక్ష" శీర్షికలో పాల్గొనే పాఠకులు 'చతుర'లో ప్రచురించే నవలపై ఏనెల కానెల తమ అభిప్రాయం వెల్లడిస్తూ, ఆ నవల ఎందువల్ల తమను ఆకట్టుకుందో, లేదా ఎందువల్ల తమకు ఆ నవల నచ్చలేదో వివరిస్తూ, రచన బాగోగుల గురించి రాయాలి. పాఠకులు గమనించవలసిన మరికొన్ని ముఖ్యాంశాలు:

1. "చతుర సమీక్ష"కు పంపే మీ రచన అరఠావుకి మించకుండా కాగితానికి ఒకవైపునే రాయాలి.
2. ఏ నెల నవల సమీక్షలు ఆ నెల20వ తేదీలోపు మాకు అందేలా పంపాలి.
3. మీ సమీక్షకు తప్పనిసరిగా ఈ కింది కూపన్‌ను జతపరచాలి.
4. కవర్‌పై "చతుర సమీక్ష"కు అని పేర్కొనాలి.

మాకు అందిన పాఠకుల సమీక్షలలో ఉత్తమమైనవిగా మేము ఎంపిక చేసిన మూడింటిని ప్రచురించి రు. 100, రు. 75, రు. 50 చొప్పున నగదు బహుమతులు పంపగలం.

ఇక విరివిగా ఈ శీర్షికలో పాల్గొని బహుమతులు అందుకొనేవంతు పాఠకులదే!

---

**కూపన్**

నవంబరు 'చతుర' నవల : బావి

సమీక్షకుని పేరు...............................

చిరునామా...............................

...............................

...............................

# సితార

• మీరు అభిమానించేది ఏ తారనైనా సరే
మీకు కావల్సింది సితార

• మల్టీకలర్ ముఖచిత్రమే కాదు, అనేక రంగుల సెంటర్
స్ప్రెడ్‌తో మిమ్మల్ని మురిపించి, మైమరపిస్తుంది -
సితార

ఆకాశంలో వెలిగేది ధ్రువతార
సినీ జగతిలో వెలిగేది సితార

• సినిమాకు సంబంధించిన అన్నిరకాల వార్తలకు,
వ్యాఖ్యలకు, కబుర్లకు, విమర్శలకు పెట్టింది పేరు
సితార



ఈనాడు కాంపౌండ్, సోమాజిగూడ
హైదరాబాద్ - 500 004

Edited, Printed and Published by Ramoji Rao for Vasundhara Publications Printed at Colorama Printers Private Limited, 7-1-19, Begumpet, Hyderabad-500 016; TEL-220728. **CHATURA** Telugu monthly, Eenadu Compound-**500 482.**

బాంబినో ఒక అద్భుతమైన వెర్మిసెల్లిని. పరిశుభ్రమైన పద్ధతిలో అధునాతన ఇటాలియన్ యంత్రములతో తయారు చేయబడినది. మిక్కిలి ప్రొటీన్లు కలిగి యుండి కొవ్వు పదార్థము లేకుండుటయే బాంబినో విశిష్టత. వండినప్పుడు కాని, తరువాత కాని, ముద్దగా కాక పోవుటయే బాంబినో ప్రత్యేకత. నిమిషములలో బాంబినోతో ఎన్నో రకములైన నోరూరించే వంటకాలు, ఫలహారాలు తయారు చేయవచ్చును. ఇంకా బాంబినోతో ఎంతో పొదుపు కూడా. నేడే వాడి చూడండి. మీకే తెలుస్తుంది.



**బాంబినో పకోడా**

మూడు కప్పుల నీళ్ళలో ఒక కప్పు బాంబినో ఉడికించండి. ఉల్లిపాయలు 2, ఒక ఆలు దుంప, చిన్న అల్లం ముక్క తరిగి ఉంచండి. ఒలిచిన వెల్లుల్లి నుండి 5 పాయలు ముద్ద చేయండి. దానిని బాంబినోలో కలపండి. ఒక కప్పు శనగ పిండి వేసి చిక్కటి ముద్ద అయ్యేవరకు నీళ్ళు పోసి కలపండి. మూకుడులో నూనె మరగించి ఒక్కొక్క స్పూన్‌తో ము తీసి అందులో వేయండి బంగారు గోదుమ రంగు వచ్చే వరకు వేగిన తరువాత దించి పచ్చడితో కాని టొమోటా సాస్‌తో వడ్డించండి.

## రుచిలో కమ్మదనం
## ఖర్చులో పొదుపుతనం
## అదే బాంబినో గొప్పతనం

బాంబినో వంటల విధానం తెలిపే పుస్తకం కొరకు వ్రాయండి.

జన జీవన్ ఫుడ్స్
ప్రైవేట్ లిమిటెడ్
1వ ఫ్లోర్, బషీర్‌బాగ్ ప్యాలెస్,
హైదరాబాద్.









# వెర్మిసెల్లిని

స్వీటైనా ఖారా అయిన బాంబినోతో రుచే రుచి!



associate